ఆధునిక సాహిత్యంలో

అనర్ఘ రత్నం-10

# 'రామచంద్ర విజయము

"శోభనాచలంగారి పెరటిలో జరుగుచున్న మహాద్యూతమునందు మొహరీలు, వరహాలు, రూపాయలు, అణాలు, డబ్బులు కూడ బందెములుగాఁ బెట్టి దారపుత్రాదు లన్నవస్త్రములు లేక మలమల మాడుచు నిత్య శివరాత్రులును, నేకాదశములును సలుపుచున్నను దానిని లక్ష్యపెట్టక, యహోరాత్రములు వేదాంతులవలె బంగారమును జిల్లపెంకులుగ జూచుచు వినోద సముద్రమునందు మునిగితేలుచున్న యనేక నలచక్రవర్తులును, ధర్మరాజులును నా చింతచెట్టు క్రింద గొలువుదీర్చి యుందురు.

"రామచంద్ర విజయము'' తొలి తెలుగునవలల్లో మేలుబంతి, తొలినవల 'రాజశేఖర చరిత్ర'' ఒరవడిని దిద్దితీర్చింది. సంఘవిద్రోహుల ఖండన, మూఢాచారముల హేళన యిందులో బాగా కనిపిస్తాయి. సద్వర్తనుడైన రామచంద్రుడనే ఆశ్రయహీనుడు, నిస్సహాయుడునైన యువకుడు తాను లోనైన కష్టనిష్ఠురాల నే విధంగా జయించి కడకు జీవితంలో కుదుటపడతాడో చక్కగా చిత్రిస్తుంది యీ నవల. ఇందులోని పురస్థల వర్ణనలు, పాత్రచిత్రణ, ఆచార వ్యవహార వివరాలు రచయిత కాలంనాటి ఆంధ్రదేశాన్ని కళ్ళకు కట్టేటట్టు చేస్తాయి. రచన మృదుమధురం. ధారాశుద్ధి మాట చెప్పనక్కర్లేదు.


21129
30-9-78
రామచంద్ర
విజయము
చిలకమర్తి
లక్ష్మీనరసింహము
21129
30/9/78

*Modern Classics - 10*
RAMACHANDRA VIJAYAMU

*By*
"Kala Prapoorna"
CHILAKAMARTHI LAKSHMI NARASIMHAM

*Publishers* :
M. SESHACHALAM & Co.

*First Edition* : JULY, 1970
EMESCO POCKET BOOKS

*Printers* :
HINDU PRESS, MACHILIPATNAM

*Cover Design* :
BAPU

*Distributors* :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
Rashtrapathi Road, Secunderabad.

Rs. 2/-




129

21129
30-9-70

# ఉపోద్ఘాతము

చిరస్మరణీయులైన తెలుగు రచయితలలో ఒకరు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు.

చిలకమర్తివారనగానే సాధారణంగా ఆయన గయోపాఖ్యానమూ, అందులోని 'అల్లుడా రమ్మని ఆదరంబున బిల్వబంపు మామను బట్టి చంపగలమె?....' వంటి కమ్మని పద్యాలూ స్ఫురణకు రావడం పరిపాటి. ప్రసిద్ధ నాటకకర్తగా, ప్రముఖ కవిగా ఆయన అందరికీ సుపరిచితులు. నవల, ప్రహసన జీవిత చరిత్ర, స్వీయచరిత్ర మొదలైన సాహిత్య ప్రక్రియలలో కూడా ఆయన రచనలెన్నో వెలయించిన కళాప్రపూర్ణులు. పత్రికలు కూడా నిర్వహించారు. "భరతఖండంబు చక్కని పాడియావు" అనే దేశభక్తి ప్రబోధాత్మకమైన పద్యం చెప్పిన దేశభక్తులు. సంఘ సంస్కరణాభిలాషులు. ఒక్కమాటలో చెప్పవలెనంటే. ఆయన బహుముఖ ప్రతిభాశాలి.

నవలారచనలో కూడా చిలకమర్తివారు అందెవేసిన చేయి అనడం అత్యుక్తికాదు. ఆయన సాంఘిక నవలలు తెలుగువారి జీవితాన్ని కళ్ళకు కట్టునట్లుగా తెలియజేసే చక్కని రచనలవి. ఆ నవలల్లో కనిపించే వ్యక్తులు నూటికి నూరుపాళ్ళు తెలుగువారు. వాళ్ళ ఆచార వ్యవహారాల్లో, వేషభాషలలో తెలుగుదనం కనిపిస్తుంది— ఒక విధంగా చూస్తే, అవి కేవలం నవలలుకావు. సాంఘికచరిత్రలు కూడ.

చిలకమర్తి నవలల్లో రామచంద్ర విజయానికి ఒక ప్రత్యేకత లేకపోలేదు. అది గణపతివలె హాస్యరసబంధురమైన రచనకాదు. కరుణారస ప్రధానమైన కమ్మని రచన. 1894 లో చింతామణి పత్రిక నిర్వహించిన నవలల పోటీలో రామచంద్ర విజయానికి ప్రథమ బహుమతి లభించింది. నాటినుంచీ నేటిదాకా ఇది పాఠకలోకాన్ని అలరిస్తూనే ఉన్నది.

మంచి చెడ్డలమధ్యా, సత్యాసత్యముల మధ్యా జరిగిన సంఘర్షణ సజీవంగా చిత్రించబడిన నవల ఇది. కనుకనే ఇందులో ధర్మరాజువంటి పాత్రలూ కనిపిస్తాయి; మేకతోలుకప్పుకున్న పులులూ కనిపిస్తాయి. తొలుత అసత్యానిదే పైచేయిగా గోచరించినా, నిజం నిప్పువంటిది కాబట్టి, చివరికి సత్యానికే విజయం లభిస్తుంది. మంచి జయిస్తుంది. మాయమర్మములూ, కల్లకపటములూ ఓడిపోతాయి.

రామచంద్ర విజయంలోని కథానాయకుడు రామచంద్రుడనే చిన్నవాడు. అతనికి తలిదండ్రులు లేరు. చెప్పుకోదగిన బంధువులూ లేరు. అతనివద్ద ఉన్నవల్లా సత్ప్రవర్తనా, సత్యనిరతియు. జీవితంలో అడుగడుగునా అతడు అవమానాలకూ, కష్టాలకూ పాల్పడ్డాడు. అయినా వాటిని సహనంతో ఎదుర్కొన్నాడు. నిలుకడ మీద నిజం బయట పడుతుంది. అప్పుడు మొదట్లో అతనంచే అకారణంగా పగబూనిన మలిన మనస్కులు కూడా చివరికి పశ్చాత్తప్తులై రామచంద్రుని గుణ గణాలను మెచ్చుకుంటారు. కనుక సత్ప్రవర్తన, సత్య నిరతి, కార్యదీక్ష, కష్టసహిష్ణుత మొదలైన సద్గుణాలు సాధించిన విజయమే రామచంద్ర విజయ మనవచ్చు.

కథ పాతదైనా, కొత్తదైనా దానికి జీవం పోసేది కథను నడిపించే తీరు. ఈ దృష్టితో చూస్తే, రామచంద్రవిజయంలో కథాకథనం చక్కగా నిర్వర్తించబడిందని పేర్కొనవచ్చు. సన్నివేశ

కల్పనలో చిలకమర్తివారు ఎంతో నేర్పు ప్రదర్శించారు. రామచంద్రునిపై నిష్కారణంగా పగబూనిన ఆ కుటిల స్వభావులు తాము చేసిన అకృత్యాలను బయట పెట్టిన కథాభాగాన్ని ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. వాళ్లు తమ తప్పుల్ని తామే బయట పెట్టడంతో, రామచంద్రునిపై అదివరకు ఏర్పడిన అపోహలన్నీ తొలగిపోయినవి. కథ సుఖాంత మయింది. అనగా, అసత్యానికి అపజయమూ, సత్యానికి అఖండ విజయమూ కలిగాయి.

కథాగత విషయాలే కాక, చిలకమర్తివారు సెలవిచ్చినకొన్ని సూక్తులు కూడా గమనింపదగినవి. "మహాత్ముల జన్మము ప్రపంచోపకారార్థమే కదా." "పది వరహాలుగలవాని కంటె పది కొబ్బరి చెట్లు గలవాడు ధన్యుడు." "స్నేహితులదగ్గర దాచవలసిన సంగతు లుండవుగదా!" మొదలైన వాటిని ఈసందర్భంగా ఉదాహరించవచ్చు.

చక్కని కథా చిక్కనిశైలీ గల యీ రచనా రత్నాన్ని ముచ్చటగొలిపే రీతిని ముద్రించి నేటి పాఠకలోకానికి అందిస్తున్న ఎమెస్కో "పాకెట్ బుక్స్" వారిని అభినందించక తప్పదు.

మదరాసు.
4-7-70

చల్లా రాధాకృష్ణశర్మ

# మొదటి ప్రకరణము

శ్రీమంతంబై సమస్త సంపదలకు నిలయమైన యీ భరతఖండము నందలి దేశములందు ఫలవంతంబై యతిపురాతనంబై యనేక పావనరాజవంశ సమేతంబై యాంధ్రదేశము దనరుచుండును. ఆ దేశమునందు సమస్త జనసేవితమై బహుపుణ్యక్షేత్రశోభితమై గోదావరీ నది ప్రవహించుచుండును.

ఈ గోదావరీనది ప్రవహించుచున్న మండలములయం దన్నిటిలో జన్మమెత్తినందులకు ఫలము ఘనులకు నల్పురకుఁ గూడ సహజముగ నందవలయునని యెంచియో యన్నట్లు గెలలభారము చేత భూమికిఁ దగులునట్లు వంగి యతి మనోహరమైన ఫలములచే నాఁకొన్న యాపన్నజనంబుల కెల్ల నవ్యవధానముగ నాఁకలిదీర్చుచు, శృంగారతరమైన పువ్వులచేత నేత్రముల కపూర్వ మొనర్చుచు, సమస్తపుష్పజాతముల నుండి వీతెంచు వాయువులచేత ఘ్రాణేంద్రియమునకుఁ దృప్తిగావించుచు, దూరప్రయాణములచేత నలసిసొలసి వచ్చు బాటసారులకుఁ జల్లనినీడ నిచ్చుచు, సర్వావయవముల కును నేక కాలముననే మహానందము గల్గించుచు, ధరణీరమణికిఁ జేసిన యపూర్వాలంకారములో యన వెలయు తీయమామిళ్ళు, పనసలు, నరంట్లు, కొబ్బరులు, పోఁకలు మొదలగు ఫలవృక్షములకుఁ గన్నతల్లియై కోనసీమయం దెల్ల సౌందర్యసీమయు సుఖములకు గాపురంబును నమలాపురముగదా ?

ఆగ్రామము మొదటఁ జిన్నదైనను పుణ్యపురుష లనేకులు తమకీర్తి యాచంద్రతారార్కముగ భూమండలమున వెలయునట్లు బ్రాహ్మణోత్తములకు సుక్షేత్రములయిన భూముల నిచ్చి వారి వివా

సార్థమై కట్టించిన యగ్రహారములచేతఁ జుట్టుప్రక్కలనున్న గ్రామముల కంటె పెద్దదై, లౌక్యులు నిక్కిలి నివసించుటచేత నొక పట్టణమువలెనుండును.

కోనసీమయం దంతటను, ముఖ్యముగా నా గ్రామమునందును భూలోకకల్పవృక్షములని ప్రసిద్ధికెక్కి సార్థకనామమును ధరించిన కొబ్బరితోఁట లనేకములు గలవు. ఎంత ధన్యమైన జన్మమో కాని కొబ్బరి చెట్టును జక్కగాఁ బరీక్షించినయెడల వేరు మొదలు మొవ్వ వరకును జనుల కుపయోగించునుగాని యొక తృణమాత్రమైనను వ్యర్థము గాఁబోదు. మహాత్ముల జన్మము ప్రపంచోపకారార్థమే కదా? అట్టి కొబ్బరితోఁటయందుఁ దోఁట కొకయిల్లుండును. అందా తోఁట యజమానుఁడు నివసించును, వేతే కొబ్బరితోఁటల మహాత్మ్యము వర్ణింపనేల? పదివరహాలుగల వానికంటెఁ బదికొబ్బరి చెట్లు గలవాఁడు ధన్యుడను మాట సత్యమే యగు.

అమలాపురము నందుత్తరమునందొక చెఱువును, దక్షిణమునందొక చెఱువునుగలవు. మొదటిచెఱువునకుఁ జుట్టును రెండు ప్రక్కల నూరుండును. చెఱువులో దిగుటకు రెండుప్రక్కల మెట్లు గలవు. రాజవీధి యొక్కటే పెద్దది యున్నది. వీధికి రెండు ప్రక్కలను గుమ్మములల ముందఱ కొబ్బరిచెట్లుండును. ఆ గ్రామమునకుఁ బడమట కూచిమంచివారి యగ్రహారమున్నది.

ఆ గ్రామమునకుఁ జేరియే యొక మామిడితోఁట గలదు. విఱుగగాసిన యా మామిడిచెట్ల కాయ లెవ్వరైన దొంగిలించుకొని పోదురేమో యను భయముచేతఁ జెట్లకు నిలువెత్తున ముండ్లకంచ వేసి పండుట కర్హమైన కాయలు దొరఁబాఱగనే బుట్టలుగట్టి, చిలుకలు మొదలగుపక్షులు కొఱికివేయకుండఁ జేతిలో నొకయుండ విల్లుబద్ద పుచ్చుకొని మధ్య మధ్య వచ్చుని మామిడాకుల నడుమ గూర్చుండి తన రంగు తెలియకుండ మోసముచేయుచున్న చిలుకపైపున నొక యుండవేయుచు నొక కాపువాడు కాఁపుకాయుచుండును, ఆవల కొరడిమీద మార్గస్థుల దృష్టిదోషమునఁ దోఁటకు భంగమేమియుఁ

గలుగకుండఁ గాపుఁదలగాఁ గాఁపువాఁడు తన శిల్పశాస్త్ర చమత్కారమునంతను వినియోగించి చేసిన వికృతాకారముగల యొక దృష్టి బొమ్మగలదు. అది వేసవికాలమగుటచే నతిమనోహరమైన యా వసంతఋతువునందు శృంగారలక్ష్మికి బుట్టినింటివలెనున్న యాతోట లోపలికి వచ్చి విశ్రమింపకుండ మార్గస్థులను బెదరించుచుండును. కలసి మెలసి దట్టముగా గుబుగుబుఁడుకొన్నవారిని సహస్రసంఖ్యలుగల వాడైన భేదింపజాలఁడని యైకమత్యోపయోగములను జనుల కుప దేశించుచున్నవో యన గుజ్జుమామిడిగున్నల యాకులు దట్టమై సూర్య కిరణ దుర్గమంబుగా నుండెను.

ప్రభాకరుఁడు తన సహస్రకిరణములను జగమునందు వ్యాపింప జేయుచు సర్వభూతభయంకరుడై భూమండలమెల్ల దహించుచుం డెను. మృగవారంబులు మృగతృష్ణల జలాశయంబులుగా భావించి దాహనివారణార్థము పరుగులెత్తుచుండెను. చల్లని పందిళ్ళవలెనున్న క్రొమ్మావిగున్నలను, మావిగున్నల వ్రేలాడుచున్న యాకులజొంప ములె మెక్కి మెక్కి కూయు గండుకోయిలలును, కోయిలకూతల నాలకించుచు మార్గాయాస నివారణ మొనర్చుకొనుచున్న పాంథజన సమూహములను వేసవికాల లక్షణంబుల వెలిసేయుచుండెను. భూమిమీఁద రాలి యెండిన యాకులన్నియు గలగల ధ్వనిసేయుచు గాలికి గదలుచుండెను. అగ్నివర్షము గురిసినచాడ్పున గాడ్పులు వెచ్చగ వీచుచుండెను.

అట్టిసమయమున విభవ సంవత్సర వైశాఖశుద్ధ చతుర్దశి నా డొక మార్గస్థుడు మార్గాయాస నివారణార్థ మొక మామిడిచెట్టు నీడకు వచ్చి మూఁటను క్రిందవైచి దానిమీద గుడిచెయ్యిజాచుకొని భుజము మీఁది యంగవస్త్రముతో మొగమున స్నానముచేసినట్లు పట్టిన చెమ టను దుడుచుకొనుచు దలకుచుట్టిన సెలగపువ్వంచు జరీ యుత్తరీ యము చెంగుతో విసరుకొనుచు నేదియో దీర్ఘాలోచన చేయుచు గూరు చుండెను. పచ్చని నిమ్మపండునంటి దేహచ్ఛాయయు, గుండ్రని మొగమును, సొగసైన కాటుక కన్నులును, సౌష్ఠవమైన అవ యవములును గలిగి, సహజమైన లావణ్యముగల యాతని శరీరము

వకు రాగికడ్డీలమీఁద నమర్చిన బంగారు మురుగులును పుష్య రాగములు వేసి తాపిన తమ్మంట్లును నొక వింత యందమును కలిగించుచుండెను. అప్పు డప్పుడే నూతనముగ నంకు రించు చున్న నూనూగు మీసములు చెప్పనక్కఱ లేకయే యతడు పదు నెనిమిది వత్సరముల ప్రాయముగల బాలుఁడని తెలియఁజేయును.

ఆ కుమారుఁడు తనలోఁ దానేదో వితర్కించుకొను చుండగా నప్పు డొక ముప్పదియైదు వత్సరముల చామనచాయ గల బక్క పలచని పొడుగు బ్రాహ్మణుఁడు మార్గమునఁ బోవుచు దూరమున నతని జూచి. కొంచెము విదానించి యెవరాయని యాలోచించి క్రొత్తమొగమని తెలిసికొని కిఱ్ఱు కిఱ్ఱు మని చెప్పులజోడు ధ్వనుల సేయు, నీ బాలకుఁడున్న వైపునకు వచ్చి యెదుట నిలవఁబడి యిట్లు పలుకరించెను,

బ్రాహ్మ : అబ్బాయీ! మన దేయూరు?

బాలు : మాది తాటిపాక కాపురము.

బ్రాహ్మ : మీ రెవ్వరు? మీ యింటిపే రేమి?

బాలు : మే మాఱువేల నియోగులము. మా యింటి పేరు మాచిరాజు వారు.

బ్రాహ్మ : నీపే రెవ్వరు? నీ తల్లి తండ్రులు బాగున్నారా?

బాలు : నాపేరు రామచంద్రుఁ డందురు. నాకు దల్లి, తండ్రి కూడ లేరు. తండ్రిగారు చనిపోయి నాలుగు సంవత్సరములైనది. తల్లిగారు పోయి యీ వేళ కిరువది దినములైనది.

బ్రాహ్మ : పాపము! చిన్నతనమునందే తల్లి దండ్రులు లోకాంతరగతు లయినారా! పూర్వజన్మకృతము. అయితే మీ తండ్రిగారి నామధేయము?

బాలు : మా తండ్రిగారు శ్రీరాములుగారు.

బ్రాహ్మ : ఓహోహో! శ్రీరాములుగారి కుమారుఁడవయ్యా వరే. అయితే మీరన్న దమ్ము లెందఱు?

బాలు : అన్నదమ్ములును లేరు. అక్కచెల్లెండ్రును లేరు. నేనొక్కఁడనే. మా బాబయ్యగారిని మీరేమైన నెఱుఁగుదురా?

బ్రాహ్మ : ఎఱుఁగుదురాయని యడుగుచున్నావా! సరి సరి. మా కూఁతు మంచివారికి మీరు మిక్కిలి యత్యావశ్యకమైన బంధుకోటిలోవారే. బాంధవ్య మటుండఁగా మా తాతగారికిని శ్రీరాములుగారి తండ్రిగారికిని బ్రాణస్నేహమని మాతండ్రిగారు చెప్పుచుండఁగా నే ననేక పర్యాయములు విన్నాను. మా తాత ముత్తాతగారి తమ్మునకిచ్చినది మీయూరిలోనున్న సత్యరాజువారి యాఁడుఁపడుచే.

బాలు ; మాగ్రామములో సత్యరాజువారు లేరే.

బ్రాహ్మ : నీకేమీ తెలియును. విన్నగాక మొన్న కన్నుఁదెఱచినవాఁడవు. నక్క 'నేను పుట్టి మూడువారములు కాలేదు ఇంత గాలివాన యెన్నఁడు నెఱుఁగ' నన్నదఁట. సత్యరాజువారిప్పుడు గన్నవరములో నున్నారు. మీగ్రామములో లేరు.

బాలు : నామధేయము?

బ్రాహ్మ : నాపేరు శోభనాచలము. మాసంగతి నీవు కుఱ్ఱవాఁడవగుటచే నెఱుఁగవుగాని మీ పెద్దలందఱు నెఱుఁగుదురు. పెద్దాపురమునందు మహారాజుగారివద్ద మంత్రులుగానున్న యనపపిండివారు మాకు దగ్గరబంధువులు. రాజమహేంద్రవరములో మాడభూషివారు మా మాతామహులు. మాతండ్రిగారికి మాడభూషివారు పిల్లనిచ్చినప్పుడు వెయ్యిమాటపదార్లు కట్నమిచ్చినారు.

అని శోభనాచలము చెప్పఁగానే రామచంద్రుఁడు గొప్పవారితో మాటలాడుట తటస్థమైనదని సగౌరవముగ మాటలాడఁదలఁచి 'తమ దర్శనమెన్నఁడును జేయలేదు' అనెను.

శోభ : అవును దూరమునందున్నను దెవరికి రే. వియోగములో బీరకాయపీచు సంబంధము. కదిపినగాని యెవరికి తెలియును! కుఱ్ఱవాఁడవయినను బుద్ధిమంతుఁడవు. అయితే నీ పీ గ్రామ మెందుకు వచ్చినావు? ఇక్కడ బంధువు లెవరు?

రామ : నా కందఱు బంధువులే. నే నీగ్రామమునకు ఉపాధ్యా

యుల విశ్వనాథశాస్త్రిలవారు వచ్చియున్నారని విని యాయన దగ్గఱ చదువుకొనవలెనని వచ్చినాను. లక్ష్మీసహస్రము చదువుకొనవలెనని యున్నది. ఆయన చక్కఁగా బాఠములు చెప్పఁగలరా?

శోభ: లక్ష్మీసహస్రమా? ఆ లక్ష్మీసహస్రములు విశ్వనాథశాస్త్రిలవారికిరావు. ఆయనకుఁ గావ్య పరిశ్రమమే కాని వైదికమునందుఁ బ్రవేశములేదు. లక్ష్మీసహస్రనామములు, విష్ణుసహస్రనామములు మాగ్రామ పురోహితుడైన సోమావధానులకు వచ్చును.

రామ: ఆ పుస్తకముగూడ నొక కావ్యమే. సహస్రనామములుగావు.

శోభ: ఏమో! చిన్నప్పుడు కావ్యనాటకములకుఁ జదువుకొన్నాను. వ్యవహారములోఁ బ్రవేశించినతరువాత తిరిగి యావిషయమై పనిచేయలేదు. అందుచేత జ్ఞాపకములేదు. ఆయన పాఠములు చక్కఁగాఁ జెప్పఁగలరు. గాని నీవు భిక్ష యెక్కడ చేయవలెనని యాలోచించినావు?

రామ: వంటపూఁటి యింటనుండి చదువుకొనవలెనని యున్నది.

శోభ: ఏమియు నదుపాయముగా నుండదు. అందులో మాగ్రామములో నున్న పూటకూళ్ళముండ దిక్కుమాలినముండ. డబ్బు చేతిలో వేసికొని కడుపు గాల్చును. ఉన్నయిల్లది యొకటే అబ్బాయీ! నీవు మాకుఁ గావలసినవాఁడవు. రెండు మూఁడుదినములు మాయింటనుండి తరువాత పూఁటకూళ్ళ యింటఁ బ్రవేశించు. గ్రామములోనికి వెళ్ళుదము రా, ప్రొద్దువోయినది.

రామ: మీయింట నెందుకు? వంటపూఁటియింట నేఁడే నేను ప్రవేశించి చదువుకొనవలెనని యున్నది.

శోభ: నీకు మొగమాట ముండఁ బనిలేదు. మా యిల్లు నీ కత్యావశ్యమైన చోటుగాని మరొకటి కాదు. మన మంచరము నొక కంచములో భోజనము చేయవలసిన వాళ్ళము. లే—మూటపుచ్చుకో.

బంధువులు బలవంతము చేయుచున్నప్పుడు వారి యింటికి బోకుండుట బాగుండదని యాలోచించినను రామచంద్రుఁ డెన్నఁడును పరగృహవివాసముఁ జేయనందున మిక్కిలి యనిష్టముతోనే లేచి శోభనాచలముతో గూడఁ బోవుచు మార్గమధ్యమందుఁ దానీగ్రామము వచ్చిన వెంటనే గొప్పవారి స్నేహము దొరికినదనియుఁ దన కిది శుభసూచక మనియు సంతోషించుచుండెను. శుష్క ప్రియముల యందుఁ దనకుగల యావత్తుసామర్థ్యము నుపయోగపరచి తన జన్మ మధ్యమం దెప్పుడు లక్ష్మీసహస్ర మను కావ్యము పేరయిన వినక పోయినను, పంచకావ్యములవఱకుఁ జదువుకొనకున్నను దానుగూడ చదువుకొన్న వాఁడేయని రామచంద్రుని మనస్సు నకుఁ దోఁచునట్లు పలికెను. రామచంద్రునకుఁ దల్లి దండ్రులు లేరని విన్నప్పటి నుండియు నీతనికి వంటపూఁటింటికి ధన మెట్లు వచ్చునని పెద్ద సందేహము శోభనాచలమునుబట్టి బాధించుటచేత శంకానివృత్తి చేసి కొనఁదలఁచి మెల్లగా నిట్లు ముచ్చటించెను.

శోభ: అబ్బాయి! వంటపూఁటి ముందకు నెలకు నాలుగు రూపాయలు దిర్పంచవలెనే. పాపము! నీకుఁ దలితండ్రులుకూడ లేరు. ఏలాగున చదువుకొందువోయని నాకు సందేహముగా నున్నది.

రామ: అయ్యా! చేతుల నున్న మురుగు లేఁబది రూపాయలు విలువ గలిగియున్నవి. తమ్మంట్లు పాతికరూపాయలు. ఆ రెండును విక్రయించిన యెడల నొక సంవత్సరము వఱకుఁ జదువవచ్చును. 'నందోరాజా భవిష్యతి' తరువాత దైవ మున్నాఁడు. నే నున్నాను. అప్పుడుద్యోగస్థుల పిల్లలకు పాఠములు చెప్పి యేమాత్రమైన సొమ్ము సంపాదింపఁగలనని నాకు ధైర్య మున్నది.

శోభ: సరే. చక్కని యాలోచన చేసినావు. చదువు కావల సినవాఁడు సొమ్ము పావనముగా జూచుకొనఁడు. చదువునం దాసక్తి గలవాని నిన్నొక్కనినే చూచినాను. కాని యీ గ్రామమునందు కోమట్లు పెద్దవాళ్ళు. మోసముచేసి వరహావస్తువు దమ్మిడికిఁ గొనఁ గల సామర్థ్యము వారి దగ్గఱనున్నది. పెద్ద కోమట్లతో నాకుఁ బెక్కు వ్యవ హారములున్నవి. నేను వారివిమనయింటికిఁ బిలిపించి చక్కగాబేరముచేసి

నష్టములేకుండ నీ సొమ్ము నీకు వచ్చున ట్లిమ్మగలను. నీవు తొందర పడి సొంతముగా వ్యవహారింపఁబోకు. ఇక్కడ తలలుదీసి తలలు పెట్టువారలున్నారు.

అని చెప్పగానే రామచంద్రునకు శోభనాచలముమీఁద మును పటికంటె నెక్కువ నమ్మకము కుదరఁగా నాతని సాహాయ్యముచేత నెట్లయిన నా గ్రామ మందుండి సుఖముగా జదువుకొనఁ దలఁచెను. ఇట్లు వా రిద్దఱు మాటలాడుచు గ్రామములోనికి వచ్చిరి. గ్రామము నకు వచ్చి రాజవీధిలోఁ గొంతవరకు బోయి కుడిచేతిమీఁదుగా నున్న సందులో రెండుగుమ్మములు దాఁటి మూడవగుమ్మము దగ్గఱకుఁబోయి కొంచెము వెనుకగా వచ్చుచున్న రామచంద్రుఁడు వచ్చువఱకు నిలు చుండి 'ఇదే మన లోగిలి' అని చిన్న వీధియరుగులు కొబ్బరియా కుల దడియునుగల యొక పాత పెంకుటింటిలోనికిఁ దీసికొనిపోయి చావడిమీదనున్న తాటియాకుల చాపమీఁద గూర్చుండుమని చెప్పి తాను లోపలికిఁబోయి 'అమ్మా!' యని పిలిచి మెల్లగా నామెతో నిట్లని చెప్పెను.

శోభ: అమ్మా! నీ వేమియు విసుగుకొనవద్దు. ఈవేళ మన యింటికి బంధువొకఁడు వచ్చియున్నాఁడు; త్వరగా వంటకానవలెను.

తల్లి: నీవేదో తెచ్చిపెట్టి నన్ను బంపుచున్నని నే నిపుడకే యనుకొనుచున్నాను. నీకుఁ బ్రతిదినము నెవడో యొకబంధువు వచ్చుచునే యుండును. నీ యుద్యోగమునకు నీ సంపాదనకు దోషు చుట్టాలను గూడ బాపురము చేయవలెనటరా? నాయనా?

శోభ: అబ్బా! ఊరకుండవమ్మా! అవతల పెద్దమనుష్యుఁడు కూర్చున్నాఁడు. పెద్దలేదు, పిన్నలేదు. నీ గోల యెప్పుడిలాగే యున్నది.

తల్లి: ఏమి యూరకుండను? ఎన్నాళ్ళు! ఒకనాడా యొక కథా. ఎల్లకాలము నా కథ యిలాగే యున్నది. కాటికి కాళ్ళు జాచుకొన్న ముండను. చాకిరీ చేయులేక నానా హింసలు పడుచు నేలా గైన గంజికాచి పోయుదమని యనుకుంటే నీవు తెచ్చుకొని తిను

చున్నావు. ఎముకలు చిట్లగట్టిపోవుచున్నవి. రామ రామ దిక్కుమాలిన దేవుఁడు నాకు చావుపెట్టఁడు. అరువదియేండ్లు వచ్చినందుకు సుఖములేదు. పల్లకాడులేదు. తల్లి కడుపునఁ బుట్టినది మొదలు చచ్చువరకు నొక్కటే మచ్చుగదా! ఇప్పు డత్తెసరు పెట్టవలెను—నీకేమి! మాట చెప్పగలవు.

అని తన్నుఁదాను దిట్టుకొనుచు, శోభనాచలమును దిట్టుచు మరల బియ్యము కడిగి పొయ్యిమీఁదఁ బెట్టుటకుఁ బ్రయత్నము చేయుచుండెను. శోభనాచలమును తనతల్లి యన్నమాటలను రామచంద్రుఁడు విన్నాడేమోయని భయముతో పీవలకువచ్చెను. చావడియందున్న కొబ్బరియాకుల పందిరుల వలనఁ చల్లగా నుండుటచేతను, పందిరి తావలివాకిటనున్న కొబ్బరిచెట్లమీదనుండి వచ్చెడిగాలి చేతను మార్గాయాసము నివారణముకాఁగా నేదో యోచన చేయుచు రామచంద్రుఁడు వీరికి జరిగిన కలహము పూర్తిగ వినలేదు, కాని కేకలు మాత్రమువినెను. శోభనాచలము రాగానే వారిద్దఱిట్లు మాటాడిరి.

రామ: అయ్యా! లోపల ఎవరు కేకలు వేయుచున్నారు?

శోభ: ఏమిటో మాయమ్మ నల్లుమందు పిచ్చిచేత నామీద నెప్పుడైన గేకలువేయుచుండును. అంతేకాని నీమాటేదియు లేదే!

రామ: ఏదో వంటసంగతి యనుకొన్నానులెండి. అందుచేత నడిగినాను.

శోభ: అదిన పెద్దది. పుట్టి బుద్ధియెఱిఁగిన తరువాత నత్తెసర యినఁ బెట్టి యెరుగదు. మాయాడువాండ్రు పుట్టింటికి వెళ్ళినారు. వంటబ్రాహ్మణుఁ డిదివరకుండి వెళ్ళిపోయినాఁడు. తిరిగి యెవ్వరినైన నేర్పఱ్చవలె ననుకున్నాను. ఎవరును కుదురరు. వాళ్ళకు బాగుగా నన్నము గలిగియున్నది.

రామ: అవును. వంటబ్రాహ్మణులు దొరకుట కష్టమే.

ఇట్లు వారిద్దరు కొంతసేపు మాటాడుచుండిరి. తరువాత వంటయిన దని తల్లి కేక వేయగా నిద్దరు లేచి చెరువునకు వెళ్ళి స్నానము చేసి యిష్టాగోష్ఠిని మాటాడుచు భోజనము చేసిరి.

# రెండవ ప్రకరణము

భోజనములు కాఁగానే చేతులు కడిగికొని చావడిమీఁద వా రిద్దఱు కూర్చున్నప్పుడు శోభనాచలము తాంబూలము జ్ఞప్తికి రాగా తమలపాకులును జెక్కలును లేకపోవుటచేతను గొప్ప వారియింటఁ దమలపాకు లుండకపోవునా యనియు, నివి తన యింట లేనందునఁ దాను దక్కువవాఁడనియు రామచంద్రుఁ డాలోచించునేమోయని భయమును, సందేహమును బొంది శోభనాచలము తాను నిరంతరము తాంబూలము వేసికొను నట్టి మహారసికుడే యని బంధువునకు ధ్రువ ముగాఁ దెలియజేయుటకై యిట్లని చెప్పెను. "తమలపాకు లయి పోయినవి, చాకలివాడు వారము దినములక్రిందట సెలవుదీసికొని వెళ్లి తిరిగి రాకపోవుటచేత సంతకుపోయి యాకులు తెచ్చువారు లేక పోయిరి. అదిగాక మాయింటిది గ్రామమున నుండకపోవుటవలనఁ దమలపాకులమీఁద శ్రద్ధకూడా తప్పినది, అది యున్నప్పు డాకులు చెక్కలు మాయింటినిండ దొర్లుచుండును. ఉదయాస్తమయములు వచ్చినవారందరు నమలుచుండెడివారు" అని చెప్పఁగా రామచంద్రుఁడు తమలపాకు లలవాటులేదనిచెప్పి విశ్వనాధ శాస్త్రిలవారి దర్శనము త్వరితముగాఁ జేయవలయునని యుత్సాహముతో శాస్త్రిలవారి యింటికిఁ ద్రోవజూపు మనియు బూఁటకూళ్ళయిల్లు గ్రామమున కేప్రక్క నున్నదనియుఁ దనదగ్గఱనున్న వస్తువుల నమ్మివేయుటకుఁ గోమటిని బిలుపింపుఁడనియు రామచంద్రుఁడు శోభనాచలమును దొందరపెట్టెను.

శోభనాచలమునకు వస్తువుల నమ్మివేయుటయందు రామచం ద్రునికంటె నెక్కువ యాత్రము కలిగియున్నది. కనుక శాస్త్రిల వారి యింటికి మరునాడు వెళ్ళవచ్చుననియుఁ, బూఁటకూటి యిల్లు సాయంకాలము చూపుదుననియు, జెప్పి కోమటిని మాత్ర మప్పుడే

పిలిపించుటకు నిశ్చయించి యెవరిచేతనైనను ముద్దుల కనకరత్నము నకు వర్తమాన మంపవలె నను కొనుచుండగా నిరువది యేండ్ల వయస్సుగల యొక కమ్మవారి చిన్నవాడు వచ్చెను. ఆతడు శోభనా చలముకు గుండెకాయ. ఇతనిపేరు వేంకటస్వామి. మార్గాయాసము చేత నీలోఁగా రామచంద్రునకు గొంచము నిద్రపట్టెను. అతడు నిద్రించుచుండగా వేంకటస్వామిని వీథిలోనికి దీసికొనిపోయి యరుగు మీదఁ గూర్చుండ బెట్టికొని శోభనాచల మతనితో నేదో గుస గుస లాడి పంపెను. యజమానుని కార్యనిర్వాహకమునందు హను మంతునితో సాటి యని చెప్పదగిన యాకుఱ్ఱవా డతివేగముగ బోయి కోమటితో గూడ నక్కడ నున్నట్లు మరలివచ్చెను.

కనకరత్న మెప్పుడు వచ్చునా యని యెదురుచూచుచున్న శోభనాచల మతఁడు రాఁగానే చటుక్కున లేచి వీధి గుమ్మమువద్ద కెదురుపోయి కమ్మకుఱ్ఱవాని దగ్గరనుండు కోమటిని జెయ్యిపట్టుకొని దూరముగాఁ దీసికొనిపోయి చెప్పవలసిన సంగతు లన్నియుఁ జెప్పి యాతని వెంటఁబెట్టుకొని రామచంద్రునియొద్దకువచ్చి యాతని నిద్ర లేపెను. లేచి తన యెదుట నల్లని లావుశరీరమును, భూలోకమున నవతరించిన ప్రత్యక్షవిఘ్నేశ్వరుడేమోయను భ్రాంతికలుగఁజేయు పెద్ద పొట్టయు, నుదుట పట్టినామములును, జేతులను మురుగులును, నెడమచంక క్రింద వస్తువులున్న చారల సంచియుఁ, గుడిచేతిలోఁ జిన్న త్రాసునుగల కోమటిని జూచి రామచంద్రుఁడు కూర్చుండు మని చెప్పెను. అప్పుడు వారంద ఱీప్రకారముగా మాట్లాడిరి.

శోభ: కనకరత్నము! ఈ పిల్లవాఁడు మురుగులను విక్ర యించవలెనని నాతో జెప్పినాడు. నీవు నాకు నమ్మకము గలవాఁడ వౌటచేతను, మాకు మీకుఁ జాల వ్యవహారములుండుటచేతను నేను నీకు వర్తమానము పంపినాను. ఒక డబ్బు సొమ్మెక్కువ కమ్మ వలెను, కాని తక్కువ కమ్మవద్దు, మా కితడు కావలసినవాడు; బంధువులతోఁబని. హెచ్చు తగ్గమైన వచ్చిన పక్షమున నాకు మాట దక్కదు. ఇది నీ వ్యవహారముగాఁ జూచుకొనవలెను. వేఱే నేఁ జెప్పనక్కరలేదు.

కన: సరిసరి! మీరు నాతో సెలవియ్యవలెనా! ఇంతకాలము నుండి మీకు నేను వస్తువులు నమ్మకముగా విప్పుచున్నాను; ఎన్నఁడయిన దమ్మిడి తగ్గఅనైనఁ దేడా వచ్చినదా? మనుష్యునకు మాట నమ్మకముండవలెఁగాని ధనమా పావనము! భోగముది గణింపగలదు. తమవంటి వారిదగ్గఱ మర్యాద కావలెనుగాని యొకదబ్బుటయుతేయేమి! అటయితే యేమి, ఏవి? మురుగులు తీయండి.

అని కనకరత్నము చెప్పఁగానే శోభనాచలము రామచంద్రుని దగ్గఱగా జరిగివచ్చి 'అబ్బాయీ! మురుగులు తీయునా' యని యడుగ నతఁడు తీయుమని తలయూఁచి యూరకుండెను. చేతిని మురుగులు చిన్నతనములో బిక్కఁగా నెక్కించుటచేత చేతులతో లాగినపుడు మురుగులురాలేదు. తరువాత త్రాళ్లువేసి వారు లాగుచుండగా తల్లిదండ్రులు చిన్ననాఁడు తనకావస్తువు చేయించిపెట్టిననాఁటికి నిప్పటికిఁ దనయవస్థల కెంత తారతమ్యము గల్గినదో తలంచుకొని మురుగుల నమ్ముకొనుటచేతఁగాని తన భోజనంబు జరుగకున్నదని కొంచెం విచారించి రామచంద్రుఁడు దుఃఖమును బైకి రానీకుండ దిగమ్రింగి బేరమును జూచుచుండెను. కనకరత్నము మురుగులు దీసినతరువాత కొన్నిరాళ్ళు త్రాసులో వేసి మురుగులు తూచి కొంచెం నోరు చప్పరించెను. అప్పుడు వారిట్లు మాట్లాడిరి.

రామ: ఏమోయి ఆలాగనుచున్నావు? ఎన్ని తులములు యెత్తున్నవి?

కన: ఏమని మనవిచేయనండి. పాతగుల్లలు చూడఁగానే నేనేమాత్రమో యుండు ననుకొన్నాను. అబ్బే! మాయవస్తువులండి. ఏ కంసాలి చేసినాఁడండి? లాభము బాగుగాఁ గొట్టినాఁడు. ఇవి రెండు తులములున్నవి. తులము పదునెన్మిది రూపాయలధర.

రామ: మా నాన్నగారు నమ్మకమైన కంసాలిచేతఁ జేయించివారు, అటగాక యిది మేలిమిబంగారము. తులము పాతికరూపాయల ధర. గిట్టురాయి యేదీ?

కన: పిచ్చిమాట. ఎంతనమ్మకమున్నను కంసాలి తిన్నగాఁ

జేయునా? అదిగాక యిది వరహావన్నెకావి మేలిమికాదు. కావలసిన యెడల నింక నెవ్వరికైనఁ జూపించకొమ్మఁడు; నేను గిటురాయి మఱచిపోయినాను.

శోభ : గీటురాయి యెందుకయ్యా! అతఁడు నాణెము కట్టినట్లు మా గ్రామమునం దెవరు గట్టలేరు. ఒకవేళ పొరపాటువచ్చినా నతఁడు పారిపోవునా? నీవు పారిపోదువా? ఇచ్చినమట్టుకు సొమ్ము పుచ్చుకో. విలకడమీఁదఁ చూచుకొనవచ్చును. పుష్యరాగములు కూడ విక్రయింపవలెనని యున్నదా?

రామ ; అవి యిపుడు విక్రయింపను. ఈ రూపాయలైన తరువాతగాని చూడను. అయితే కనకరత్నము? నీ విపుడు రొఖ మీయఁగలవా?

కన : తత్క్షణము పుచ్చుకొండి. ముప్పదియైదురూపాయలు నా దగ్గఱనున్నవి.

తక్కిన రూపాయిలు తేపుదయమున బంపించెదనని లెక్క పెట్టి సొమ్మిచ్చెను. రామచంద్రుఁడు సొమ్ముపుచ్చుకొని బొడ్డు కొంగున గట్టుకొనెను. అంతటఁ గోమటియు నింటికి వెళ్ళిపోయెను.

అపుడు రామచంద్రుఁడును శోభనాచలమును లోకాభిరామా యణమును జెప్పుకొనుచుండగాఁ బాతిక సంవత్సరముల వయస్సుగల యొక కుఱ్ఱవాఁడు రెండుభుజములమీఁద గాయములు స్పష్టముగ గన బడుచుండఁ జుట్టును జుల్పములుసు మున్నగ దువ్వి, చేతిలో నొక పేపబెత్తము బట్టుకొని, తలకు నుత్తరీయము కుచ్చువచ్చునట్లు చుట్టి, నోట నొకచుట్టను బెట్టుకొని కాల్చి గుప్పుగుప్పున పొగలువదలి చిన్న మేఘములను గల్పించుచుఁ, జేతిలో గుప్పెడాకులను, చెక్క లను బట్టుకొని, నాగరకత యంతయుఁ దన మొగముననే తాండవ మాడు నట్లు లోపలికి వచ్చెను. లోపలికి వచ్చిన యామనుష్యుని జూడఁగానే శోభనాచలమున కొకవిధమైన తొందర కలిగెను. వచ్చిన క్రొత్తమనుష్యుఁడు తన చంకక్రింద గ్రుడ్డలోఁ జుట్టబడి యున్న చీట్ల పేకను దీసి చావడిమీఁద వేయగనే, శోభనాచలమునకుఁ

దొందర యెక్కువై మొగము వెలవెలఁబాఱె. రామచంద్రుఁడు తనతోఁ బ్రసంగవశమున జెప్పుచున్నమాటలు వినఁబడకుండెను. అతఁడు వచ్చి కూర్చుండి చుట్టకాల్చుకొనుచుఁ, దమలపాకుల తొడి మలు దీయుచు శోభనాచలమునకు లేశమయిన విషము లేకపోయినను నాఁతడు చేసిన కనుసంజ్ఞయైనఁ జూడక మాటలాడ నారంభించెను. ఈతనిపేరు నరసయ్య.

నర : 'ఓరీ! శోభనాచలము! మనవాండ్రెవ్వరు రాలేదా? నీవుకూడా మొద్దులాగునఁ గూరుచుంటివేమి? దొడ్డిలో జింతచెట్టు క్రిందఁ జాపలు వేయించినావా? నీపద్ధతి చూడఁగా నీవేళ యిక్క డనే యాడుటకు నిశ్చయించిన ట్లున్నది. ఏమి బెల్లముగొట్టిన ఱాయి లాగున మాటాడ వేమిరా?

అని క్రొత్తమనుష్యుఁ డిట్లు మాటలాడుచుండఁగా పంగనామ ములు బెట్టుకొని యింకొక బ్రాహ్మణుఁడు వచ్చి కూర్చుండెను. శోభనాచలమీతనిఁ జూడగనే 'దయచేయండి. వేంకటరత్నముగారు. అని పలుకరింపఁగా వేంకటరత్నము మిక్కిలి తెలివిగలవాఁడును. ప్రపంచ వ్యవహారములం దారితేఱిన వాఁడును గావున కడుమర్యా దగాఁ గూరుచుండెనుగాని తమలపాకులు వేసికొనుచు మొదటవచ్చిన బ్రాహ్మణుఁడు వేంకట రత్నమునుజూచి యిట్లు పలుకరించెను.

నర : ఏమిరోః వేంకటరత్నం. నీవుకూడ నింత యాలస్యము చేసినా వేమి?

వేంక : ఈవేళ భోజనము ప్రొద్దుపోయినది. వైశాఖ పూజ చేసినాము.

నర : ఇది చైత్రమాసముగదా! వైశాఖపూజ యేమిటి?

వేంక : ఏడ్చినావులే నీ వూరుకో. నీ కేమియుఁ దెలియదు.

నర : మీయింట వైశాఖపూజ జరిగిన శరభరాజుగారు నాకు వర్తమానము బంపరూ! మీయింట నేను రెండు కావిళ్ళు మంచి నీళ్ళను మాత్రముతోసి వెళ్ళిపోయినాను.

ఏ రీతి ప్రకారము మాటలాడుకొను చుండఁగా మఱినలుగురు మనుష్యులు తటాలునఁ దలుపు దీసికొని వచ్చిరి. అందులో నొకఁడు శోభనాచలమును జూచి "ఓరీ పిల్లకుదిరినదఁట సోమావధానులు చూచి వచ్చినాఁడు" అని చెప్పెను. అపుడు వేంకటరత్నము మొగము చిట్లించుకొని యాక్రొత్త మనుష్యునివైపు తిరిగి పండ్లు కొరికి మాటాడ వద్దని సంజ్ఞచేసి "మనమందరము దొడ్డిలోనికిఁ బోవుదము రం" డని వారి నందఱిని వెంటబెట్టుకొని యదివఱకే చింత క్రింద కమ్మకుట్టువాఁడు పఱచిన చాపమీఁదఁ గూరుచుండి చీట్లపేక నాడ నిశ్చయించిరి. శోభనాచల మాదినమున రామచంద్రుఁడు వచ్చుటచేత నాటకు వెళ్ళక కూరుచుండెను. మెడలో బిడికెడు యజ్ఞోపవీతము లుండుటచేత శోభనాచలమునకు వివాహమైనదని నమ్మియున్న రామచంద్రునకు నొకఁడువచ్చి పిల్లకుదిరినదని చెప్పఁగానే శోభనాచలము చెప్పిన మాటయందును, వానిపెండ్లివిషయమందును, గొంచెము సందేహము కలుగుటయేకాక యతని యింటికివచ్చి సంభాషించిన వారిమాటలనుబట్టి వీరందఱు వంటబ్రాహ్మణులు, నీళ్ల బ్రాహ్మణులు మఱియితరమైన నీచులనికూడ నాలోచన తోఁచి శోభనాచలము నడిగి చూడవలెనని బుద్ధిపుట్టెను. వా రిట్లుమాటాడిరి.

రామ :ఏమండీ : ఆ మొదటవచ్చిన బ్రాహ్మణుఁడెవరు ?

శోభ : (విని వినిపించుకొననట్లు మనస్సులో నేదో యాలోచించుచుండెను.)

రామ : ఏమండీ ! ఆ మనుష్యు డెవరండీ !

శోభ : ఈగ్రామమునందు నీళ్లబ్రాహ్మణుఁడు. (అని మెల్లగాఁ జెప్పెను)

రామ : అతఁడు పరువు మర్యాద లెఱుఁగక మాటలాడినాఁడేమి ?

శోభ : ఏమిటో. చిన్నతనమునందు మేమిద్దఱము నొకబడిలోనే చదువుకొన్నాము. అప్పటి చనువుచేత నిప్పటికిని నన్నాలాగువ నాతడు పిల్చుచుండెను. స్నేహితుల యెడల నాకంత పట్టింపులేదు.

రామ : పిల్లకుదిరిన దవి యొక మనుష్యుఁ డన్నాఁడు. ఆపెండ్లి యెవరికి ?

శోభ : నాకు వివాహ మనుకున్నావా యేమి ? మాపినతండ్రి కుమారునికి వివాహము గాలేదు. ఆతనివిషయమై పిల్లను వెదుకఁ బంపినాను.

రామ : ఇప్పుడు వారందఱు దొడ్డిలో నేమిచేయుచున్నారు ?

శోభ : చీట్లపేక నాడుచున్నారు. నీవుకూడ నాడఁ గలవా ?

రామ : నాకుఁ జేతకాదు. నే నాడదలంచుకొననులేదు.

శోభ : ఆడిన తప్పులేదు. చేతకాకున్న నేర్చుకొనవచ్చును. డబ్బుపెట్టియాడరు. ఒకవేళ సంతోషము నిమిత్తమాడినను తిరిగి యెవరిడబ్బు వారికే యిచ్చివేయుదురు.

రామ : అటువంటి యాటను నేను నేర్చుకొనను.

అని యిద్దఱు ప్రసంగము చేయునపుడు లోపల చీట్లపేక నాడుచుఁ గొంచెముధనము ఋణముకొనవలసి యొకస్నేహితుఁడు శోభనాచలమును ఆవలకుఁ బిలిచి ప్రస్తుత మాడుకొనుట కత్యంతరము గలినదవియుఁ దానింటిదగ్గఱనుండి తెచ్చిన యిరువదియైదురూపాయలు నోడిపోవుటచేతఁ బదిరూపాయ లప్పుకావలెనవియుఁ జెప్పగా శోభనాచలము రామచంద్రునియొద్ద కాతని దీసికొనివచ్చి యాతడు మహా ధనికుండనియు సంవత్సరమున కీతనికి వేయిరూపాయలు భూముల మీఁద వచ్చుననియుఁ జెప్పి తన నమ్మకముమీఁద బదిరూపాయలు ఋణ మిప్పించెను. అప్పు దీసికొనుచున్న యామనుష్యుఁడు ధన వంతుఁడు గాకపోయినను జూదరియు నిర్భాగ్యుఁడు నైనను, శోభనాచలము కతనియందుగల యభిమాన మతనివిషయమై యంతచక్కఁగా జెప్పునట్లు చేసినది. శోభనాచలము మాటలు నమ్మి రామచంద్రుఁడు తాను దిగుచున్న మహావిపత్సముద్రము నెఱుఁగకయే కొంగునఁగట్టిన సొమ్ము విప్పి బిల్లకుడుముల లాగున బదిరూకలు లెక్కపెట్టి చేతిలోఁ బెట్టెను. రూపాయకు దినమునకొక యణా వడ్డీ యిచ్చెదనని చెప్పి యతఁడు సొమ్మును బట్టుకొనిపోయెను. మరికొంతసేపటి కామను

ష్యుడే తిరిగి మఱి యైదు రూపాయల నిమ్మని యడిగి పట్టుకొని పోయెను. ఇప్పటికి రామచంద్రునివద్ద నిరువది రూపాయలు మాత్ర ముండెను.

శోభనాచలముగారి పెరటిలో జరుగుచున్న మహాద్యూతము నందు మొహరీలు, వరహాలు, రూపాయలు, ఉంగరాలు, డబ్బులుకూడ బందెములుగాఁ బెట్టి, దారమాత్రాదు లన్న వస్త్రములు లేక మలమల మాడుచు నిత్య శివరాత్రులును. నేకాదశులును సలుపుచున్న మ దానిని లక్ష్యపెట్టక, యహోరాత్రములు వేదాంతులవలెె బంగారమును జిల్ల పెంకులుగ జూచుచు వినోదసముద్రమునందు మునిఁగి తేలుచున్న యనేక నలచక్రవర్తులును, ధర్మరాజులును నాచింతచెట్టు క్రిందఁ గొలువు దీర్చియుండురు.

వారందఱు ఆదిన మట్లు విచ్ఛిన్నముగా జూదమాడు చున్న సమయమునందు వాకిటఁ గూరుచున్న రామచంద్ర శోభనాచలముల కొక విధమైన యుల్లరి వినఁబడెను. అది వినఁబడినతోడనే శోభనా చలమునకు మనసు తాళకపోయి నందున వెంటనే యరుగుమీఁద నుండి చివాలున నేల కుఱికి లోపలి కతడు పరుగెత్తుకొని పోవు చుండగా నీతని కెదురుగా పయిమీద బట్టలేక జుట్టుముడి విడిపోయి, వెక్కి వెక్కి యేడ్చుచుఁ గుచ్చెళ్ళచెంగుతోఁ గన్నీళ్ళ దుడుచుకొనుచుఁ నొక పిల్లవాఁడు వచ్చెను. అతని జూచి రామచంద్రుఁడుగూడ లేచి పిల్లవాని యెదుటకుఁ బోయెను. అప్పు డాపిల్లవాఁ డిట్లు చెప్ప నారంభించెను.

"అయ్యా! ఈసంగతి మీరు వినుఁడు. నేను వీధిలోనుండి మా యింటికి బోవుచుండఁగా నీకమ్మ కుఱ్ఱవాఁడు నన్ను లోనికి తీసి కొనిపోయెను. వేంకటరత్నముగారు నన్నుగూడఁ జీట్లాడు మని బలవంతపెట్టిరి. ఒకటి రెండు పందెములయందు నన్ను గెలిపించి తరువాత నాచేతినున్న బంగారపు ముద్దుటుంగరమును బందెము బెట్టించిరి. పైమీదనున్న జరీ ఉత్తరీయమును గూడ లాగుకొని, నే నిమ్మని గట్టిగా నడిగినప్పుడు నన్ను వీరందరు దిట్టి కొట్టినారు. ఇదుగో! వరుపులు చూడండి. దెబ్బలేలాగున నట్టలు కట్టియున్నవో,

నే నిప్పుడు శరభరాజుగారి యొద్దకుఁ బోయి యీసంగతిఁ జెప్పెదను. అని చెప్పుచున్న కు అవానిమాట కడ్డమువచ్చి నరసయ్య మహాకోప ముతో నిట్లనియెను.

నర : కాలుకూఁతలు కుయ్యకు, చెప్పుదెబ్బలు తినగలవు. శరభరాజుగారితోఁ జెప్పి తలఁగొట్టి మొలవేయింప గలవా యేమిటి! నీ దిక్కున్నచోట చెప్పుకో.

అని శోభనాచలము వంకఁజూచి "యీతఁ డుంగరమును బెట్టుకొని రాలేదు. ఉత్తరీయము నేను పుచ్చుకొన్నమాట సత్యమే; నాదగ్గర రెండురూపాయ లప్పుదీసికొని నాలుగు నెల లయినది. ఇంకను నీయలేదు. అందుచేత బట్ట లాగికొన్నాను. ఇతను రానూలేదు. ఆడనూ లేదు. అంతయు నబద్ధమే!"

ఇట్లిద్దరు చెప్పగనే విని శోభనాచలము తన స్నేహితులశక్తియు సాహసమును నెఱిఁగినవాఁడు గావున తప్పక వారా యుంగరము నప హరించి యుందురని నిశ్చయించి శరభరాజుగారి సంగతి విన్నపక్ష మునఁ దనకు మాట వచ్చునని యేలాగైనా నతనిసొమ్ముతని కిప్పింప వలెనని నిశ్చయించుకొని బలవంతముగా రానికోపమును దెచ్చికొని యీ ప్రకారము జెప్పెను.

శోభ : పుణ్యమునకుఁ బోగాఁ బాప మెదురైనదఁట. స్నేహి తులుకదా యని యాడుకొనుటకు స్థలమిచ్చినందుకు దెబ్బలాటలును దుదకు తిష్కరములునా? నాయనా! నీ సొమ్ము నా యింట బోయి నందులకు నేనాదండుగ నిచ్చుకొందును. తెచ్చికొన్నందుకు జచ్చిన ట్లనుభవింపవలెను. నా సొమ్మెందరు తినుచుండుటలేదు? అందులో నీ వొకఁడవు. ఇంతమాత్రముతో నేను జెడిపోను.

అని రామచంద్రునివంక దిరిగి "అబ్బాయి! నీ దగ్గరనున్న యిరువది రూపాయలు నాకు బదులియ్యగలవా? సాయంకాలము నీ కిచ్చివేయుదు ననెను.

రామ : చిత్తము పుచ్చుకొనుడు.

అని చెప్పి యా సొమ్మునంతను నిచ్చెను. ముప్పదియైదు

హపాయలు బదుళ్ళక్రిందనే యిచ్చివేయుటచేత రామచంద్రునకు భార వంతయు దగ్గి దేహము చులకనయ్యెను.

ఆ రూపాయలు పుచ్చుకొని యా పిల్లవా డుత్తరీయము గూడ వరల నరసయ్యయొద్దనుండి తీసికొని యింటికిపోయెను.

అప్పుడు సాయంకాలమగుటచే రామచంద్రుడు సంధ్యావంద నమును జేసికొనుటకు జెరువునకుఁ బోఁగ వేంకటరత్నము శోభనా చలమును వానిపి వెంబడించిరి. వేంకటరత్నము చెరువుగట్టునున్న యొక యింట బ్రవేశించెను. శోభనాచలము మాత్రము చుట్టగాల్చు చునుచు గట్టుమీద గూర్చుండ రామచంద్రుఁడు సాంధ్యకృత్యములైన తరువాత నతనితో గలసి ప్రదోషకాలమున శివాలయమున కరిగి. యాలయము చుట్టును మూడు ప్రదక్షిణములు చేసి. గర్భగుడి ప్రవే శించి తన కందకుండనున్న గంట నెగిరికొట్టి. శివుని దర్శించి 'వందే శంభు ముమాపతిః" మ్మను శ్లోకమునుజదివించి పూజారిచ్చిన రుద్రపాద ముల నందుకొని మారేడుపత్రి నందితలనుంచి విభూతి మొగమున వాల్చి కనుబొమ్మల సందున అమ్మవారి కుంకుమ బొట్టుపెట్టుకొని యీశ్వరప్రసాదమును దినఁగూడదు గనుక కొబ్బరిముక్కల నక్కడ నుంచి కొంతసే పట గూరుచుండి యింటికి శోభనాచలముతోఁ గలిసి వచ్చునప్పటికి భోజనపువేళ యయ్యెను.

తన యదృష్టముపుచ్చి రామచంద్రుఁడు వచ్చుటచేత దనకుమా రునివలనఁ దగిలెడు దెబ్బలు తప్పినందుకు సంతోషించుచు నల్లమందు లేకపోవుటచేత గాళ్లు లాగుచున్నందున వంటమాత్రము చేసికొని శోభనాచలము తల్లి పరుండెను. శోభనాచలము వచ్చి తానేయన్నం వడ్డించి రామచంద్రునితో గలసి సుఖముగా భోజనముచేసెను.

భోజనమగువఱకు వేంకటస్వామి వచ్చి సిద్ధముగానున్నందున శోభనాచలము వానినక్కడే పండుకొనుమని సహాయార్థ ముండ మనెను. రాత్రి జామయినతరువాత రామచంద్రునకు నిద్రపట్టెను. కొంతసేపటి కందఱు బుసకొట్టి నిద్రపోవుచుండిరి. కాని వేంకట స్వామికి మాత్రమేకారణముననో నిద్ర పట్టదయ్యెను. తరువాత

రెండుజాముల వేళ నేల గొట్టినట్టు చప్పు డయ్యెను. ఏదో స్వప్నము వచ్చి మేఁలకువ గల్గిన రామచంద్రుఁ డాచప్పుడు విని, యెవరువారు? అని కేకవేసెను. ఆ కేక వేయగానే యాచప్పు డాగిపోయి మరల నొకటి రెండు గడియ లయ్యెను. అప్పటికి రామచంద్రుఁడు గాఢముగ నిద్రించుచుండెను. అప్పు డొక దొంగ చప్పుడుగాకుండ మెల్లమెల్లగా నడుగులఁ బెట్టుచు రామచంద్రునియొద్దకు వచ్చి, తల వైపునఁగూర్చుండి తమ్మంట్లు దీసుకొని దురాశచేత, శోభనాచల మిదివరకే రూపాయలన్నియు క్షౌరము చేసినాఁ డన్నమాట నెఱుఁగక, తలక్రిందిమూటలో నేమో యున్న దనుకొని మెల్లగ మూట లాగఁగనే తల భూమిమీదఁ బడి టక్కున దగులుటవలన మెలకువవచ్చి రామచంద్రుఁడు దలయెత్తి చూచి 'దొంగ దొంగ' యని కేకవేసెను. వెంటనే దొంగ మూట బారవైచి యేమూలకో పారిపోయెను. రెండు మూఁడు పిలుపులు పిలిచిన తరువాత శోభనాచలము లేచి దొంగలు పడినందున నాశ్చర్యపడి దీపము వెలిగించి కఱ్ఱపుచ్చుకొని యిల్లు నాల్గుమూలలు వెదకెను. కాని వాని కెక్కడను దొంగ కనఁబడఁ డయ్యెను.

కమ్మకుఱ్ఱవాఁడు మాత్ర మీకేకలు వినఁబడక కాఁబోలు. చెముటపోయుచున్నను ముసుగు బెట్టుకొనెను. రామచంద్రుఁ డొక్కఁడు పండుకొనుటకు భయపడునేమో యని, తాఁదలఁచిన పని కొంచెమైనది కనుక, శోభనాచలము రామచంద్రునిమీఁద నతిదయ గలిగి దగ్గఱగాఁ బండుకొనెను. రూపాయలు శోభనాచలముదగ్గఱ నుండుటచేతను తమ్మంట్లు దొంగ యెత్తుకొనిపోవుటచేతను, రామచంద్రునకు భయపడవలసిన యావశ్యకత మంతయుఁ బోయి సుఖముగా నిద్రపట్టెను. కాని మధ్యమధ్య స్వప్నములు, పలవరింతలు నాతని నిద్రకు నంతరాయములు కల్పించుచుండెను. మురుగుల నమ్ముకొనుట చేత వచ్చిన సొమ్ముతో కొంతకాలక్షేపము చేయవచ్చు నను ధైర్యమున దమ్మంట్లుపోయిన విచార మింతగా రామచంద్రున కగుపడలేదు.

వయస్సునందు బాలుఁడయ్యు, దెలివి దేటలం దసమానుఁడైన

యాత్మకట్టువాడే రామచంద్రుని తమ్మంట్లబాధ వదలించిన సాహస విక్రమార్కు డని చెప్పనక్కఱలేకయే మీరు తెలిసికొనవచ్చును.

జూదరియు, వంచకుండును, ద్రోహియు నగు నీశోభనాచలము రామచంద్రుని తండ్రియగు శ్రీరాముడుగారి నెఱుఁగక పోయినను నెఱిగినట్లు చెప్పి, నిరక్షర కుక్షియయ్యుఁ గావ్యపంచకమువఱకుఁ జదువుకొన్నట్లు చెప్పి, పరమనీచుఁడయ్యు గొప్పవారికి బంధువుడనని చెప్పి, బ్రహ్మచారియయ్యు గృహస్థుండనని చెప్పి మోసముచేసి రామచంద్రునిఁ దనయింటికి రప్పించుకొని చేయఁదలచిన పనినంతయుఁ జేసి సఫలమనోరథుండై యారాత్రి తమ్మవానిచేత దొంగతనము చేయించి, తమ్మంట్లు తానే యపహరించి మిగిలిన రాత్రియంతయు సుఖముగా నిద్రించెను. పద్దుల కనకరత్నమును శోభనాచలమునకు కేవిషయమును తెలిసికోనివాఁడే కనుక యేఁబదిరూపాయల విలువగల మురుగులను ముప్పదియైదు రూపాయలకే తీసికొని యందులో నొకరూపాయి వరువు పెట్టి తనచేతనయినంతవఱకుఁ దానును రామచంద్రుని వంచించెను.

అందఱు నుదయమునందు లేచి కాలకృత్యములు నిర్వర్తించుకొనిరి.

## మూడవ ప్రకరణము

ప్రాతఃకాలమందుఁ గాలకృత్యముల నిర్వర్తించుకొని విశ్వనాథశాస్త్రులవారిదర్శనము చేయుటకుఁ బోవలయునని రామచంద్రుఁడు శోభనాచలమునుగూడ రమ్మని పిలువఁగ నతఁడు వచ్చుటకు వీలు లేదనియు, శాస్త్రులవారు మిక్కిలి మంచివారనియు, స్వయముగానే వెళ్లవచ్చుననియు జెప్పి వారియింటికి మార్గము జూపుటకు [illegible] వేంకటస్వామిని జత ఇచ్చెను. అతఁడును రామచంద్రుని వెంట బెట్టుకొని శాస్త్రులవారియిల్లు చూపిపోయెను.

విశ్వనాథశాస్త్రిలవారియిల్లు రాజవీథిలో నున్నది విశాలముగా నున్న రెండు పీథియరఁగులమీఁదఁ దాటియాకులచాపలు వేయఁబడి యున్నవి. ఆచ్చాపలమీఁద విశ్వనాథశాస్త్రిలవారి విద్యార్థులందఱుఁ గూర్చుండి యుండిరి. అందులోఁ గొందఱు తామిదివరకుఁ జదువు కొన్న పాఠములఁ జింతన చేసికొనుచుండిరి. కొందఱు ముందు చెప్పుకొనవలసిన పాఠములను జూచుకొనుచుండిరి. కొంద ఱాకును గంటమును బుచ్చుకొని క్రొత్తపుస్తకములఁ జూచి ప్రతులు వ్రాయు చుండిరి.

ఉదయమునందే స్నానముచేసి. విభూతిపెండెకట్లు బెట్టుకొని. మొగలితుఱ్ఱు సంస్థానమునం దష్టావధానము జేసినపుడు మహారాజుగా రిచ్చిన పట్టుశాలువుమీఁదఁగప్పుకొని బరువైన బంగరుకుండలములు చెవులను క్రిందకు దిగలాడుచుండ విశ్వనాథశాస్త్రిలవారు గోడకు జేరగిలఁబడి కొంచెము తలవంచి కన్నులకు సులోచనములు బెట్టు కొని. పాఁతదగుటచేత నక్షరము లగుపడకున్నందున శిష్యుఁడొకఁడు మధ్య మధ్య పత్రములకుఁ గాకరాకుపసరు రాయుచుండ, దాటియాకుల పుస్తక మొక్కటి చదువుచుండెను. శాస్త్రిలవారి కిప్పటికి రమారమి యేఁబదిసంవత్సరము లున్నందున దల కొంచెము నెరసియుండెను. ముసలితనమైనను సుందరముగా దార్ఢ్యముగానున్న యాయనశరీర మును జూచినవారందరు పడుచుఁదనమం దాయన స్ఫురద్రూపియై యుండునని యనుకొనక మానరు.

రామచంద్రుఁ డక్కడకుఁ బోగానే శిష్యులందఱు నితని నెగా దిగఁజూచి తమలోఁ దాము ముసి ముసి నవ్వులు నవ్వుకొనుచుండిరి. రామచంద్రుఁడు వచ్చి శాస్త్రిలవారికి నమస్కారముచేయ నాయన యాతని దీవించి కూరుచుండు మని జెప్పెను. కూరుచున్నతరువాత రామచంద్రుని సంగతు లన్నియు నడిగి యాతడు తమవద్దఁ జదువు కొనుటకు వచ్చినాఁడని దెలిసికొని శాస్త్రిలవారు సంతోషించిరి.

అంతటనొక శిష్యుఁడు రామచంద్రునితో ముచ్చటింపఁ దలఁచి యిట్లు సంభాషించెను.

**శిష్య : అయ్యా ! తమ రెంతవఱకుఁ జదువుకొన్నారు ?**

రామ : కావ్యపంచకము వరకుఁ జదువుకొన్నాను.

శిష్య : ఎంతకాల మైనది కావ్య మారంభించి ?

రామ : మూడు సంవత్సరము లైనది ఇంక నేమాత్రమో కొన్ని నెలలు తక్కువే.

శిష్య : ఏమి బడాయిలయ్యా ? ఎన్నఁడుఁ గావ్యముల ముఖ మెఱుఁగనివాని దగ్గర చెప్పినట్లే చెప్పుచున్నావు. నీ వెంత తెలివిగల వాడ వైన నేఁడాది కాక కావ్యముకంటె నెక్కువ చదువఁగల వటయ్యా ? నీవే చదువుకొన్నావా ? ఇంకెవరు జదువుకొనలేదా ? మేము నీవలెఁ దెలివిగలవారము కాకపోయినను కొద్ది గొప్ప జదువు కొన్న వారమే !

రామ : నే నబద్ధములు చెప్పుచున్నాననియా మీ యభిప్రాయము ? మూఁడు వత్సరములలోఁ గావ్యములు చదువుకొనుట యొక వింతటండీ ! నే నీలాగునఁ జదివినాను.

శిష్య : మీరు కాదుకదా ? బ్రహ్మరుద్రులైనను సరే ? ఏడాఁది కొక్కటి చదువునప్పటికిఁ జచ్చిచెడి చేయంగల విన్నపములగును. మాటలండీ ! మా గ్రామమునందు బ్రాహ్మణుఁ డొకఁడు నవద్వీపము వెళ్ళి యిరువదినాలుగు సంవత్సరములు వ్యాకరణశాస్త్రము చదివి నాఁడు. ఇంకను గ్రంథము తరువాయి. నీవాకాశముమీఁదనుండి యూడిపడినావా ఏమిటి ? అయితే దినమున కెన్ని శ్లోకములు చది వెడువాఁడవు ?

రామ : పది, యెనిమిది యీ ప్రకారముగాఁ జదివెడు వాఁడను.

శిష్య : (గుండె చేతితో బాఁదుకొని) అబ్బా ! లోకములోలేని వింత. నీ తలమీఁద దాఁటి కొమ్ములుదిరిగినవా రైనను రెండు మూఁడు శ్లోకములకంటె నెక్కువ చదువలేదు. (అని శాస్త్రులవారి వంకఁజూచి) ఏమండీ శాస్త్రులవారు ! ఇతని మాటలు చిత్తగించినారా ?

విశ్వ : ఆశ్చర్య మేమున్నది ? కుశాగ్రబుద్ధు లున్న పక్షమున నట్లె చదువఁగలరు.

ఇట్లువారు సంభాషించునప్పటికి జాముప్రొద్దెక్కఁగాఁ గొందఱు శిష్యులు సాధుకరమునకును, కొందఱు వారమునకును, కొందఱు పూఁటకూళ్ళ యిండ్లకును బోయిరి.

రామచంద్రుఁడు శాస్త్రులవారిదగ్గఱ సెలవుపుచ్చుకొని శోభనాచలమును దీసికొని పూటకూళ్ళ యింటికిఁ బోయెను. అపూఁటకూటి యింటి యరుగుమీఁద భోజనార్థము వచ్చిన కొందఱు రాజులును, బ్రాహ్మణులును గూర్చుండిరి. లోపల నడవలోనున్న దండెమునకు పట్టుబట్టలు వరుసగాఁ జూటబడియుండెను. ఉదయాసమయమునను తడికాళ్ళతో మనుష్యులు తిరుగుచుండుటచే నిల్లంతయుఁ దేమగలిగి కొంచెము జారుగా నుండెను; వేసులను బోచీలును, మురుగులును, బంగారు తీఁగెలు వేసిన రాగిపుస్తెలును, మెడలో నల్ల పూసలు, పత్తెడ, నామముఁ గలిగి, చలువచేసిన జరీపంచె శరీరమునకంతయుఁ గనుపడునట్లు గట్టి, జుట్టు పిగ ముడివేసి యింట గొందఱికిని బైటఁ గొందఱికిని వడ్డించుచు, భోజనముచేసిన వారిచ్చుచున్న డబ్బుల నెడమచేత బుచ్చుకొనుచు, నిక్కాలి పని తొందరచే మాటాడియాడక తిరుగుచున్న యొక తలవెంట్రుకల విధవను జూచి, శోభనాచలము "రాజమ్మా! బాగున్నావా? మునపటివలె యెక్కువ దార్ఢ్యముగాఁ దిరుగుచున్నావా?" యని పలుకరించెను.

రాజ: తమ దయవల్ల బాగున్నాము. మా నాన్న మునుపటి వలెనే తిరుగుచున్నాఁడు గాని వగ్గుమాత్రము వదలలేదండి. ఏమి యీవేళ మామీఁద గటాక్షము వచ్చినది?

శోభ: మరేమిలేదు. రాజమహేంద్రవరము నుండి మా రాజువారి చిన్నవాఁడు వచ్చినాఁడు. అతనికి మీయింట నుండవలెనని యున్నది. అతని నిక్కడ నప్పగించుటకు వచ్చినాను. పిల్లవాఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. ఈకాలపుఁ బిల్లలవలె నల్లచిల్లరి వాఁడు కాఁడు. నీవందరి నొకయెత్తు నీ పిల్లవాని నొకయెత్తుగాను జూడవలెను. ఇతఁ డొకరిజోలికి నొంటికి బోవువాఁడు గాఁడు. తనపనియేమో. తానేమో.

రాజ: దాని కభ్యంతర మేమి? తమ రింతమారము శ్రమ పడి రావలెనా? ఆపిల్లవానికి మరొకశోభము రాకుండ జాగ్రత్త పెట్టుభారము నాది.

శోభ: రూపాయ లతని నడుగవద్దు. నెల కాగానే నేనిచ్చి వేయుదును. ఇక వంట యెంతయాలస్యముగా నగును? నాలుగు గడియలకు రావచ్చునా?

రాజ: అక్కఱలేదు. రెండు గడియలలోగా రావచ్చును. స్నానముచేసిరా నాయనా!

అప్పుడు శోభనాచలమును. రామచంద్రుఁడును వెళ్ళిపోయిరి.

రాజమ్మది పూర్వము పలివెల నివాసస్థలము. ఆమె పెనిమిటి వివాహమైన రెండుమాసములకే కాలధర్మము నొందుటచేతను పుట్టి నింటివారి సంసారము చితికిపోవుటచేతను రాజమ్మ తల్లిని, సంగ తిని దమ్ముని దీసికొని యమలాపురము వచ్చి యచ్చట పూఁటకూళ్ళను బెట్టుచు నహోరాత్రములు పేసెడువిస్తరి వేయుచు దీసెడివిస్తరిఁ దీయుచుఁ వంటలు చేయించుచు వచ్చినవారికి వడ్డించుచు, గాళికో మన్న యన్నపూర్ణసత్రమునందువలె నిరంతరాన్న దానము చేయుచు నమలాపురమునందే కాక కోనసీమయందంటను మహాప్రసిద్ధికెక్కి విస్తారము ధనము నార్జించెను. పూఁటకూళ్ళను బెట్టుటకారంభించి మూఁడుసంవత్సరములైనను బండ్రెండు వందల రూపాయల నార్జించెను. ఆమె మొదట నాగ్రామమునచ్చినపుడు వండుటకుఁ బాత్ర సామగ్రియైనఁ లేని యిల్లు గంగాళములు మొదలయినవానితో నిండి యుండగా మొదట కేవలము రాగిపట్టెలయిన లేని రాజమ్మశరీరము బంగారపునగలతో నిండియుండుట యొక యాశ్చర్యముగాను.

పాపము దైవ మోర్వఁజాలక యామెకు వైధవ్యమును దెచ్చి పెట్టి మనసు వచ్చిననగలు పెట్టుకొనుట కభ్యంతరము కల్పించినాను గావి లేనిపక్షమున బుణ్యస్త్రీలు పెట్టుకొను నగలన్నియు బెట్టుకొనుట కామెదగ్గఱ సామర్థ్య మున్నది. ధనము హెచ్చినకొలఁది సుకుమా రముకూడ హెచ్చినందున రాజమ్మ వంటచేయుట కష్టమని తోఁచి

యొకవంటబ్రాహ్మణునిఁ బెట్టెను. మొదట వచ్చినపుడు రాజమ్మ దండ్రి పెసరట్లు నమ్ముటచేతను. దల్లి నీళ్ళబిందెలు మోయుట చేతను దమ్ముడు చలిపందిరిలో దాహమునకు నీళ్ళిచ్చుటచేతను. దాను బూఁటకూళ్ళు పెట్టుటచేతను సంపాదించిన ద్రవ్యముతో రాజమ్మ యిప్పుడు వడ్డీవ్యాపారము చేయుచుండెను. మొదట నంద టివి బ్రతిమాలి కాలక్షేపముచేయుచు గొంతధనము చేతఁజిక్కఁగనే గర్వించి మనుష్యులను రాజమ్మ నిరాకరింపఁ బ్రారంభించెను. ఇంటికి పెద్దాడబడు చగుటచేత దలిదండ్రులునుఁ దమ్ముఁడును నామెయడుగు దాఁటక యామెపేరు చెప్పిన గడగడ వణఁకుచుందురు. తన యొంటిని నాలుగయిదు వందల రూపాయల నగలు బెట్టుకొని తమ్మున కైదువందలిచ్చి పెండ్లిచేసి తామున్న యింటివారికి నూరురూపాయ లింటిమీఁద బదులిచ్చి తరువాత నింకొక మా తేఁబదిరూపాయలు వారి చేతిలోఁ బెట్టి యా యిల్లుకొనెను.

రాజమ్మ సంగతి యటుండనిచ్చి యింక గథారంభము చేయు దము. తరువాత రామచంద్రుఁడు స్నానముజేసి మడిగట్టుకొనఁగా భోజనము నారంభమాయెను. ఆ సమయమునందు రాజమ్మ వడ్డన చేయుచు రామచంద్రుని వృత్తాంతమును దెలిసికొని యతడు నియోగి యని జెప్పిన తరువాత నిట్లు మాటలాడ నారంభించెను.

రాజ : మొగమాటపడకు నాయనా ! నియోగపుబిడ్డవు. కొంచెం పరువుప్రతిష్ఠలకు దేవులాడువారు మన నియోగులే. మేము కూడ నియోగులమే యని చెప్పుటకు నీవంటివారి దగ్గర సిగ్గుగానుండును. నగమువచ్చినుఁడీ యీ పనిజేయుచున్నది.

రామ : అవును. కాలము తప్పివచ్చినవు దేమిజేయగలము.

రాజ : నీవు చెప్పిన నమ్ముదువో లేదో కాని మా సంసార స్థితి యేబడియావుల పాడి. కావలసినంత ధాన్యపుపంట. ఏ వస్తువు కైన నొకరియింటికి వెళ్ళనక్కఁరలేకుండఁ గాలిమీదఁ గాలువేసికొని కూర్చున్నవాళ్ళము. ఇవతల చెంబవతల బెట్టి యెఱుఁగమసుమీ. అలాటిదానిని. మాయశక్తి యెక్కఁడమండి వచ్చినదో బిందెలకు

ఖించెలు దించుచున్నాను. నేఁటికాలమున కింతకర్మమును దెచ్చిపెట్టి నావా దైవమా? యని పొట్టకోసం మీ పని జేయుచుఁ దగుదునమ్మా యని దిరుగుచున్నాను. ఎంత సుకుమారముగఁ బెరిగినానో యంత కష్టము వచ్చినది.

రామ: నియోగు లిటువంటిపని జేయవలసిన పక్షమున కష్టము గానే యుండును.

రాజ: కూచిమంచివారు, మాచిరాజువారు, మంత్రిప్రగడ వారు మాకు బంధువులే. వారెవ్వరైన గంటపడినప్పుడు ప్రాణము వచ్చినట్లుగా నుండును. ఇప్పుడయిన నొక డబ్బు సొమ్ము మిగిలించుకొనవలెనని లేదు. వాళ్ళడబ్బు వాళ్ళకుబెట్టి యేలాగునైన మాట దక్కించుకొనవలెనని యుద్దేశమే.

ఇట్లు వారు మాటాడుకొనునప్పటికి భోజనమునకు మరికొందరు వచ్చి చిరకాలము క్రిందట దడిపిన పట్టుబట్టఁ గట్టుకొని యన్నముఁ దినుచుండిరి.

ఒక మనుష్యుడు: రాజమ్మగారూ! కొంతయన్నము చల్లగాను గొంతయన్నము వెచ్చగా నున్నదేమండీ! పొడియన్నమేమైన గలపినదా యేమి?

రాజ: ఊరుకోవయ్యా! ఎవరైనను మీ మాటలకు నవ్వుదురు. యన్నము చల్లారినదేమో!

రెండ: పప్పులో గంజివాసన వేయుచున్నట్లు కనబడుచున్నదేమి?

రాజ: మీకుఁ గొంచెము రొంపపట్టినదేమో? పప్పులో గంజి వాసన యేమిటండీ?

మూడవ: ఏమిటండీ! అవతల రాజులకు వడ్డించగా మిగిలిన యన్నము మాకు వడ్డించినారేమండీ! అంత లొత్తుగా మాలకూడా! కొంచెము కుడి యెడమ వద్దటండీ!

రాజ: చాలు లేవయ్యా! నేర్చుకొని పోయినావు. నీమాటలు నీవు సరే. నీవే యాచారవంతుఁడవా? ఇవతలివాళ్ళే యంత మాల కూడు తినువాళ్ళా? నే వీంటనుండి పళ్లెము దెచ్చి పడ్డనఁ జేయు చున్నందుకా యీలాటి మాటలు?

నాల్గవ; అన్నట్లు జ్ఞాపకము వచ్చినది. రాజమ్మగారూ! మీ మఱది భార్య ప్రసవమైనదఁట. పురుడు వెళ్ల లేదుగదా! మీరుఁ మడి గట్టుకొన్నా రేమి?

రాజ: అయ్యో! మాకు వారికిఁ దరములు దప్పిన వండీ.

నాల్గవ: మఱఁదికి మీకుఁ దరము లేలాగున విడిపోవునండీ! జ్ఞాతులు గనుకనా!

రాజ: పురిటీదినములు వెళ్ళిపోయినవి.

నాల్గవ: ఈ వేళకుఁ దొమ్మిది. శుద్ధిస్నానము కాలేదు. రామ రామ! పురిటికూడు దినినందులకు రేపందఱము స్నానముచేయవలెను. మీ రెప్పుడు నీలాగే వెనుక చద్దియన్నము బెట్టుమన్నప్పుడు మైల బట్టతోనే పెట్టినారు. ఈ యాచార మెక్కఁడను జూడలేదు.

మొదట: పచ్చడిలో మెతుకులు కనబడుచున్న వేమండీ?

రెండవ: ఇందాక నెవరో దిగఁబెట్టిన పచ్చడి వేరే తీసి దాచు చుండగా నేను జూచినాను. అది పొరపాటుచేత నీకుఁ బడినదేమో.

మొదట: నారాయణ! నారాయణ! ఎంగిలికూడు నెక్కఁడ తినగలమమ్మా! ఛీ! నాకీ యన్నము వద్దు. (అని యాపోసనముపట్టి లేచిపోయినాఁడు.)

రాజ: (కోపముతో) వెళ్ళవయ్యా గడియ గడియకు బెదరించి యెంతకాల ముండగలవు? పాపము! పొరుగూరు నుండి వచ్చినారు. తల్లిదండ్రు లెవరు దగ్గఱలేరుగదా యని సమస్త సదుపాయములుచేసి సొంత యింటికంటె నెక్కువ యాదరణ చేయుచున్నందుకా మీరీ లాగున జెవులఁబట్టుకొని యాడించుట! పైపై నున్నది మనమాటలు పడునని మీరను కొనుచున్నారు కాబోలు. నే నాలాగున మాటలు

పడుదాననుగాను. మీ యిష్టమయిన నుండుడి. కష్టమయిన పక్షమున వెళ్లండి. నావంటివారు లక్షమంది మీ కున్నారు. మీవంటివారు లక్షమంది మా కున్నారు. మా తెక్కలు చల్లగా నున్నంతసేపు భయములేదు. ఇప్పటి కయినది లెక్కచూచి యిచ్చి మరీ వెళ్ళండి. అందాక పట్టుపంచ పట్టుకొని వెళ్లవద్దు.

నాల్గవ: సరే! ఉంచుకొనుడి పట్టుపంచె. నాకు భయములేదు.

రాజ: అవతల వీధినున్న ముండ డబ్బులు పుచ్చుకొని కడుపు గాల్చెడిది అదే మంచిది. పరమార్థ మాలోచించెడు మా వంటి పరువు గలవారలకు గాలముగాదు. వాండ్రిదగ్గఱ నోరెత్తరు. ఆ మాయముండ కేలాగున డబ్బు దక్కునో తెలియదమ్మా.

అని యనగానే పట్టుపంచ వదలి యతడు పోయెను. రామచంద్రుడును భోజనానంతరము పాతశాలకుం బోయెను. శిష్టాచార సంపత్తిగల సాంప్రదాయమునందు బుట్టిన రామచంద్రుడు పూటకూటియింట బొట్టుబెట్టుకొనక, కాళ్లుగడుగుకొనక, మడిబట్టలంగట్టుకొనక భోజనము చేయువారలను జూచి పట్టణవాసములయందు గల వైచిత్ర్యముల కాశ్చర్యము నొందెను. అంతతో నతని యాశ్చర్యము సమాప్తము నొందక రాజమ్మ చర్యలు, భోజనమునకు వచ్చినవారి సంభాషణలు విన్నపిదప నధికమాయెను.

రామచంద్రు డాదినము మొదలు విశ్వనాథశాస్త్రిలవారి యింటనే పండుకొనుచు నచటి సహాధ్యాయులతో సుఖముగాం గాలము గడుపుచుండెను. ప్రతిదినము మధ్యాహ్నము భోజనమైన తరువాత శాస్త్రిలవారు గేదెకు గడ్డి నిమిత్తము పొలమునకుం బోయినప్పుడు గురుశుశ్రూషయం దొకరికంటె నొకరు మించవలెనని పనిం జేయుచున్న శిష్యులతోం గలసి, శాస్త్రిలవారికిం దనచేతం బని చేయించుట కష్టము లేకున్నను, దానుగూడ శక్తిలోపము లేక శుశ్రూష చేయుచుండెను. విశ్వనాథశాస్త్రిలవారికి రామచంద్రుని మీదంగలం మంచి యభిప్రాయ మంతకంతకు హెచ్చెను. మనోహర మయిన

యాకారమును, నాకారమునకుఁ దగిన బుద్ధిసంపదయు, బుద్ధిసంపద కనుగుణమయిన విద్యాసక్తియు, విద్యాసక్తి కలంకారముఁ బెట్టుచున్న వినయసంపత్తియు నర్జునునియందు ద్రోణాచార్యునకు వలెనే రామచంద్రుని యందు విశ్వనాథశాస్త్రులవారికి మంచి ప్రేమను కలిగించెను.

శాస్త్రులవారి యింటియెదుటనే గ్రామమునం దెల్లఁ దగు పెద్దమనుష్యులను సంపన్న గృహస్థులయిన మంత్రిప్రగడ శరభరాజుగారి యిల్లుగలదు. ఆయన కుమారుఁడు రామచంద్రుని యీడు గలవాఁడు శాస్త్రులవారి దగ్గఱ చదువుకొనుచు రామచంద్రుని సత్ప్రవర్తనమునకు బుద్ధికిని సంతోషించి యతనితో స్నేహముచేసి యతఁడెక్కడ నుండిన దానక్కడ నుండుచు నీతని కేలోపము తటస్థమయినను సహాయము జేయుటకుఁ దాను సిద్ధముగానుండి యుతని నతిగౌరవముతోఁ జూచుచుండెను. వారిద్దఱును గృష్ణార్జునులవలె నతిశయ స్నేహముచేతఁ బ్రసిద్ధికెక్కిరి. సహజముగా మంచి శారీరముగల రామచంద్రునకు రాగజ్ఞానము వన్నెతేఁ, బుస్తకము నతిశ్రావ్యముగాఁ జదువఁగలుగుటచేత శరభరాజుగారప్పుడప్పు డతనిని బిలిపించి పుస్తకముఁ జదివించుచుందురు. పుష్పసౌరభ్యమువలెనే వ్యాపించిన రామచంద్రుని కీర్తివలన నతనియందు మంచి యభిప్రాయముగల శరభరాజుగారి మనస్సునకు, విశ్వనాథశాస్త్రులవారును, గుమారుడుఁను జేయు న్యాయమైన స్తుతులు తక్కాగా నాటి పిల్లవానియం దొక విధమైన యనురాగమును గలిగించెను.

ఇది యిట్లుండగా రామచంద్రుఁడు పూఁటకూటియింట ప్రవేశించి రెండు మాసములయినది. ఒక పర్యాయము రాజమ్మ లెక్కకు దొందర పెట్టగా శోభనాచలము రెండు రూపాయల నిచ్చెను. కాని తరువాత నొక దమ్మిడియయిన నియ్యలేదు. తరువాత రామచంద్రుఁడు తన సహాధ్యాయునియొద్ద రెండు రూపాయలు బదులుచేసి రాజమ్మ కిచ్చెను. ఇట్లు రాజమ్మ కొకమాసము సొమ్ము మాత్రము ముట్టినదిగాని రెండవ మాసపుసొమ్ము ముట్టనందున నామె రామ

చంద్రుని విలువనీయక బాధపెట్ట నారంభించెను. శోభనాచలమే సొమ్ము నిత్తునని మొదట నొప్పుకొని తరువాత నీయవలసిన యవసరము లేదనియు రామచంద్రునేయడుగు మనియు, రాజమ్మకు రహస్యముగా వర్తమానము నంపెను.

శోభనాచలము తన స్నేహితునకు ఐదునైదు రూపాయలు బదులు పుచ్చుకొని స్నేహితునిచేత సొమ్మిప్పించనులేదు, తానీయను లేదు. ధనము పుచ్చుకొన్నపుడున్న చొరవయు, ధైర్యమును మరల సొమ్మునిచ్చునపు డాతనియందుఁ గనబడవయ్యెను, తనస్నేహితుఁ డీయవలసిన ఋణమునకుఁ దా నుత్తరవాదిని గాననియుఁ జెప్పి శోభనాచలము రామచంద్రుఁడు తన యింటికిఁ దడిమన్ను పొడి మన్నగునట్లు తిరిగినను నొక దమ్మిడియైన నీయక వచ్చినపుడెల్ల సాయంకాలము రమ్మని యొకమాఱును. నుదయము రమ్మని యొకమాఱును. సొమ్మందలేదని యింకొకమాఱును మనసులో నేమి యనుకొనవద్దని యొకమాఱును. తనకు జాలమొగముగా నున్నదని మఱొకమాఱును జెప్పినమాట చెప్పక వానిని తిప్పుచుండెను.

రామచంద్రుండే వేళప్పుడుఁ సొమ్మిచ్చెనో కాని శోభనాచలమునకు సొమ్మెన్నఁడు నందలేదు. అవసర మెక్కువై తనయింటి కతఁడు వచ్చినకొలఁది శోభనాచలమునకు సొమ్మీయవలె ననునభిప్రాయము తగ్గి పదుమాఱతఁడు వచ్చినందులకు విసుగు హెచ్చెను. రామచంద్రుఁడింటికి వెళ్లినపుడు శోభనాచల మగుపడక యింటనుండక యొకవేళ నింటనుండిన లేదనిపించుచు, వీధిలో నెదురైనప్పుడు పక్కసందులోనికైనను దగ్గఱయింటికైననుబోవుచు, నట్లువేయ వీలుగానపుడు ముసుగువేసికొని స్నేహితులమధ్య దాఁగుచు మొగమున కేదయిన నడ్డము పెట్టుకొనుచు, గాలము గడుపుచు వచ్చెను. అతిస్వల్పకాల సంపాదితమైన వారి స్నేహము, క్రమక్రమముగా మొగమోటమై, లజ్జయై, మనస్పర్థయై, నిష్ఠురమై, యాగ్రహమై తుదకు రానురాను కలహముగాఁ బరిణమించెను.

తుదకు రాజమ్మయొక్క బాధపడజాలక నొకనాఁ డుదయాస్త

మయములు వాకిట గూర్చుండి వేంకటరత్నముతోఁగూడ వచ్చుచున్న శోభనాచలమును బట్టుకొని రామచంద్రుఁడు విధిలేక యీప్రకారముగా మాటలాడ నారంభించెను.

రామ : అయ్యా! శోభనాచలముగారు! ఎంతకాలము తమ యింటిచుట్టు నేను దిరిగినను నామీఁద ననుగ్రహమింకను రాలేదు గదా? రాజమ్మగారు నన్ను నిలువనిచ్చుటలేదు. తేపోమాపో యింట నుండి నన్నామె వెడలగొట్టును. నామనవి చిత్తగించి లెక్క దయ చేయుదురా! తమ రుచితముగ నిచ్చినట్లు సంతోషించెదను. పుచ్చు కున్న సొమ్ముగాని మఱొకటి కాదు.

శోభ: (ఆగ్రహముతోఁ గన్ను లెఱ్ఱజేసి) నీకేమయినఁ గొంచెము బుద్ధియున్నదా లేదా? పెద్దపిన్నలున్నారను సందేహ మేమియు నక్కఱలేదా? అందఱు నీవలెఁ దుచ్ఛులే యనుకొన్నావా? నీవు బ్రతికిన బ్రతుకుకొద్ది నీపరువుకొద్ది యడిగినావు. నీ సంప్ర దాయ మెటువంటిది? నీ సంగతినేనా దినముననే గ్రహించినాను.

రామ : అయ్యా! తమకంత కోపమెందుకు? నే నేమన్నాను. నావల్ల దప్పున్న క్షమింపుడు.

శోభ: మేము నిన్ను క్షమింపదగువారమా! నీవే నన్ను క్షమింపవలెను. చచ్చిచెడి యేలాగో రెండుగుల్లలు తెగనమ్ముకొని నీవుకాగా నా సొమ్ము సంపాదించినావు. నీ దగ్గర బదులు పుచ్చు కొనుట నాదే బుద్ధితక్కువ. నీ వీ స్వల్పమునకు మొగము చెండు కొనుచున్నావు. కాని యిలాటివి లక్షలు సంపాదించినాము, లక్షలు వ్యయముచేసినాము. నావంటివాని కిది యొక లెక్కకాదు.

రామ : అందుచేతనే త్వరగా దయచేయించండి. నేరమం తయు నాదే,

శోభ: ఇయ్యకమానుదుమా యేమిటి! ఇచ్చినదాక జచ్చి నట్లుండు, అప్పుడునుకు రాదు. నీ సొమ్మెంతజేయును? నీవెంత చేయుదువు! నీ నైజము కనబఱచుకొన్నావు. నీ సొమ్ము వారము

వాఁటికి గిరగిరఁ ద్రిప్పి పాఱవేసెదను. నీకంటె నిర్భాగ్యుఁడు గాని నీసొమ్ము నపహరింపఁడు. నీకు గతిలేదుగాని మాకు లేకపో లేదు. ఉపకారమునకు పోగా నపకార మెదురయినదఁట. వచ్చిన నాఁడు మా యింట నుంచుకొని బంధువుఁగదా యని సమస్తవిధముల నాదరించినందుకా యీ మాటలు ? సాటి నియోగపువాఁడవని నీకింత నిర్వాహకము చేయవలెనని అనుకొన్నాను. అయ్యా! వేంకట రత్నముగారు ! ఆ రాత్రి దొంగలుపడినప్పుడు దాను గుఱ్ఱివాఁడు - భయపడునని దగ్గరగా మీఁదఁ జెయ్యివేసికొని పండుకొన్నాను అ విశ్వాసమయిన లేదు. ఈ కాలములో నెవరికి నుపకారము చేయ గూడదండి ; నాయనా ! రేపు నీ సొమ్ము నీకు బంపెదను. ఇప్ప టికి వెళ్ళు.

వేం : ఇంత మంచివారు. మీతో పడినది కాదు. ఇంక నీ గ్రామమునం దెవరితో సరిపడును ? బాగానే సార్లాసడగలదు. సరసముగానే యున్నది.

రామ ; మీ చిత్తము ఇంక నేనడుగను. ఆ మాట మీరే దక్కించుకోవలెను.

శోభ : అమలాపురం నీళ్ళొంటబట్టినవి. పెంకితనం ముదిరి నది. మాట దక్కించుకోవలె గాదూ ? ఇది జ్ఞాపకముందుకో.

రామ : మీ రాచందార్కము నాకు జ్ఞాపకముండునట్లు చక్కని పనిఁ జేసినారు.

అని మెల్లగా ననుకొని మాటలతోఁ దన్ను దెమల్చి శిక్షింపక దయదలఁచి పోనిచ్చినందులకు మనస్సులో సంతోషించుచు దేవున కనేక వందనములు చేయుచుఁ బూటకూటి దానికేమి ప్రత్యుత్తరము చెప్పుదునా యని యాలోచించుకొనుచు రామచంద్రుఁడు వచ్చెను. రాగానే రాజమ్మ వానిని జూచి యిట్లనియె.

రాజ : లెక్క తెచ్చితావయ్యా ?

రామ : శోభనాచలంగారు—

రాజ : (మాటకడ్డము వచ్చి) శోభనాచలంలేదు. గీభనాచలం లేదు. నా యింట దిన్నవాడవు నీవా శోభనాచలమా? నాకాతనితో నేమి? ఒడలెరుగవు? ఎవరియబ్బ సొమ్మని తిన్నావు? డబ్బు పుచ్చుకోకుండ నీకు మూడుపూటలు వండి కుంభముతోడుట కెవరు నీ కచ్చియున్నారు. పో పో నా యింటనుండి లేచిపో. చెంబు. పట్టుపంచ నేవియ్యను. నడు నడు....

అంత కఠినంగా రాజమ్మ మాటలాడినపు డింక నచ్చట నుండ రాదని చివాలునలేచి రామచంద్రుఁడు వెళ్లుచుండెను. అంతట నాతని మార్గమధ్యమందు వెనుక తనకు రెండురూపాయల నప్పిచ్చిన సహాధ్యాయుఁ డగుపడి రామచంద్రుని నిలువఁబెట్టి తనసొమ్ము తనకిమ్మని యడిగెను. వారిట్లు మాట్లాడిరి.

సహా : ఏమోయి. అప్పు పుచ్చుకొని తిరిగి ఇచ్చినావుకావు? ఒకనాఁడా రెన్నాళ్లా! అంత గతిలేనివాఁడ వెందుకు పుచ్చుకొన్నావు? పోనీ యెగవేయి దీనితో నీవు పెద్దకాపురము చేయవు; నేను చెడి పోను. మర్యాదగాదు. నే నెలాటి యవసరములో నీ కిచ్చినానో నీవు నా కాలాగు రెండవకంటివాఁ డెఱుఁగకుండ నీయవద్దా? రేపు నీ వీయకపోతివా నీకు నాకు బాగుగా జరుగదు.

అని చెప్పి వెళ్ళిపోయెను.

అతని యదృష్టమేమో కాని రామచంద్రునకు బదులిచ్చిన వారును, నతనియొద్ద బదులు పుచ్చుకొన్నవారును గూడ నతనిని నిందించుచుండిరి. శోభనాచలము సొమ్మిచ్చునను నాశ వానికి లవ మును లేదు. గ్రామమందుఁ దాన్నెవరు నెరుఁగరు. రాజమ్మ లేవ గొట్టినది. మద్దుల కనకరత్న మియ్యవలసిన యా రూపాయికూడఁ దా నీయనక్కఱలేదని చెప్పెను. అందుచేత మహావిచారము గలిగి నిర్విణ్ణుఁడై సాయంకాలమునఁటకు భోజనము లేనందున గడుపులో మలమల్లలాడుచుండగాఁ బ్రదోషకాలమున నెప్పటియ ట్లాలయమునకు బోయి దేవదర్శనము జేసి తరువాత మంటపముమీఁద నుత్తరీయము బఱచుకొని గుర్రిడ్లనీళ్లు గ్రుక్కుకొనుచు దలిదంద్రుడుటు చనిపోవుటయు

బినతండ్రి యన్యాయముగ సొత్తపహరించుటయు, ద్రవ్యనష్టమును, ప్రతిష్ఠలమువ దిట్లున, దలంచి తలంచి విచారించుచు వెల్లకిలంబండు కొనెను. రామచంద్రుని సంగతియంతయు నెవరివలననో విని శరభ రాజుగారి కుమారుడు గోపాలము గ్రామమంతయు వెదకి దేవాలయ మునకువచ్చి మంటపముమీఁదనున్న రామచంద్రుని గనుఁగొని మొగ మాటముచేత నతఁడేమియు జెప్పకున్నను భోజనము చేయునట్లు గ్రహించి "రామచంద్రుఁడూ! మా బాబయ్యగారు నిన్నొకసారి రమ్మ న్నారు" అని చెప్పి తీసికొని వెళ్లెను.

# నాల్గవ ప్రకరణము

అమలాపుర మునందు గల యిండ్లన్నిటిలో మంత్రిపర్గడ శరభరాజుగారి యిల్లే పెద్దది. వీధియరుఁగులకు గచ్చుచేయఁబడి యున్నది. ఇటుకలతోఁ గట్టిన స్తంభములు రెండరుగులమీఁదను గలవు. తాతిమెట్లతో నిండిన గుమ్మముదాఁటి లోపలికి బోఁగా నెడమచేతి వైపునఁ బెద్ద కచేరీ చావిడి యడుగువేసిన జారునట్లు నున్ననయి తెల్లని పాలగచ్చుతో నిండియుండును. చావడికి రెండు ప్రక్కల రెండు గదులుండును. అందులో నొక గదిలో శరభరాజుగారి జ్యేష్ఠకుమారుడైన రాజగోపాలము చదువు కొనుచుం డును. చావడి కెదురుగా నున్న వాకిట వేసవికాలము గనుక నొక కొబ్బరియాకుల పందిరిగలదు. చావడిమీఁదఁ గూర్చుండుటకు వెదురువేళ్ళ చాపయు, దానిమీఁదఁ దివానులును గలవు. గోడదగ్గర మూడుమూళ్ళ పొడుగున నొకపెద్దదిండు జేరగిలఁబడుటకు వేయఁ బడియున్నది. ఇనుప జాలకట్టులుగల యొక గవాక్షము దిండుపై నుండుటయేకాక, చావడిలోనుండి దొడ్డిలోనికిఁ బోవుటకుఁ దిడ్డికికి రెండుప్రక్కల రెండు గుమ్మములును, వానికి రెక్కతలుపులును గలవు. వీధిగుమ్మమునకు నెదురుగా లోగిలియొక్క లోపలిభాగ

మున్నది. అందు ముందువాయును, దాని ప్రక్కలను రెండు గదులును వానికిఁ జేరి వడమటియిల్లు నున్నది. దొడ్డిలో నొక యుప్పు నీళ్ళనుయ్యి త్రవ్వఁబడి యున్నది. మూతికిఁ గొంచెము ప్రక్కగా దులపికోట వేయఁబడి యున్నది. ఇంటికి దక్షిణభాగమందు బళువుల పాల యొకటి గలదు. ఈ ఇంటియందు శరభరాజుగారు దండ్రి తాతల నాటనుండియుఁ గాపురమున్నవారు.

శరభరాజుగారి కిప్పటికి నలుబది సంవత్సరము లుండును. మొలకు బంగారపు గోవత్రాడును, జేతులకు నగిషీచెక్కిన గుల్లమురుగులును, వ్రేళ్ళకు బటువులును, శరభరాజుగా రెప్పుడును దీయక ధరించుచుందురు. ఆయన పచ్చనైన కొంచెము స్థూలశరీరము బట్టతలయు గలిగియుండును.

శరభరాజుగారికిఁ దొలిచూలు మగపిల్లవాఁడు పుట్టుటచేత సంతోషించి రాజగోపాలుఁడని తమతండ్రిగారి పేరుఁ బెట్టుకొనిరి. రాజగోపాలము తరువాతఁ దొమ్మిది సంవత్సరముల వరకు శరభరాజుగారికి బిడ్డలులేరుగాని పిమ్మట నొకకుమార్తెగలుగ నేడవపురిటి నాటికి నాలుగు మాసములక్రిందటఁ జనిపోయిన శరభరాజుగారి చెల్లెలు స్వప్నములోఁ గృష్ణవేణమ్మకు గనఁబడి పేరు పెట్టుమనినందున నీకుమార్తెకుఁ బార్వతియను పేరుపెట్టిరి. ఆమె వెనుక నొక కుమారుఁడు గలిగెను. అతనిపేరు నరసింహము.

కృష్ణవేణమ్మ తనశరీరమున ధరించిన యాభరణముల కాంతిని వెలవెలఁ బాఱఁజేయు కాంతిఛాయయు నాకర్ణాంతములైన నేత్రములను, దానిమ్మగింజల వంటి పండ్లును, సన్నని నడుమునుగలిగి, లావణ్య మందేగాక సత్ప్రవర్తనమునందును స్త్రీలలో శిరోభూషణమై మగని మాట జవదాటక, సత్కార్యములయందు శరభరాజుగారికిఁ దగిన ప్రోత్సాహము నిచ్చుచు ననుకూలదాంపత్యమునకు నిదర్శనము వీరేయని జనులు స్తోత్రము చేయునట్లు మహాకీర్తిని గాంచెను.

శరభరాజుగారికి సంవత్సరమునకు గొబ్బరితోటల మీఁదను భూములమీదను మూడువేల రూపాయలు వచ్చును. గ్రామమునం

దాయన తగు పెద్దమనుష్యులగుటచే వివాదలు గలవారందరు శరభ రాజుగారి యెదుటకు వచ్చి తగవుల పరిష్కరించు కొందురు.

వేంకటరత్నము శరభరాజుగారి కొక వేలువిడిచిన పినతండ్రి కొడుకు. బాంధవ్యమునందే కాక గుణములయందుఁ గూడ వేంకట రత్నము శరభరాజుగారికి దూరమే కనుక నతనిఁ దనయింట నుంచు కొనుటకు నిష్టము లేకపోయినను తల్లి ప్రోద్బలముచేత నతఁడింట నుండుట కొప్పుకొన సమ్మతించెను. చిన్నతనమునందే తల్లిదండ్రు లార్జించిన రొక్కమంతయు విచ్చలవిడిగా వ్యయముచేసి యున్న వస్త్రములకు లోపమురాఁగానే వేంకటరత్నము వీరి యింటఁ బ్రవే శించెను. వివాహము కాకపోయినను, నతనికి సంసారికంటె నెక్కువ తాపత్రయము గలదు, ధనము వచ్చుబడి లేకపోయినను ద్రవ్యముతో నావశ్యక మెక్కువగ నుండెను.

రామచంద్రుఁ డమలాపురము వచ్చిన నాటిరాత్రి వేంకట రత్నము చెఱువుగట్టున బ్రవేశించిన యిల్లు వారి భోగస్త్రీయైన చంద్రముఖి యిల్లే. లావణ్యము నందామెకుఁ జంద్రునితో సమాన మైన కాంతి లేశమును లేదు. సరికదా చంద్రునివలె గుండ్రని ముఖము గలిగి చంద్రముఖి నామము సార్థకము జేసికొనునేమో యను కొన్నను మొగము కొంచెము మించుగా మూరెడు పొడు గుండును. కొమార్తెకు సార్థక నామము లేకపోయినను దన చిన్న తనమునుండియు, నింటికి వచ్చిన యనేక నరుల ప్రాణముల హరించి హరించి యిప్పటికి జవసత్వములుడిగి యున్న దాని తల్లికి నరహరి యను నామము సార్థకమైయుండెను. చంద్రముఖికి జప్పిదవడ లుండుటచేతఁ దమలపాకుల యావశ్యక మెక్కువగ నుండెను.

అట్లు రామచంద్రుఁడు రాజగోపాలముతో రాఁగానే శరభ రాజుగా రతనిని దమయింట నుండుమని బలవంతపెట్టిరి. నియ్యోగి కుటుంబమునందుఁ బుట్టిన రామచంద్రునకుఁ బరగృహవాసము చేయుట యభిమానమని తోఁచినను కాలము తప్పివచ్చినందున

శరభరాజుగారి యింటనుండి రాజగోపాలముతో గలిసి చదువుకొను చుండెను.

వచ్చినప్పటినుండియు రామచంద్రునకును వేంకటరత్నము నకును గొంచెము సరిపడకుండెను. శోభనాచలమునకు స్నేహితుం డగుటచేత వేంకటరత్నమునకును రామచంద్రునిమీద గొంచెము కోప ముండుట సహజమే. అది యటుండగా వేంకటరత్నము విలువ బొట్టువాండగుటచేత రామచంద్రుండా బొట్టు పెట్టుకొననందుకు నాతనిమీదం గోపము వచ్చెను. తరువాతం గొన్ని దినములకు శరభ రాజుగారొకనాడు రామచంద్రునితో నేదోరహస్యమును జెప్పిరి. ఆ రహస్యముం దనకుం జెప్పుమని వేంకటరత్నము రామచంద్రు నెంత బలవంతపెట్టినను. నతండు చెప్పనందున వానిపైం గోపము ద్విగుణ మయ్యెను. అందుచేత వేంకటరత్నము రామచంద్రుం డొంటరిగాం దనకంటం బడినప్పుడెల్ల బొట్ట కూటికిం జేరినవాండనియు, సర్వజ్ఞత్వము మెండనియు, నింక నిటువంటి యెత్తిపొడుపుమాట లనుటయేగాక రామచంద్రునిగురించి తానెవరితోం బ్రసంగించినను దన శక్తికొలంచన లేకుండ నతండు మంచివాండు కాండని వారిమనస్సుల యందు నాటుపడునట్లుగాం జెప్పుచు వచ్చెను, శరభరాజుగారును. కృష్ణవేణమ్మయు రామచంద్రుని దమ కుమారునితో సమానముగాం జూచుకొనుచున్నను వేంకటరత్నము తన యెడం జూపుచున్న యసహ్యతవలన రామచంద్రునకు మన స్తిమితము లేకపోయెనుగావి సద్గుణ సంపన్నుం డగుటచే రామచంద్రుండు శరభరాజుగారితో నైనను. లేక తన ప్రాణసమానముగాం జూచుకొనుచున్న రాజగోపాల ముతో నైనను. నీసంగతి జెప్పండయ్యె.

రామచంద్రునకుం దనయిల్లు వెడలిన తర్వాత పూర్వము తన కిష్టము లేని వస్తువులెల్ల నిప్పు డిష్టమయ్యెను. అతం డమలాపుర మునం చదువుకొనుచున్న కొలంది విశ్వనాథశాస్త్రిలవారికి వాత్సల్య మును, సహాధ్యాయులకు గౌరవమును, శరభరాజుగారికిం బ్రేమయు, రాజగోపాలమునకు మైత్రియు, గ్రామస్థులకు మంచి యభిప్రాయము

గలుగఁ జొచ్చెను గాని వేంకటరత్నమునకు మాత్రము ప్రేమాదులు వచ్చి యసహ్యత హెచ్చనారంభించెను.

ఇప్పటికి రామచంద్రుఁడు శరభరాజుగారి యింటికి వచ్చి పదిమాసములయ్యెను. అమలాపురమునందు కొబ్బరివేళ్ల నీళ్లు పడక దేహమందు రామచంద్రునకుఁ గొంచె మప్పుడప్పు డజీర్ణముగాను, ననారోగ్యముగాను నుండుచువచ్చెను. ఆ సంవత్సరమునందు జ్యేష్ఠ మాసమున నతనికిఁ దీవ్రమైన జ్వరము వచ్చినది. జ్వరము తగులగానే శరభరాజుగారు దమదగ్గఱనున్న శీతాంశురసముమాత్రల నిచ్చిరి. విశ్వనాథశాస్త్రులవారు గొంచెము జలము మాత్రము మంత్రించి త్రాగుమని యిచ్చిరి. అంతలోనే యెక్కడనుండియో రెండుపొట్లములు దెచ్చి రాజగోపాలము తేనెతోఁ గలిపి దగ్గఱనుండి మ్రింగించెను. కాని వెంటనే గుణము కనఁబడ నందున సాయంకాల మతఁడు కషాయము నిప్పించెను. శరభరాజుగారి తల్లియొక్క పూఁట కంటిలో మిరియములకలికము వేసెను.

ఎన్నిచేసినను రోగ మెక్కువేకాని తక్కువకానందున శరభ రాజుగారుదమయింటివైద్యుడు గ్రామమందు లేఁడని తెలిసికొని, పూర్వమున వృత్తి యేదియు దొరకక వైద్యమారంభించి యనేక జనుల కకాలమరణపూర్వకముగ స్వర్గలోక సుఖముఁ గలుగఁజేసి ప్రాణము విసిగివైద్యము చాలించి నంచిమూలఁబడవైచిన యొక ముసలివైద్యు బిలిపించి కుఱ్ఱవానినిజూపి చేయి చూడుమని చెప్పిరి. అంతట వైద్యుఁడిట్లు పలికెను.

వైద్యు : చేయి చూడనక్కరలేదు. లంకణముల గట్టుడి ; ఎన్ని లంకణములు గట్టిననంత మంచిది.

రామ : అయ్యా : చిన్నతనమునుండియు నాకు లంకణములు పడవు. అన్నము దినవలయును.

వైద్యు : ఎందుకు పడవు ? తమ్మవిరోగములుఁ దియ్యని మందులు నరిపడఁగలవా ? ఉండలేకపోతే జాడ్యములొఁగునా ? కన్నులు మూసికొని పరుండు.

శర : అయ్యో ! ఎన్నిలంకణములు పడవచ్చును ?

వైద్యు : ఇది పురాణజ్వరము. శరీరమున జీర్ణించెను. పది లంకణముల మీఁదిమాట.

రామ : అయ్యయ్యో ! నే నుండలేనండి శరభరాజుగారు ! నాతత్వమున కది సరిపడదు.

శర : పథ్యము త్వరగానె పెట్టింతునులే నాయనా ! (యని వైద్యునితో) అయ్యో ! ఏమిమందు వేయఁదలంచుకొన్నారు ? ఆనంద భైరవి వేయవచ్చునా ?

వైద్యు : ఆనందభైరవి యేమిపనిఁ జేయఁగలదు ? ఇది భయవ జాతి జ్వరము. రాకడవేళగా నున్నది.

శర : ఏదో యొకటి వేయించండి.

అని చెప్పఁగానే వైద్యుఁ డొకమాత్ర నిచ్చి వెళ్లిపోయెను. జ్వరము కొద్దిదైనను నది యెక్కువ జ్వరమని చెప్పి యెక్కువ ధనము గ్రహింపవలెనని దురుద్దేశము గలిగి రోగ మెక్కువగుటకు వైద్యుఁడు మందిచ్చెను. తరువాత దాను లొంగదీయవలె ననుకొన్నను, రోగము త్వరగా లొంగలేదు. ఉష్ణము నిశ్శేషముగాఁ దగ్గినను లంకణము లింకను గట్టించి వైద్యుఁడు పథ్యము బెట్టించుట మానిపించెను. ఆ మహావీర రసముచేత నొకనాఁ డర్ధరాత్రి రామచంద్రునకు నిస్త్రాణవచ్చి నోటిదాక కాలుసేతులు చల్లబడెను.

ఆ సంగతి నెఱుగక యీ గుణములు నురొకవిధముగా భావించి వేంకటరత్నము శరభరాజుగారి చెవిలో మెల్లగా "రామచంద్రుని పవి బొత్తుగా నపస్మారముగా నున్నది. మనకు దక్కఁడని తోఁచుచున్నది" అని చెప్పెను. ఆ మాట వినఁగానే శరభరాజుగారు దదరిఁడి లేచిరి. ఇంట నందఱుఁ దొట్రుపాటుతో లేచిరి. వేంకటరత్నము వాకలి వానిచేత వీధిలో గోడదగ్గర రెండువెదుళ్ళు పాతించి రెండువెదు ళ్లడ్డము వేయించి నాలుగుచాప లడ్డము గట్టించెను. శరభరాజుగారి

తల్లి చప్పుచప్పున రెండుచేదల నీళ్ళు మీద బోసుకొని తడిగుడ్డల నటకమీదకెక్కి యూరుగాయకుండల దింపుచుండెను.

శరభరాజుగారు వైద్యులకొఱకు వర్తమానమంపిరి. కాని జరుగుచున్న సంగతియంతయు విని వైద్యుడు తన యౌషధ ప్రభావముఁ దానెఱుఁగును కనుక మరణమేకాని మఱొకటి జరుగదని నిశ్చయించుకొని రాక, తుదకు వర్తమానము లెక్కువకాగా శరభరాజుగారికి కోపమువచ్చునని యప్పటికివచ్చి చూచి "చేతిలో జాలజబ్బుగా నున్నది. ఇది విషమజాతి. నెగ్గదని నేను మొదటనే యనుకున్నాను. మందులియ్యగలము గాని యాయుర్దాయము పోయఁగలమా" యని చెప్పి యొకచోట గుమిగా గూడికొనియున్న రాజగోపాల శరభరాజ వేంకటరత్నముగార్ల దగ్గఱ కూర్చుండెను. అప్పుడు శరభరాజుగారి తల్లి యన్నపూర్ణమ్మ వచ్చి యిట్లు పలికెను.

అన్న : ఏలాగున్నదిరా నాయనా ?

వేంక : ఏమిచెప్పను ? ఘడియలమీఁద నున్నది. ఇప్పుడో యింకనో.

అన్న : అమంచము దీసి వీథిలోఁ బారవేయండిరా ? యింకా యింట్లోయెందుకు ?

శర : తొందర యేమిటమ్మా ? ఇకఁ గొంచెము సేపుండు.

అన్న : కొంచెము సేపేమిటి ? ప్రాణము గుటగుటలాడు చున్నది.

శర : నా కాపిల్లఁజూడఁ గడుపులో జాలిగానున్నది. అవతలఁ బెట్టింపలేను.

అన్న : సామానంతా తగులఁబడిపోతుంది. ఎక్కడో దిక్కుమాలిన ముండాకొడుకుకోసరము నిక్షేపమువంటి యిల్లు తగులబెట్టుట కాలోచిస్తావేమి ? చెప్పినమాట వినరు. ఏగంగలో దిగేదమ్మా ! మాయ సంతవచ్చినది. ఈ నిర్భాగ్యపుఁ జచ్చినవాఁడు యింటికోసరమే దాపరించినాఁడు.

రాజ : తిట్టకమ్మా యేమియులేదు. ముందుగాఁ జావుమాట లెందుకు ?

అన్న ; చావక యీ వెధవ బ్రతుకుతాడు ? మీరు కూఁడా వానితోఁ గట్టగట్టుకొని గంగలోదిగండి. ఒకయేడు పేడిచి నోరు మూసుకొని యూరుకుంటాము.

వేంక : అన్నయ్యా! ఇవాళ త్రిపాద నక్షత్రమఁట. ఇల్లాలు మాసములు వదలిపెట్టవలెను. పశువులసాలలోనైనఁ బెట్టించండి. పోవునప్పు డెక్కడయిన నొక్కటే.

వైద్య ! ఆయుర్దాయ మున్నపక్షమునఁ జంపినను జావఁడు. వెనుక నాకొక పర్యాయ మీలాగే ప్రాణముమీఁదికి వచ్చినపుడు మా వారందఱు నన్ను గ్రిందఁ బడవేసికొని కూర్చున్నారు. అంతట నాప్రాణము పోయినది. నలుగురు యమదూతలు నల్లలాగులు దొడుగుకొని రోకళ్ళతో వచ్చి నన్నుఁ దీసికొని మాలకాకివలె నల్లనిదేహము గలిగి యొక పింహాసనముమీఁది గూర్చున్న యొకరాజున కెదుటఁ నిలువబెట్టిరి. అతఁడు యమధర్మరాజు. నరకములోబడి యేడ్చువారి కేకలను విన్నాను, అప్పుడు యముఁడు నన్నుజూచి దూతలతో 'ఓరీ మూర్ఖులారా ! మీరొకనిఁ దీసికొని రమ్మని పంపిన వీనిని దీసికొని వచ్చినా రేమీ ?' యనిచెప్పి నన్ను క్రిందికిఁ బడఁద్రోసెను. అప్పుడు మావాండ్రు నాశరీరము దీసికొనివెళ్ళుటకు సిద్ధముగా నుండగానే నేబ్రతికినాను. ఏమో యలాగున వీతఁడును బ్రతికిన బ్రతకవచ్చును.

రాజ : ఏమి వింతలండీ! ఎవరయిన నమ్మవద్దా ?

వేంక : ఆశ్చర్య మేమున్నది ? ఈపిల్లవాఁడు బ్రతుకడండి. రాత్రి నాకలలో యమదూతలు జట్టిలాగులు దొడుగుకొని దుడ్డుకఱ్ఱలతో వచ్చి గుమ్మములో నిలుచుండి యెవరినో రమ్మని పిలుచుచున్నారు. దూతదర్శనమైన నింక బ్రతుకుట యబద్ధము. నే ననేక పర్యాయములు చూచినాను.

అని చెప్పినంతలోన విశ్వనాథశాస్త్రులవా రీకలవరపాటం

తయు నివి లేచి రామచంద్రునకుఁ దటస్థమయిన యామహావిపత్తుకు విచారించి శరభరాజుగారితో నిట్లని చెప్పెను.

విశ్వ : అయ్యా! రామచంద్రుఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. ఆతని కీలాగున కాలము తప్పవచ్చినది. ఇన్నాళ్ళనుండియు మీరే తండ్రివలె సంరక్షణఁ జేయుచున్నారు. అతఁడు పిల్లవాడయినను యోగ్యుఁడు. అవతలఁ బెట్టించుట భావ్యము గాదు.

వేంక : ఏమిటయ్యా! అంతజాలిగా నున్నపక్షమున మీయింటఁ బెట్టుకొండి. శ్రీరంగనీతు లెన్నియైనను జెప్పవచ్చును. మీయిల్లు కాకపోయిన సరి.

అని పలుకుచున్న సమయమునందు శరభరాజుగారి తల్లి వచ్చి వేంకటరత్నమును బిలిచి యతఁడును దానును దోఁడుపట్టి రామచంద్రునిమంచము పశువుల పాకలోఁబెట్టి మిక్కిలి పరిశుద్ధమయిన వాయువుగల శుభ్రమయినచోట నుండవలసినరోగిని దీసికొనిపోయి, చుట్టును రొచ్చును దోమలు మొదలగు కీటకముల ధ్వనులును, గడుపులోఁ బ్రేగులు తెగునట్లు వమనము గలుగఁజేయు పేడకంపునుగల యాపాకలోఁ బెట్టుచుండగా శరభరాజుగారు చూచియు స్త్రీలమాట కడ్డము చెప్పలేక, స్నేహితునికొఱకు విచారించుచున్న రాజగోపాలము నూరడించుచు విశ్వనాథశాస్త్రులవారితో మాటలాడుచుండిరి.

తరువాతఁ గృష్ణవేణమ్మ రామచంద్రుని యొద్దకుబోయి యాతని స్థితిని జూచి విచారించి యాతనిసంగతిబట్టి యవి విస్ఫోటిక లక్షణలములుగాని మరణచిహ్నములు గావని గ్రహించి, కొంచెము చిట్టుడుకు నీళ్ళు పోసినచో నది కుదురుననుకొని తన యభిప్రాయమును శరభరాజుగారితోఁ జెప్పెను. ఆయన దాని కిష్టపడఁగాఁ దరువాతఁ జిట్టుడుకు నీళ్ళు గిద్దెడు రామచంద్రున కామె లోపలఁ బోసెను. అవిత్రాగిన నాలుగుగడియలకు రామచంద్రుఁడు కొంచెము తెల్విదెచ్చుకొని యొత్తిగిల్లి పండుకొనెను. తక్కినరాత్రియంతయు రామచంద్రునియొద్ద రాజగోపాలము పరుండవలె ననుకొని యది తండ్రితో జెప్పుచుండగా విని ముసలమ్మ యిట్లని చెప్పెను.

అన్న : ఓరీ! కుర్రవాఁడా! నీవక్కడ పండుకోకు. అనక జడుసుకొన్న పక్షమున దేవుళ్ళాడలేము. నీవు సావిట్లో పరుండు.

రాజ: అక్కడ పరున్నమాత్రముననే జడిసికొందునా! అంత భయములేదు.

అన్న : చెప్పినమాట వినవేమిరా? వాఁడెవరు? నీ వెవరవు? నీయమ్మ వంకచుట్టమా? అబ్బ వంకచుట్టమా?

రాజ: నీవు వేయి చెప్పినను నేను వినను. నే నిక్కడనే పండుకొనెదను.

అని రాజగోపాలము చెప్పిన మాటలకు మనసులో సణుగు కొనుచు నామె వెళ్ళెను. ఆ మిగిలిన రాత్రియంతయు వేంకటరత్న మును రాజగోపాలమును రామచంద్రుని యొద్ద పడుపులపాకలోఁ బరుండిరి. కాని దుర్వాసనచేతఁ గొంతసేపటికి రాజగోపాల మావ లకు వెళ్ళెను.

అదివఱకు రామచంద్రుఁడు జబ్బుపడకమునుపు రాజగోపా లముయొక్క యుంగరము దన వ్రేలను బెట్టుకొనెను, అది తీయక ముందే రోగపీడితుఁడగుటచే నా యుంగర మతని చేతనే యుండెను. రామచంద్రుఁడు గొంచెము కనుమూసి నీరసముచేఁ బరున్నప్పుడు పంగనామములఁ బెట్టుకొన్న యొక బ్రాహ్మణుఁ డాయుంగరమును మెల్ల మెల్లగా లాగుచుండెను. రామచంద్రుఁ డులికిపడి లేచి నీర సముచేత మాట తిన్నగా రానందున నక్షరములు స్పష్టముగాఁ దెలియ కున్నను, హీనస్వరముతో నొక కేకవేసెను. పంచప్రాణములు స్నేహితునిమీదనే పెట్టుకొని యున్న గోపాల మామాటలు విని పరుగెత్తుకొని వచ్చి యేమని రామచంద్రు నడుగగా నతఁ డేదో గోపాలముయొక్క చెవిలోఁ జెప్పెను.

ఆమాట నాలకించి గోపాలము మహాకోపముతో "ఏమయ్యా! వేంకటరత్నము! ఆతనిచేతి యుంగరము నీ వెందుకు లాగినావు?" అని యడిగెను.

వేంక : ఏమిటయ్యా! జబ్బుచేత సంధించి చావునకు సిద్ధముగానున్న వాని మాటలు నమ్మి నవ్వులాగుననే ననఁదగిన మాట యన రానిమాట తెలియకుండ నిందించెదవా? అతఁడు చెప్పను నీవు నమ్మ నునా? బాగున్నది ఎంత మాట?

రాజ : పంగనామములఁ బెట్టుకొన్న మనుష్యుఁడు లాగినాఁడట, నీవుగాక యింకెవ్వరు?

వేంక : ఆ! ఈమాట బాగున్నది. కనుఁ మూసికొని మత్తుగా నతఁడు పడున్నప్పుడేమో యతనికి వేంకటేశ్వర్లు వచ్చి ప్రత్యక్షమై యుంగరము లాగినట్లు భ్రమ కలిగినది. వేంకటేశ్వర్లు నిలువుబొట్టు దైవమేకావా. ఈతనికేదో మ్రొక్కున్నది. త్వరగా నా యుంగరము మీదుకట్టు. ఇది వేంకటాచలపతి మాహాత్మ్యమే.

రాజగోపాల మామాట నమ్మి వేంకటరత్నమునందు నిందారోపణ చేసినందులకు నొచ్చుకొనుచు, రాత్రియంతయు గడపెను కాని, యా పనిఁ జేసినవాఁడు మన వేంకటరత్నమే తప్ప మరొకరుకారు. గోపాల ముంగరమును మీదుకట్టి జ్యోతిష్కులు వచ్చినపుడెల్ల రామచంద్రుని నక్షత్రమును జెప్పి యాతనికి దినముల యందు మరణమున్నదేమో యని యడుగుచు, నిది నీచ మిది ఘనమని యెంచక సమస్తవిధములైన యుపచారములను జేయుచుండెను. ఆహాహా! స్నేహామెట్టిదో యోచింపుడు.

ఇది జరిగిన నాలుగుదినములకు రామచంద్రుని పినతండ్రి మమలాపురమున కేదో పనిమీఁద వచ్చి వేంకటరత్నముతో మాటలాడుచుఁ తనఁ దన యన్నకుమారుఁడు శరభరాజుగారి యింటనున్నాఁడనియు, ప్రాణముమీఁదికి వచ్చినదనియు విని యిట్లనియెను. "వేంకటరత్నముగారూ! వాడు మా యన్నకొడుకని చెప్పకొనుటకు సిగ్గుగానున్నది. నియోగుల యింట బుట్టి సాటివారి యింటఁ బొట్టకూటికుండి మా కవమానము దెచ్చినాడు. వీఁడు పుట్టకబోయినను బ్రతికిపోదుము" అని చెప్పి వెళ్ళిపోవుచుండగా వేంకటరత్న మతడుఁగూ

రామచంద్రుని ప్రవర్తనాదులలో దన యభిప్రాయముతో నేకీభవించి నందులకు సంతపించుచు "మీ పిల్లవానికి జబ్బుగానున్నది. చూచి పొండి" యని చెప్పెను. జగన్నాథముగా రామాట విని, 'వానికేమి భయములేదు, వాడు మనవంటివారి నెందఱినో కడతేర్చికాని పోడు' అని చెప్పి పశువులసాలలోనికిఁ బోయి రామచంద్రుడు కన్నులనుండి గుఱిసిన నీళ్లు తిరుగ, మాటరాక, పక్కమీద బినతండ్రిని కూర్చుండ మని సంజ్ఞజేసి యతఁడు కూర్చున్న పిమ్మట నాతని మెడమీదజేతుల వేసికొని కౌగిలించుకొని యిట్లనియెను.

రామ: బాబూ! వచ్చినావా? నిన్నుజూడగనే మా బాబ య్యను. మా యమ్మను జూచినట్లు పంచప్రాణములు లేచివచ్చినవి. నాకు రోగము కుదిరినదాక నాలుగుదినములు నీ విక్కడనుండు. నిన్ను జూడగనే నా రోగము సగము కుదిరినది.

అని చెప్పిన రామచంద్రుని మాటలతని ఱాతిగుండెను భేదింప లేకున్నను సమీపమున నున్నవారఁదఱికి జాలి బుట్టించెను. అంతట జగన్నాథ మిట్లు చెప్పెను.

జగ: నాకుండుటకు దీరుబడిలేదు. ఇంకొకమారు వచ్చి యుండెదను. నీకు వారే తల్లి దండ్రి. నేను బోవుచున్నాను"

అని చెప్పి వెళ్లిపోయెను.

రోగము కొంచెము తిరుగమొగమునకు రాగాఁనే శరభరాజు గారు రామచంద్రుని మంచమును లోపల బెట్టించిరి. రామచంద్రు డకుఁ గ్రమక్రమముగా నన్నియు హితమై నల్లనిరక్తము పట్టి బలము చేర నారంభించెను. అతఁడు పూర్ణ దార్ఢ్యవంతుఁ డగునప్పటికి రెండుమాసము లయ్యెను.

ఆరోగ్యస్నానముఁ జేసిన తరువాత రామచంద్రుఁడు యథా పకారముగాఁ బాఠశాలకుబోయి చదువుకొన నారంభించెను. ఇప్ప టికి లక్ష్మీసహస్రమును, నైషధము ముగించి యలంకార శాస్త్రము దవఁదలంచి కువలయానంద మారంభించెను. కావ్యములయందే

గాక వేదములందుఁ గూడఁ బరిశ్రమ చేయదలంచి విశ్వనాథ శాస్త్రుల వారు చతుర్వేద వేత్తలుగనుక రామచంద్రుఁ డాయన దగ్గర నమక చమకము లారంభించెను. ఈ సంగతి వేంకటరత్నమునకు దెలిసి యొకనాఁడు ప్రసంగవశమున నతఁ డీ ప్రకారముగా మాటలాడ నారంభించెను.

వేంక : ఏమోయి! నీవుకూడ నమకచమకములు చెప్పుకొను చున్నావాయేమి ?

రామ : ఆ ! మొన్న విదియనాఁ డారంభము చేసినాను

వేంక : సరిసరి, బాగుగాఁ జేసినావు. కొంచెము పెద్దవాండ్ర మున్నాముగదా! మాతో నాలోచనఁ జేయఁగూడదా? మనకేమిటి, వేదమేమిటి? అది బ్రాహ్మణులకుఁ జెల్లినది. మన నియోగులకుఁ దగదు.

రామ : నియోగులుమాత్రము బ్రాహ్మణులుగారా ! మనము వేదములు చదువుకొనఁగూడ దనియెక్కడ మున్నది? అందఱము బ్రాహ్మణులమే.

వేంక : నీకు దెలియును దెలియదు. ఒకరుచెప్పిన వినను వినవు. పొత్తరలుబట్టి సంభావనకు వెళ్లువారు బ్రాహ్మణులు. మనము కరణాలము, బ్రాహ్మణుల మగుదుమా? కుఱ్ఱవాఁడవు. నీ విటువంటి తెలివితక్కువమాట లాడబోకు. మనవాండ్రు విన్న తప్పు పట్టుకొందురు.

రామ : నియోగులకు వైదికులకు వేదోక్తకర్మ సమానమే కదా! ఆచారభేదములేకాని శాస్త్రభేద మేమున్నది?

వేంక : మీసములను పెంచుకొని లౌకిక వ్యవహారములు చేయుచు వ్రాఁత కోఁతలు చేతనైనవారు నియోగులు. మన క్షేమి మహారాజులము. మన యిండ్లలోఁ బురోహితులుగానుండి ప్రొద్దున్న స్నానముచేసి బిళ్ళగోచులను బెట్టుకొనవలసిన వాండ్రును, నిత్య కర్మలు చేయవలసిన వాండ్రును బ్రాహ్మణులు. వారి మంత్రములు

మనము నేర్చుకొనఁగూడదు. ఇంతేగాక నియోగులకు స్వరము రాదు. అపస్వరము నెత్తి పఱచును.

రామ : వైదికు లనియా బ్రాహ్మణుల కర్థము ? వేదమును జదువుకొన్నమాత్రమున మన నియోగమునకు భంగము లేదు. మీసము లెవ్వరును బెంచఁగూడదు. మనము పెంచవచ్చునని ధర్మశాస్త్రములో లేదు.

వేంక : నీదగ్గర నే నీసంగతిఁ జెప్పినపక్షమున నీవు నమ్మవు. నీకు మనవాళ్ల సంప్రదాయములు దెలియవు. మఱియెవరినైన నడుగు. తద్దినపుమంత్రము చదువుకొనవలెనని దిక్కుమాలిన బుద్ధిపుట్టిన దేమి ? ఇంక దేవతార్చనమంత్రములుకూడ నేర్చుకో. మన చేతి క్రింద బ్రతుకు వైదికులకును, మనకు సహపత్యమా ? నీయిష్టము : వింటే విను ; లేకపోయిన మాను. నీ క్షేమముకొఱకే చెప్పినాను.

అని బ్రాహ్మణుల కర్థము వేదాదివిద్యాభ్యాసముచేయువార నియు, నియోగులను బ్రాహ్మణు లనఁగూడదనియు, మూర్ఖమైన యభిప్రాయముతో నున్న వేంకటరత్నముయొక్క మనసునకు వాద మూలమున యథార్థస్థితిఁ దెలుపవలెనని రామచంద్రుఁడు ప్రయత్నము చేసినాఁడుగాని, బుద్ధిహీనులలోఁ జక్రవర్తియగు వేంకటరత్నము ముందట నితనివాదము పనికిరాదయ్యెను. ఇప్పటికిని ననేక నియోగులు తమ్మెవ్వరైన బ్రాహ్మణు లన్నప్పుడు, కరణములని యందునకుఁ గోపించి యది నిందాస్పద మనియెంచి, వారితోఁ గయ్యము నకు డీకొందురు. అంతేకాక యాచారసంపత్తిలేని నియోగుల విషయమై మాటలాడుచు వైదికులు "వారి కేమి ? నియోగప్రభువులు. ఈ మంత్రములువారి కెందుకు ?" అని చెప్పుచుందురు.

సాహిత్యమునకుఁ దోడు సంగీతమును, దానికిదోడు వేదమును రామచంద్రుఁడు నేర్చుకొనుచుండెను.

ఇట్లుండ గొవ్వాళ్ళకు శరభరాజుగారి రెండవ కుమారుఁడగు నరసింహమునకు నక్షరాభ్యాసముజేసి చదువవేసిరి. ఆ దినము గ్రామములో నందఱిని భోజనమునకుఁ బిలిపించిరి. నాఁడు వేంకట

కూర్చుండగానే కొందరు బాలురు వీపులమీద జిదరలు వేసికొని, కర్రపలకలను, జొన్నకలములను, దాటియాకు పుస్తకములను, గంటములను బట్టుకొని కొందరు గోణములనుదట్టుకొనియు, కొందరు లాగులఁ దొడుగుకొనియు, గొంగడు మీద రుమాళ్ళు వేసికొనియు, బడికివచ్చి చదరల క్రిందబఱుచుకొని కూర్చుండిరి. ఏడెనిమిది చింతబరికెలను రెండు ప్రక్కల బెట్టుకొని యొక నున్నని బొబ్బిలి పొడుముకాయ నెడమచేత నుంచుకొని వార్ధకదశచేత రక్తమాంస హీనమగు తన శరీర మెముకల ప్రోగువలె జూచినవారికి భయము గలుగఁ జేయుచుండఁ గేక నేదైన విన్నపు డులికిబడి లేచుచుఁ బంతు లొక స్తంభమునకుఁ జేరగిలఁబడి యొక చిరుగుగోనె గుడ్డమీఁదఁ గూర్చుండి కునికిపాట్లు పడుచుండెను. కొందఱు నేలమీఁదఁ ద్రవ్విన గుంట యోనమాలను దిద్దుచుండిరి. పంతులు బాలరామాయణము నందొక శ్లోకమును జెప్పగా నది బాలురకు నోటబట్ట నందున మహా కోపము వచ్చి యతఁడు శ్లోకములోనున్న యక్షరమున కొకదెబ్బ చొప్పునఁ గొట్టి పిల్లలవీపుమీఁదఁ జింతాకంత యెడమైనను లేకుండ దెబ్బలతో నింపి దానితోఁ దృప్తినొందక కొందఱిని గోడకుర్చీలు వేయించి మఱికొందఱ తాటవిడుపు డబ్బులఁ దేనందున మొట్టికాయ లతోడను, జెంపకాయలతోడను, తొడపాశములతోడను, వారిని జేతనైనంత శిక్షచేసి చెయ్యి నొప్పిపెట్టిన తరువాత నెండలో నిలువఁ బెట్టి కొంతసేపు కొందఱిని నూరు గుంజీలు దీయించి విసిగి యూరకుండెను,

ఇంతలో నొకపెద్దధ్వని వారందరకు వినబడెను, అప్పుడు నలుగురు పిల్లలొకపిల్లవానిని గాళ్ళిద్దఱును జేతులిద్దరును బట్టి తీసి కొని వచ్చుచుండిరి. ఆ బాలుడు కాళ్ళతోఁదన్నుచుఁ, జేతులకందిన వారిని రక్కుచు, నోటికి దొరికిన వానిని గఱచుచు, మధ్య మధ్య "అమ్మో! నాయనో! చచ్చినానురో, వద్దురో" యని యెలుఁగెత్తి ఏడ్చుచుఁ దండములపెట్టుచుఁ జూచినవారి కందరకును మహావిస్మయ మును గలిగించుచుండెను. ఆతఁడు బడికిరానందున బంతులవారు పిన పిల్లలతని మోపికొని వచ్చుచుండిరి. గ్రామదేవతగుడికి

దీసికొనిపోఁబడు మేకపిల్లవలెనే ఆ బాలుఁడు యమకింకరులవంటి ఆనలుగురు పిల్లలచేతఁ బంతుల వారి యెదుట నిలువఁ బెట్టబడగా నతడు కోదండము దీయించుమని యాజ్ఞాపించెను. వెంటనే యా నలువురు పిదపటకే యొక దూలమునకు వేయఁబడిన జనుపనార త్రాడు దగ్గఱ కతనిని తీసికొనిపోయి నరహత్యఁ జేసినవారిని నురి స్తంభము నెక్కించునట్లు త్రాడు బట్టుకొనునట్లుచేసి, క్రింద గంటములఁ బాతి పెట్టి త్రాటియాకుల మంటవేసి కాళ్ళు క్రిందబెట్టకుండఁ జేసిరి.

ఆ లోపున బంతులవారు బెత్తము బుచ్చుకొని చేయవలసినపని నంతను జేసి, నరసింహావతారము వలె శాంతినొందక బడిలోనున్న బాలురందఱిని బక్షపాతములేకుండ జావఁగొట్టెను.

అందులో నొకపిల్లవాడు "అయ్యా! నే నల్లరిచేయకుండ గూర్చున్నాను. నన్నెందుకు గొట్టినారండీ" యని యడుగగా బంతులు "వెధవా! ఆనక నీవుమాత్ర మల్లరిచేయవా? అప్పుడు నీకోసర మింకొక పర్యాయము పని చెఱుచుకొని యెవరు రాగలరు? అందుకని పనిలోఁబని యిప్పుడే కొట్టినాను" అని మఱల గొట్టెను. ఈ చిత్ర వధ జరుగుటచే బాలురంద రొకమా రింటిమీఁది పెంకులెగిరిపోవునట్లు గొల్లున గోలెత్తిరి. వెయ్యేల దొంగతనము మొదలయిన కౄర కృత్యములను జేయు మహాద్రోహులను గూడ జెరసాల కంపక యీ బడికి బంపిన నేరములు వారెన్నడును జేయరు. ఈ బడికి వచ్చిన తరువాత నే పిల్లవాడును బుస్తకముపట్టి యెఱుఁగడు. కనుక పంతులవారి కావిధమైన పంచలబాపెన్నడును జన్మమధ్యమున దొరకనేలేదు.

ఈవిధముగా నున్న యా పాఠశాల వైఖరియంతయుఁ జూచి రామచంద్రు డాశ్చర్యము నొందెను. నరసింహాము నోటివెంట మాటలేక నిశ్చేష్టుఁడయ్యెను. కోదండ మెక్కిన యాపిల్లవాఁడును గొంతసేపటికి దేహము దెలియక క్రిందఁబడగా చప్పున పంతులు చల్లనినీరు మొగమున కొట్టి, చెవులు మూసి, మంచితీర్థము దాహ మిచ్చి చావగొట్టి చెవులుమూసె ననుసామెతను సార్థకము చేసెను.

తల్లిదండ్రుల కీసంగతిఁ దెలియ నియ్యవద్దని పంతులవా రధికార మంతయును మాని బాలుని బ్రతిమాల నారంభించిరి. ఆ పిల్లవానిని శిక్షించునప్పటి కోపముకంటె పదిరెట్లెక్కువగా నున్న యీ ముసలి బ్రాహ్మణుని తొందర చూచితీరవలెను. చెప్పనలవిగాదు. పంతులు గారికిఁ బొగాకును, బిడ్డలకు, మజ్జిగ దాహమును దెచ్చిపెట్టు బాలు రందఱు దెబ్బలు తక్కువపడునుచు నాయన దయకుఁ బాత్రులగుదురు.

రామచంద్రుఁడు ఇంటికి వెళ్ళినతరువాత మన నరసింహము నీ పాఠశాల కంపుటవలన మనయోగములే దనిచెప్పెను. కాని శరభరాజుగారి మాటలను వినిపించుకొనలేదు. ఈ దారుణమైన శిక్షఁజూచి నరసింహము బడికి వెళ్ళవలసినప్పుడు కడుపునొప్పి వచ్చినదని చెప్పి బడిమానుచు నాలాగునఁ జేయుటకు వీలులేనప్పుడు చద్దియన్నముతిని బడికిఁబోదునని చెప్పి యెక్కడికో పోయి యీసంగతి తెలిసిన పక్షమున తమవారు గోపింతురని యింటికిరాక యున్న వస్త్రములతో యెండలపాలై తిరుగుచుఁ దల్లిదండ్రులు వెదకినవు దేవాడ్డిలోనో తోటలోనో కనఁబడుచు దన ప్రాణములకుఁ గూడ భయము కలుగునేమో యని తలిదండ్రులకుఁ గోపమనట్లు నడచు చుండెను.

ఒకానొక దినమున రామచంద్రుఁడు పంతులవారితో నిట్లు ప్రశంసించెను.

రామ—అయ్యా! పంతులుగారూ! మీరీలాగునఁ గొట్టిన పక్షమున పిల్లలు రారండి. పిల్లలమీద నింతకంటెఁ గొంచెము దయగా నుండవలెను.

పంతు—నాకంటెఁ బిల్లలమీఁద నింకా దయగా నెవ్వరుండ గలరయ్యా? నేనెప్పుడయిన గొంచెము బెత్తముతో బెదరించి యొక ముక్క చెప్పుతానుగాని గట్టిగా కొట్టను. అయినను "దండం దశగుణం భవేత్" అని శాస్త్రమున్నది. యంతకొడితే యంత మంచిది. దెబ్బ దేవేంద్రలోకము.

రామ—అంతచేటు కొట్టఁగూడదు. చక్కఁగా బోధించి పాఠములు చెప్పవలయును.

పంతు—ఏమి బోధించవలెనండి? ఉత్త బండతముండాకొడుకులు. ఎన్నిపరియాయములు చెప్పినను ముక్క రాదు. మా చిన్నతనములో మేము చదువుకొన్న సంగతులు కథలు విన్న పక్షమున మీ రేమందురో! పంతులుపేరు చెప్పిన గడగడ వణికి లోపలికి పారిపోయేవారము. నేను కొట్టేదెబ్బ లొక దెబ్బలా?

రామ—మా నరసింహ మేమయినఁ జదువుకొనుచున్నాఁడా?

పంతు—నరసింహామున కేమి! మహారాజు. అతనికి జదు వెందుకు? పిల్లవాఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. అణవిడుపు డబ్బు లెప్పటి వప్పు డిచ్చివేయును. ఎన్నఁడు నాలస్యము చేయఁడు.

రామ: అతనికి నాలుగు నెలలక్రిందట పక్షరాభ్యాసమయినది కదా. ఇప్పటి కోనమాలయిన రాలేదేమి?

పంతు: తొందర రేమిటి? చదువు రాకపోతే మిగిలిపోయిన దేమిటి? అన్నమునకు లోపమా? వస్త్రమునకు లోపమా? ఎవ్వఁడో కూడుగుడ్డలేని నిర్భాగ్యునకుఁగాని హాయిగా జరుగువానికి జదు వెందుకు!

రామ: చదు వందరికిని గావలయును. విద్యలేనివాఁ డెంత ద్రవ్యవంతుఁ డైనను గౌరవింపఁబడఁడు. విద్యవంటి ధనకొకటి లేదు.

విద్యావిహీనులగు మూర్ఖులు విద్యాభ్యాసము వలన మహోప యోగము లెఱుఁగక భాగ్యవంతులు చదువుకొన నక్కఱలేదనియు నుద్యోగముఁ జేయఁదలఁచిన వారే చదువుకొనవలె ననియుఁ జెప్పు చుందురు? ఆ బడికిఁ బోవుటవలన నరసింహామున కభివృద్ధి కనఁ బడనందున రామచంద్రుఁ డింటియొద్ద కూడఁ దగుశ్రద్ధతోఁ బాఠము లను జెప్పుచుండెను.

# ఐదవ ప్రకరణము

ఈప్రకారముగ రామచంద్రుఁడు శరభరాజుగారి జ్యేష్ఠకుమారునకు సహాధ్యాయుఁడై రెండవ కుమారునకు గురువై, యందరకును దలలో నాలుకవలె మెలఁగుచుండెను.

శరభరాజుగారి కుమార్తెయగు పార్వతి కిప్పటికి తొమ్మిదవ సంవత్సరము దాఁటి పదియవయేఁడు ప్రవేశించెను. వివాహము చేయవలయునని శరభరాజుగారు సంబంధముల నిమిత్తము వెదకుచుండిరి. కాని తగిన సంబంధము దొరకదయ్యెను. అది వఱకువచ్చిన సంబంధములలోఁ బిల్లవానికి భూస్వాస్థ్యము; ద్రవ్యసంపత్తియుఁగలిగి యున్నయెడల విద్యాగంధములేదు. విద్యగలవానికి ద్రవ్యములేదు. శరభరాజుగారి తల్లికి విద్యలేకపోయినను ద్రవ్యవంతున కీయవలెనని యున్నది. కృష్ణవేణమ్మకు విద్యాధనసంపత్తులు రెండును గలవాఁడే కావలెనని యున్నది. శరభరాజుగారి యాలోచనయు రాజగోపాలము యొక్క యాలోచనయు నీ విధముగా లేదు. ద్రవ్యవంతుఁడు గాకున్నను విద్యయు సౌందర్యమును గలవానికీయ వలెనని వారి కభిప్రాయమున్నట్లు వారప్పుడప్పుడు మాటలాడుచున్న మాటలను బట్టి కృష్ణవేణమ్మ దెలిసికొనెను. రాజగోపాలము పార్వతి కింటి వద్ద చదువు జెప్పుచుండుటచేత నానాటికిఁ బాలిక చదువను వ్రాయను నేర్చి శుక్లపక్షచంద్రునివలె వృద్ధి బొందుచున్నందున విద్యావిశారదుఁడగు వాని కిచ్చి పెండ్లిచేయుట యావశ్యకమయ్యెను.

ఇట్లుండ రామచంద్రు డొకనాఁడు రాజగోపాలముతోఁ గూడ సాయంకాలమున దేవాలయమునుండి యింటికి వచ్చుచుండగా నొక బ్రాహ్మణుఁడు కనబడి రామచంద్రుని జూచి 'నాయనా: రామచంద్రుడవు నీవేనా?' అని యడిగెను.

రామ: అవును నేనే ఏమండీ! మీ దేయూరు!

బ్రాహ్మ: మాది రాజవోలు. మీ రింక ఎక్కడనేయున్నారా?

రామ: (భయముతో) ఆలా గనుచున్నా రేమి? రాజవోలులో మామామయ్య పిల్లలు బాగున్నారా?

బ్రాహ్మ: ఇంకను నీకుఁ దెలియదా? మీమేనమామగారు మొన్నరాత్రి తెల్లవారు జామున లోకాంతరగతు లయినారు. ఆదుఃఖము బట్టజాలక మీమేనత్తకూడ నూతిలో దిగినది కాని వెంటనే దగ్గఱ నున్నవారు దిగి యామెను దీసినారు. ఆకస్మిక మరణమగుటచేత నెక్కడ నేమి యాస్తియున్నదో చెప్పలేదు. మరిదీజాడ్యము వచ్చి పోయెను.

రాజ: అయ్యో! మేనమామగారే. మొన్న మధ్యాహ్నము రాజవోలునుండి వచ్చినరాజు మీమామను జూచి వచ్చినానని చెప్ప లేదఁటోయి రామచంద్రుఁడు!

బ్రాహ్మ: రాత్రిపాముగఱచి చచ్చిపోయినాఁడు. అన్నట్లు మఱచిపోయినాను. మరిదీజాడ్యము వచ్చినదఁదో.

రామచంద్రుఁ డామాట వినగానే నేలఁ జదికిలఁబడి మాట రాక చెప్పరాని దుఃఖముతో వాపోవుచుండెను.

రాజ: మీపే రేమండీ? మీ కాపురము రాజవోలేనా?

బ్రాహ్మ: నాపేరు! కర్రా రామయ్య. అందులో మీ కను మాన మెందుకు? మాది రాజవోలే కాపురము. నేను దహనమైన దాఁక దగ్గఱనుండి వచ్చినాను. నేను ముక్తేశ్వర మీరాత్రి వెళ్లవలెను.

అని చెప్పి వెళ్ళిపోయెను. నడచుటకైన సత్వములేకయున్న రామచంద్రుని చేయిఁబట్టుకొని మధ్యమధ్య నూరడించుచు రాజగోపాల మింటికిఁ దీసికొనిపోయి తల్లిదండ్రుల కావార్త నెఱిఁగించెను. వారందఱుఁగూడ రామచంద్రుని స్థితికి విచారించిరి. రామచంద్రుఁడు పావడిమీఁదఁ బొరగిలఁ బండుకొని కంటికి నేలకు నేకధారగా నేడ్చుచు

మధ్యమధ్య మేనమామగుణములను రాజగోపాలమునకు. శరభరాజు గారికి నీప్రకారముగాఁ జెప్పుచువచ్చెను.

"అయ్యా! నాచిన్నతనమునందే మాతండ్రి చనిపోయెను. ఆయన పోయినతరువాత మాపినతండ్రి నాయావదాస్తిఁ దన స్వాధీనము జేసికొని యింటికిఁ దాళమువేసి మాతల్లిని నన్ను లేవఁగొట్టెను. అప్పటినుండియు మామేనమామ తనకుమారునివలెనే నన్నాదరించుచు నాతల్లిని నన్ను సంరక్షించెను. ఆయనవే నడిగినదెల్లనిచ్చి మాతండ్రి పోయిన లోపము లేకుండఁజేసెను. మాతల్లి యింతలోఁ జనిపోయినది. మంచివాఁడగుటచే మామామకు ఋణముకూడ హెచ్చినందున నాయనను భారముకలుగఁ జేయఁగూడదనినే నిట్లు వచ్చినాను. నాకర్మమెప్పుడు నీలాగుననేయున్నది. తల్లిదండ్రిని జిన్నతనమునందే దిగమ్రింగినందుకు, నా క్షేమముగోరు బంధువుఁడు మా మేనమామ యొక్కడే యనుకున్నాను. అతనికి నాకుఁగూడ ఋణము నేఁటితోఁ దీరిపోయినది.

అని చెప్పి యేడ్చుచుండగా, శరభరాజుగారు రామచంద్రునితో "నాయనా: నీవిప్పుడు రాజవోలు వెళ్ళవలెనా? అలాగైన పక్షమున రేపుదయమున మనుష్యుని సహాయమిచ్చి పంపుతాను; వెళ్ళవచ్చును" అని చెప్పగానే రామచంద్రుఁడు వెళ్ళుట కిష్టపడెను.

ఇంతలో వేంకటరత్నము వచ్చి సంగతి యంతయు విని మైలవాఁడవు చావడిలోఁ గూర్చున్నావేమని యతనిని గూకలు వేసి యావల గూర్చుండఁబెట్టెను. అప్పుడు శరభరాజుగారి తల్లి మైలవార్త వినగానే స్నానము జేయవలెను గనుక రెండు బిందెలు చల్లని నీరుదెచ్చి దుఃఖభారముచేత శరీరమెఱుగక యున్న రామచంద్రునిమీద బోసి స్నానముచేయించెను. భోజనము జేయుమని యింటనున్న వారందఱు బలవంతపెట్టినందున పక్షిణిగనుక వాకిట విస్తరి వేయించుకొని కొంచె మెంగిలిపడి యతఁడు లేచిపోయెను.

తెల్లవారినదాఁకఁ గంటిమీదఁ నొక్కమాఱయినను గునుకులేక విలపించుచు రామచంద్రుఁడు కోడికూయఁగానే రాజగోపాలమును లేపి

తనకు మనుష్యుఁ డక్కఱలేదనియు దాను మార్గమంతయు నెఱుఁగుదు నవియుఁ జెప్పి యతనియొద్ద కొంచెము లెక్కపుచ్చుకొని దొడ్డవరము వెళ్ళి మధ్యాహ్న మక్కడ భోజనముచేసి కొంచెము చల్లబడిన తరువాత గోదావరిని దాటుటకు వెళ్ళెను.

అప్పుడు గోదావరి జ్యేష్ఠమాసమగుటచే విస్తారభాగ మెండిపోయి తాను ధవళేశ్వరము దగ్గఱ నీప్రకారముగనే పాయ లయితినని తెలియజేయుటకో యనునట్లు చిన్న చిన్న చీలిక లయ్యెను. కాలము మారిపోయినప్పుడు గొప్పవానికైన దిప్పలు గలుగుట సత్యమని తెలుపుటకుఁ గాబోలు నడుమ నిసుకతిప్పలు గలవు. ఈ పాయ లన్నిటి యందును జివరిపాయ మిక్కిలి వెడల్పుగలదై యున్నది. కాని తక్కిన వన్నియు బేరునకు మాత్రము నీరుగల్గి మనుష్యులు చులకనగా నడిచిపోవుటకుఁ బాటిరేవులు పడియుండెను. మెత్తని మనస్సుగల వారి నేమన్నను నీప్రకారముగనే నాటునని తెలియజేయుటకో యనునట్లడుగులు వేయగానే దించుకొనిపోవుచున్న యసుకతిప్పలనుండి మూటలు దలమీఁదఁ బెట్టుకొని పాటిరేవుల దాటి చివరపాయ దాఁటవలెనని రేవుపడవ నెక్కుట కనేక మార్గస్థులు బోవుచుండిరి.

వారితోఁ గూడ రామచంద్రుఁడు పోవుచుఁ బూర్వకాలము నందు వఱదలువచ్చి యిద్దరద్దరులకు నీరు దాపినపుడు దేరిచూడ నైన జాలని బాలకులు గూడ నేడు సునాయాసముగ దాటుచున్న యా మహానదియొక్క శుష్కస్థితిని జూచి తన తండ్రిగారు సజీవులగునపుడు దన్నతిగౌరవముతో నాదరించినవారును, తనతో మాటలాడుట కర్హమైనవారును నేఁడు తన్నవమానపరచుచున్నందునఁ దన దీనావస్థ జ్ఞాపకము వచ్చి కొంచెము విచారించి యూరకుండెను.

ఆ వచ్చిప జనులలో ముక్తేశ్వర గ్రామవాస్తవ్యుఁడగు నొక బ్రాహ్మణుఁ డుండెను. అతడు లక్షాధికారి యని చుట్టుప్రక్కలనున్న జనులందఱుఁ జెప్పిరి. కాని యతఁడు కట్టుకున్న జేవురుపంచెను మీదనున్న మాసిన చిరుఁగుల నుత్తరీయముఁ, జేతిలోనున్న పెద్ద మూటను జూచి రామచంద్రుఁడు లక్షాధికారిగ నుండఁదగిన యామహా

లోభి యొక్క సంపదకాశ్చర్యపడెను. మూట దెచ్చిపెట్టుట కాక చాకలినైన నతఁడు దెచ్చుకొనలేదు.

వారందఱు నీటియొద్దున నుండగా నింతలోఁ బడవ యద్దరి నుండి రాగాఁ బడవవాండ్రడిచల కచ్చుట గుట్టవేయఁబడియున్న చింతపండుకంట్లములను బడవ పడిచెక్కలవరకును మునుఁగునట్లు వేసిరి. పడవ పూటముకాగానే తెఱచాపఁ ద్రొక్కి పడవవాండ్రు దానిని నడపఁజొచ్చిరి. పడవ నడచినకొలఁది దానితోఁ గదలి నడచి వచ్చుచున్నట్లుగ గట్టుమీది వృక్షములును, లంకలో మేసి గోదావరియందు నీరుద్రాగుచున్న పశువులును, లంకలయందు గాఁపులు వెట్టిన పుచ్చ, దోస గుమ్మడి మొదలగు పచ్చని పాదులును, "అత్యుచ్ఛ్రయః పతనహేతు" వను నీతిని దెలియజేయుటకోయన మొదట నుత్తుంగముగా లేచి తుదకు పడిపోవుచున్న కెరటములును రామచంద్రుని దుఃఖమును గొంత పోఁగొట్టెను.

తప్పత్రాగి స్మారకముఁ దెలియ కుండనున్న యా ముగ్గురు పడవవాండ్రలో నొకఁడు గూర్చుండి కునుకుపాట్లుపడుచుఁ జుక్కానిఁ బట్టుచుండెను. తక్కిన యిద్దఱును బడవలో మర్యాదగల స్త్రీలు గూర్చున్నను సందేహములేక నోట నుచ్చరింపరాని బండబూతులు గల కీర్తనలను బాడుచుండిరి. కొంతదూరము పడవ నడవగానే సరంగు డబ్బులను పుచ్చుకొనుటకు వచ్చెను. పాప మొక కాపువాని దగ్గఱ నాలుగుడబ్బులను బుచ్చుకొనుటకు నొప్పుకొని సగము నదిని దాఁటిన తరువాత నాలు డబ్బులు బుచ్చుకొందుననియు, నట్లియ్యని యెడల మధ్య నొక తిప్పమీఁద దిగుమనియు నతఁడు బాధపెట్ట నారంభించెను. అతనిదగ్గఱ సొమ్ముపుచ్చుకొని సరంగు రెండవ వాని దగ్గఱకుఁబోయి యడిగెను. అతఁడు "నేను రేవుదగ్గఱ పడవ యజమానుని కిచ్చినాను. అతఁడు నీతోఁ చెప్పలేదా?" అని యడుగ గానే సరంగు కోపముతో "నా కీసంగతి పనికిరాదు. డబ్బు లియ్య గలిగిన నియ్యి; లేనిచో దిగిపో" అని చెప్పి మొదట పడవ యజమానుఁడు డబ్బులు పుచ్చుకొన్నసంగతిఁ దానెఱిఁగియుఁ దిరిగి సొమ్ము పుచ్చుకొనెను.

ఇట్లు నదిచెక్కవలకును బూటమైన పడవ దైవ వశముచేత సుడిగాలికి వశమయ్యెను. రామచంద్రుడు దనకు దాహమగుటచేత ముక్తేశ్వర గ్రామ నివాసుని దగ్గఱనున్న చెంబొక మా రడిగెను. అతడు మహాకోపముతో "మైలవాడవు నీకు బ్రాహ్మణులము చెంబే లాగున నియ్యగలము" అని చెప్పెను. తరువాత నెండ బాధచే రామచంద్రుఁ డా బ్రాహ్మణుని యొద్ద కూర్చుండుటకు రాగా నతఁడు కోపముతో "ముట్టుకొంటావు కళ్ళు కనపడవూ" అని కోపపడి వానిని లేవగొట్టెను. అప్పుడు సుడిగాలితో గాలిదుమారము వచ్చి భూమ్యాకాశ మధ్య మంతయు నొక యిసుక తెరతో పడవ కపాయ మును గలుగఁ జేయునట్లు చేసెను. అసమయ మిట్లుండెను.

మ. నటదుత్తుంగతరంగసంఘ మలర న్నాత్రాంఘమై, రంగ ము
ద్భట గోదావరి గాఁగ భూగగనమ ధ్యవ్యాప్త ధూళివ్రజం
బట నేపథ్యముగాఁగ రౌద్రరస దృ శ్యగ్రంథ మాడించెదున్
ఇటు ఝంఝానిల సూత్రధారుఁడు మహా పాండిత్య మేపారఁగన్.

కెరటములు మహోత్తుంగముగ లేచి పడవ పగులునట్లు కొట్టు చుండెను. దోనె యిటు నటు నొరగుచు గొంచెము కొంచెము నీరు వోసికొన నారంభించెను. పడవలో స్త్రీలు, బాలురు, వృద్ధులు నల్ల కల్లోలముగా ధ్వనిఁజేయుచు సరంగును దెలచాపదింపుమని ప్రార్థించిరి. కాని యతడు భయము లేదనియు త్వరగా దింపుదుననియు జెప్పెను. ఒక పర్యాయము నదికి వంగివంగి నమస్కారము చేయుచున్నదో యనునట్లు దోనె మిక్కిలి యొరుగఁగా నందఱును బెద్దపెట్టున గోలపెట్టి యేడ్చిరి. పడవ మునుగక మానదని యందఱకును దోచెను. ఆసమయ మందు దల్లులను గౌగిలించుకొని యేడ్చు బిడ్డలును బిడ్డలనుజూచి యేడ్చు తల్లులును, బదవవాండ్రను గట్టిగాఁ దిట్టి కొట్ట బోవు వారును, నారాయణ నారాయణ యని ధ్యానము చేయువారును, గంగాస్తవము బఠించువారును, కొబ్బరికాయలు, పసుపు, కుంకుమ, చీరెలు గంగకు సమర్పించువారును. దేవతలకు మ్రొక్కువారును జేయు ధ్వనులు ప్రతిధ్వను లిచ్చుచుండెను.

ఆ సమయమందు ముక్తేశ్వర బ్రాహ్మణుఁడు, రామచంద్రుని యొద్దకు వచ్చి యతని కేమైన గొంచె మీఁత వచ్చునేమో యని యడిగెను. రామచంద్రుఁ డూరకుండెను గాని యతని శాంతమును, మన స్తిమితము జూచి యీతవచ్చునని యూహించి యాబ్రాహ్మణుడు రామచంద్రుని గడ్డమును, గాళ్లను. జేతులను బట్టుకొని తనప్రాణము నెట్లయిన రక్షింపుమని బ్రతిమాల నారంభించెను.

ఇప్పటికి దోనె దాదాపుగా నొడ్డున కేఁడిగజముల దూరములో నుండెను. పడవ మునుగుటకు సిద్ధముగా నుండినపుడును రామచంద్రుడు జందెము మెడకుఁజుట్టి నడుమునకు బట్ట గట్టిగాఁగట్టి ముందుగా వదిలోనికి దుమికి పడవలోనున్న యిద్దరుపిల్లలను దనమీద నెక్కించుకొని యీఁది యొడ్డున దింపెను. అది చూచి యందరును 'మమ్ము రక్షింపు, మమ్ము రక్షింపు' మని వేఁడుకొనిరి, ఈ లోపుగా నొక పెద్దగాలి రాగా బడవ తలక్రిందై మునిగిపోయెను. త్వరగా దింపుదునని వాగానము చేసిన సరంగు తనమాట దప్పకుండ వారిని ద్వరలో గంగలో దింపెను.

ముక్తేశ్వర బ్రాహ్మణుఁడు రెండు మునుఁగులు మునిఁగి, నాలుగుగ్రుక్కలు నీళ్ళుత్రాగి మూడవమాఱు తేలినతోడనే, పిల్లలను దింపి తిరిగి యెవరికైన సహాయము చేయుటకు బడవదగ్గరకు వచ్చుచున్న రామచంద్రుని గొంతు గట్టిగా బట్టుకొనెను. రామచంద్రుడు వదలు మని ప్రార్థించెను గాని వదలు మనుకొలది మఱింత గట్టిగా బ్రాహ్మణుఁడు పట్టుకొన నారంభించెను. రామచంద్రుఁడును బ్రాహ్మణుడును గూడ జచ్చిపోవునట్టి సమయము వచ్చినట్లు కనఁబడెనుగాని రామచంద్రుఁ డుపాయశాలిగనుక బ్రాహ్మణుఁ డెంతకును వదలనప్పుడు వానిని గట్టిఁగా గఱచెను, తోడనే బ్రాహ్మణుఁడు పట్టు వదలెను. రామచంద్రుఁడు భూతదయాళుఁడు కాబట్టి యా బ్రాహ్మణుని యందు మహాదయగలిగి వెనుకకు వచ్చి రెండు మూడు తన్నులతో నొడ్డునకు బంపెను. పిమ్మట రామచంద్రుఁడు బ్రాహ్మణుని గట్టున కెత్తికొనిపోయి నీరుత్రాగుటచే నెత్తుగా నుబ్బియున్న పొట్టమీఁద నడుగువేసి త్రొక్కి నీటిని వెలికిఁదీసి వానిని బ్రతికిం

చెను. ఇంతలో నొక పడవ వచ్చి యా జనులను రక్షించుటకు ప్రయత్నముచేసెను గాని సగముకంటె నెక్కువ జనులా దుర్దినము నందు మృతినొందిరి.

రామచంద్రుడు సహాయ మియ్యనియెడల ముక్తేశ్వర బ్రాహ్మణుడు పడవ వచ్చునప్పటికి స్వర్గంబునఁ బాఁతకాపై యుండును. అంతట బ్రాహ్మణుఁ డారామచంద్రునితో 'అయ్యా మీ ఋణము నే నెప్పటికైనను దీర్పలేను. నాయావదాస్తిని మీకిచ్చినను మీ ఋణము దీరదు. మీకుఁ దగిన బహుమాన మేదైన నియ్య వలెనని యున్నది. మీరు నాతోఁగూడ ముక్తేశ్వరము దయచేయ వలెను. నాప్రార్థన మంగీకరింపవలసినది' అని చెప్పగా, రామ చంద్రుఁడు 'సరిసరి యీమాత్రపుం బనికి బహుమాన మీయవలెనా? నాచేఁతనైన సహాయమును నేను జేసినాను. మీ రేమియు నియ్య నక్కఱ లేదు. దయమాత్ర ముంచండి, తమరు పెద్దలు' అని ప్రత్యుత్తరము చెప్పి యొకతృణమైనను బుచ్చుకొనకయే రాజవోలు నకు బోయెను. ఆ బ్రాహ్మణుఁడుగూడ శివకోడు గ్రామమునజేరెను.

రామచంద్రుఁడు రాజవోలు వెళ్లనప్పటికి సాయంకాల మైనందున కుమారుడుఁ వీధియరఁగుమీఁదఁ గూర్చుండెను. ఆపిల్లవానిని జూడఁగానే రామచంద్రుడు 'నాయనా! ఎంతకష్టము వచ్చిన'దని యతనిని గౌఁగిలించుకొని యేడువ నారంభించెను. ఈతఁడెందుకేడ్చు చున్నాఁడో తెలియకుండఁ గుఱ్ఱవాఁడుకూడఁబెద్దపెట్టున నేడువసాగెను. ఇద్దఱును లోపలికిఁ బోగానే వారినిజూచి మహావిపత్తు తటస్థమైన దనుకొని ఘనత్తగూడ నేడవనారంభించెను. చుట్టుప్రక్కలనున్న మనుష్యు లందఱును జేరి 'యేమియేమి?' అని యడిగిరి కాని, వారు ప్రత్యుత్తరమును జెప్పకయే వెక్కి వెక్కి యొకరి సంగతి నొకరెఱుఁగకుండ వారందఱును దుఃఖపడుచుండిరి. ఆవినోదమును జూడవచ్చినవారును, గష్టమేమో కలిగినదని యోదార్చింప వచ్చిన వారును, సంగతిఁ దెలిపికొనవలె ననువారును గుమిగూడి యింటి చుట్టునుజేరిరి. కాని యొకరికిని దుఃఖకారణమేమో తెలియదయ్యెను.

అప్పుడు రామచంద్రునివలె నున్నయొక నలుబదియేండ్ల బ్రాహ్మణుఁడు గుంపుగూడిన జనులందఱిని జేతులతోఁ దోసికొని యతిత్వరగా వచ్చి గుండెబాదుకొనుచు 'ఏమినాయనా ! ఏమినాయనా! యని రోజుచులోనికివెళ్ళెను. అతనిఁజూచి రామచంద్రుఁడు మిక్కిలి యాశ్చర్యపడి, నోటివెంట మాటరాకనిశ్చేష్టుఁడై, తెలివి దెచ్చుకొని లేచి యావచ్చిన మనుష్యుం గౌగిలించికొని 'మామయ్యా, నీవు బ్రతికి యున్నావా ? ఎవరో దుర్మార్గులు నీవు చచ్చిపోయినా వనిజెప్పినారు, అందుకు నేనిక్కడకు వచ్చినాను' అని చెప్పయావిపరీత వృత్తాంతము నంతను మేనమామ విని యెవరో విరోధు లావనిఁ జేసినారని నిశ్చయించి యింటనందరిని నూరకుండుఁ డని చెప్పినతరువాత రామ చంద్రుఁడును దానును గష్టసుఖములఁ జెప్పుకొనుచుండిరి.

మేనల్లుడు మేనమామతోఁ దాను రాజవోలునుండి బయలుదేరి వెళ్ళినది మొదలుకొని యానాఁటివఱకు జరిగిన యాపద్వృత్తాంతమును జూసగ్రుచ్చినట్లు చెప్పగా, మేనమామయు, శోభనాచలము మొదలైన వారి చరిత్ర విన్నపు డాశ్చర్యమును, గష్టములు విన్నప్పుడు విచారమును, గష్టనివారణ మగునపుడు సంతోషమును గనబరచుచు, శరభరాజుగారి యుదారగుణముల స్తోత్రముచేయుచు, రామచంద్రునితో మాటాడుచుండెను. అతఁడక్కడ నొకవారము దినములుండెను.

ఆలోపుగా నాగ్రామనివాసుఁ డొకఁడు మంత్రిప్రగడ వేంకట రత్నమునకుఁ దమపిల్ల నియ్యవలెనని యాతని గుణాదులను గూర్చి రామచంద్రునడుఁగగా, నతఁడు వేంకటరత్నముయొక్క దుర్గుణాదులను గుఱించి తనకు దెలిసినంతమట్టుకు నిజము చెప్పెనుగాని 'కల్లలాడి యిల్లునిలుపు' మనుశాస్త్రము ననుసరింపలేదు.

వారముదినము లక్కడ నిలచినతరువాత మేనమామదగ్గర సెలవు దీసికొని ప్రయాణమై సుఖముగా రామచంద్రు డమలాపురము జేరి యక్కడివా రందఱితో నీఘోరవృత్తాంతమునుజెప్పి వారందఱి నాశ్చర్యమగ్నులఁ జేసెను. రాజవోలులో రామచంద్రుఁడు వేంకట రత్నముయొక్క వివాహమును గురించి మాటలాడినమాట లతనికి

నేలాగుననో తెలిసినందున రామచంద్రుఁడు తనకుఁ జేసిన మహో పకారమునకు మిక్కిలి కోపగించి యతఁడొకనాడు రామచంద్రుఁనితో నిట్లు మాట్లాడ నారంభించెను.

వేంక : ఏమోయి! రాజవోలు విశేషములు? మీ మామ గారు బాగున్నారా?

రామ : ఆ! బాగున్నారు. విశేషములేమియు లేవు.

వేంక : రాజవోలులో నాకు వివాహవిషయమై సహాయము నీవు చక్కఁగా జేసినావు.

రామ : నేను జేసినదేమున్నది? వారు నన్ను వచ్చియడిగినారు.

వేంక : అడిగితే నన్నుగురించి నీవేమి చెప్పినావు! నీకు నామీదనున్న కసియంతయుఁ దీర్చుకొన్నావు కాఁబోలును.

రామ : నాకు మీమీఁద గసి యేమున్నది? నా పెద్దలను మీరు చంపినారా? మీ పెద్దలను నేను చంపినానా? నాకు మీమీఁదఁ గోప ముండుటకు నే నెంతవాడను.

వేంక : ఎంతవాడవు గాకేమి? ఎంతవాడవు గాకుండ మా యమలాపురము వచ్చినావు? నీ పొట్టకూటికి మా యింటి యొద్ద నున్నను నీకున్న గీర్వాణ మెవరికినిలేదు, నీకు గన్నులు నెత్తికి వచ్చినవి. నీ ముందర మేమెంతవాళ్ళము? పీటలమీది పెండ్లి చెడ గొట్టి యేమి బావుకొన్నావు? నీకు సిగ్గు బిడియములు లేవేమి?

రామ : అయ్యా! తమ కంత కోపమెందుకు? నాకుఁదోఁచిన యభిప్రాయమును నేను దైవముఖమును జూచి నిశ్చయముగాఁ జెప్పినాను.

వేంక : నీకు నా సంగతి యేమి తెలుసును? నేను ముండ నుంచుకుంటే నీకేమి? నాయంతవాఁడను నేను. నీయంతవాడవు నీవు. ఒకరిదగ్గఱ నా ప్రచారము నీ వెందు కెత్తవలెను? నీవు మంచివాడవా యేమిటి? గురివెందగింజ దనక్రింద నలుపెఱుఁగదఁట! నీ యిష్టమువచ్చినట్లు పేలుటకు నే నెవరనుకొన్నావు? పెండ్లి వచ్చి

నప్పుడు వేయి యబద్ధములాడియైన నొక కొంప నిలువఁబెట్టవలెనన్న మాటయయినను నీవు వినలేదు. నీ చదువెందుకు తగులబెట్టనా! ఒకరు పచ్చగానున్న పక్షమున నీ వింత యోర్వలేవేమి? ఆహాహా! ఎంత బుద్ధిమంతుడవయ్యా? సత్రములో రాళ్లువేయునట్టి మచ్చులా గున నున్నది.

రామ: నేను మీయందుగల మొగమాటముచేత నబద్ధము చెప్పిన పక్షమున నా ప్రాణమున కుసూరుమని యా పిల్ల యేడ్చును. నూతేండ్లు బ్రతుకవలసిన బ్రతుకు,

వేంక: సత్యవాదివి నీవు బయలుదేరినావు. భూలోక హరిశ్చంద్రుఁడవు. తిన్నయింటి వాసములు లెక్కపెట్టుటలో తెలివికల వాడవు. తల్లిపాలు త్రాగి రొమ్ము గుద్దినాఁడన్న సామ్యము నీ దగ్గఱనె నిజమైనది. ఇందుకే నియోగపువానిని జేరదీయగూడ దన్న శాస్త్రము చెప్పినవాఁడు వెఱ్ఱివాఁడా?

అని యిట్లు వేంకటరత్నము తాను శరభరాజుగారి యింట బొట్టకూటికి జేరినవాఁడె యనుమాట మఱచిపోయి రామచంద్రుఁడు దనయింటనే యుండినట్లును, వానిని దానే సంరక్షించు చున్నట్లున్ను దలచి తల వాచిపోవునట్లు వానిని చీవాట్లు పెట్టి మాటలతోఁ దన వాదము ముగింపక చేతులుకూడఁగలుపుటకు సిద్ధముగ నుండెను. కాని, రామచంద్రుని యదృష్టము బాగుండి యింతలో లోపలనుండి వచ్చిన శరభరాజుగారు వేంకటరత్నమును రామచంద్రుని గూకలు వేసి వారి వివాదము నివారింప జేసిరి.

రామచంద్రుని సత్య వాద మతనిని మహాపదల పాలుచేసెను. ఒకనాడు వేంకటరత్నము మనస్సులో నేదో తలచుకొని యొక వ్రేలు పట్టుకొమ్మని నరసింహము నడిగెను. ఆతడు రెంటిలో బొడుగు వ్రేలు పట్టుకొనగా నది యతని మనస్సులో నున్న యభిప్రాయము నకు సరిపడనందునను, నశుభసూచకముగా నున్నందునను వేంకటరత్నమున కోపము వచ్చి "శకునపక్షి వెధవా! ఎప్పు డింతే. చవట చేతుల పెద్దమ్మ" యని టంగున నొక మొట్టికాయ మొట్టెను.

దానితోఁ గుఱ్ఱవాఁడు గెవ్వున గుక్క దిరుగకుండ నేడ్వఁగా లోపల నుండి కృష్ణవేణమ్మగారు వచ్చి యెవరు కొట్టినా రని యడుఁగగా రామచంద్రుఁడు సంగతి యంతయుఁ జెప్పెను. కృష్ణవేణమ్మ వేంకటరత్నమును గొంచెము చీవాట్లు పెట్టెను.

ఇట్లొకదానికంటె నొకటి బలమైన కారణములచే వేంకట రత్నమునకు రామచంద్రునకు మనస్పర్థ హెచ్చగుటచేత వేంకట రత్నము దన కసి దీర్చుకొనుటకు రామచంద్రుఁడు చదువుకొను చున్నప్పుడతని కేదైన పనిఁజెప్పి యతఁడు సేయుటకు వీలులేదనఁ గానే యావార్త శరభరాజుగారితోను; వారి తల్లితోను జెప్పి "తిండికి సిద్ధముగా నుండును గాని పనివల్లకాదు, మాయింట నున్నవారికి మాకంటె నెక్కువ రాజసము" అని చెప్పుచుఁ దనచేతనైన యిబ్బం దులఁ బెట్టుచుండెను. దేవుడు వరమిచ్చినను బూజారి వరమియ్యఁ డన్నట్లు శరభరాజుగారికి దయయున్నను వేంకటరత్నమునకు గటా క్షము లేకుండుట యొక పెద్ద చిక్కుగానే యుండెను.

ఒకనాడు రాత్రి భోజనము లయిన తరువాత శరభరాజుగారు లోపల చావడిలోఁ బచారుచేయుచుండగా రామచంద్రుఁడు దీపము వెలుఁగున జదువుకొనుచుండెను. అప్పుడు వేంకటరత్నము రామ చంద్రుని మెల్లగా బిలిచి యిట్లని చెప్పెను.

వేంక: అబ్బాయీ! ఆ మధ్య నిన్ను నే ననినమాటలు మన స్సులో నుంచుకొనవద్దుసుమీ! నా మనస్సులోఁ గల్మషములేదు. అప్పటి కప్పుడు గోపమువచ్చి నప్పుడు పిచ్చి ముండాకొడుకువలె నాలుగు కేకలు వేయడమేకాని దీర్ఘక్రోధముంచుకొనను. మనమందర ము గూడి యొకయింట నుండువారము, ఈవేళ నాలుగనుకొన్నను రేపు తిరిగి కలిసే వాళ్ళము మనమే. నన్ను నీవన్నను నిన్ను నే నన్నను నది లెక్కలోనిదిగాదు. నేను పయి కీలాగున గోపముతో గనఁబడుటేకాని నీవిషయమైన సంగతి నేదయిన శరభరాజుగారితోఁ బ్రసంగించవలసినపుడు నే నెంత కట్టుదిట్టముగఁ జెప్పుచుందునో పరమాత్మునకుఁ దెలియును.

రామ : చిత్తము, మీ దయ యున్న పక్షమున నాకేకొరంతయు నుండదు. మిమ్ము నందఱను నమ్ముకొన్నవాఁడనే కనుక నా భారమే మీది,

వేంక : ఒకపర్యాయము వీధిలోనికి రా.

అని వీధిలోనికిఁ దీసికొని వెళ్ళి, "సూర్యనారాయణగారూ! దయచేయుండి." అని యతఁడు పిలవగానే తెల్లని తలపాగాను బెట్టుకొని నిలువుటంగీ దొడిగికొని, మంచి జరీపంచఁగట్టి, చేతిలో నొక వెండిపొన్ను వేసిన కర్రఁ బట్టుకొనియున్న యొక బ్రాహ్మణుఁడు వచ్చెను. అతనినిఁజూచి రామచంద్రుఁడు "తివాసీ పట్టుకొని రానా?" యని యడిగెను. కాని వేంకటరత్నమును, బ్రాహ్మణుఁడును వద్దని చెప్పగా వా రందఱు వీధియరఁగుమీఁద మూలఁ గూర్చుండిరి,

వెంక : రామచంద్రుఁడూ? నీ వొక సహాయముఁ జేయవలయును. ఈయన దేశిరాజు సూర్యనారాయణగారు. వీరు దేశపాండ్యులు. కోటిపల్లి కాపురము తాత ముత్తాతల కాలమునుండియు శ్రీ విజయనగర మహారాజుగారిదగ్గఱ పెద్ద యుద్యోగములను జేయుచున్నవారే, వారిది నూఱు పుట్లభూమి. వెనుకటి సంవత్సర దుర్భిక్షమునకు వీరు చేసిన యన్నదాన మింతింత యని చెప్పనలవి కాదు, మూడేండ్లు జనులు గుటుంబములతో వచ్చి వీరి గ్రామములో గాపురమున్నారు, జగత్ప్రసిద్ధులు.

రామ ; నే నెన్నఁడు నెఱుఁగను. మహానుభావులు మీరు.

సూర్య : అవి యన్నియు నెందుకు? ఆదినములు వేఱు. ఆకథలు వేఱు. చావలేక యీలాగున బ్రతుకుచున్నాను. ఈస్థితి, యీవేషము వేఱు.

వేంక : అందుచే నప్పు విస్తారముకాఁగా భూములు తాకట్టులో నున్నవి. ఇంటనున్న జవాహీరీ యంతయు విక్రయించి వీరు కాలక్షేపము చేయుచున్నారు. అయితే యీనగలు కోటిపల్లిలోన జుట్టు

పట్లను మాత్రమమ్మను. పూవు లమ్మినచోటనే కట్టె లమ్మవలసి వచ్చెను. అనగలు మాగ్రామము దెచ్చి యమ్ముచుందురు.

రామ : నేనిప్పు డేసహాయము జేయవలయును? పాపము నాకు విచారముగానే యున్నది.

వేంక : మఱేమి గొప్పసంగతి కాదు. నీయందు కోమట్లకు మహాగౌరవము కలదు. నీ నమ్మినపక్షమున మోసము చేయరు. నీకు బంగారము నాణెము తెలుసును. ఈవస్తువులు నీ వమ్మిపెట్టి యతని మర్యాదఁ గాపాడవలెను.

రామ : ఈమాత్రపు బని కింత మనవి కావలెనా? నాచేతనైన దానిలో మీకుఁ దగినంత సహాయము చేయగలవాఁడను.

సూర్య : ఈసంగతి యెవరికిని దెలియనియ్యరాదు సుమా :

రామ : మీరు చెప్పినతరువాత నెవరికైనఁ దెలియనిత్తునా? నాకు బంగారము నాణెము చక్కగాఁ దెలియదు.

వేంక : తెలిసినంతమట్టుకు చాలు. రాజగోపాలమునకైనఁ దెలియ నియ్యకు. ఇవిగో వస్తువులు. కంటె నూఱురూపాయలధర. ఉంగర మేబది రూపాయలు. ఈయన తిరిగి రేపురాత్రి మనదగ్గఱకు వచ్చి యాసొమ్ముఁ బుచ్చుకొందురు. రేపు పగలు వీనిని విక్రయించు.

రామ : ఆయన రాత్రి రావడ మెందుకు? పగలు రారాదా?

వేంక : పగలువచ్చిన పక్షమున శరభరాజుగారు బలవంత పెట్టి భోజనమునకు రమ్మనమని నిష్ఠురములాఁడగలరు. ఎందుకు రాత్రియే మంచిది.

ఈ సంభాషణము ముగిసిన తరువాత సూర్యనారాయణగారు వెళ్ళిపోయిరి. రామచంద్రుఁ డా వస్తువులను రాత్రి జాగ్రత్తపెట్టి మఱునా డుదయమున గోమట్లకుఁ జూపించి వారు చెప్పిన ధరప్రకారముగా రెండువస్తువులను నూటయేబది రూపాయల కొక బ్రాహ్మణునకు విక్రయించి యా సొమ్ము మరునాడు రాత్రి సూర్యనారాయణగారాగా నతనిచేతికిచ్చెను.

ఆ పనియైన తరువాత వేంకటరత్నము రామచంద్రుని పిలిచి 'నాయనా! ఇంకొకపని యున్నది. గంటము నాకు నొక్కపర్యాయము పుచ్చుకొనుము. పెద్దాపురమునుంచి జగన్నాధరాజుగారు వచ్చినారు. ఆయనతోఁ గూడ మా మేనల్లుడు వచ్చినాఁడు. అతని కక్కడ ముప్పదిరూపాయలు పని. వాఁడొక్కమారు నాకు మోము జూపించి తిరిగి కనబడలేదు. ఒక యుత్తరము వ్రాసి పంపెదను. నీవు వ్రాసిపెట్టవలెను.

అనఁగానే రామచంద్రుఁడు గంటమును దాటియాకును బుచ్చుకొని సిద్ధముగా నుండగా వేంకటరత్న మీ ప్రకారముగ వ్రాయించెను. 'నీవు నా కీవేళ నొక్కమాఱు మొగము జూపించి తిరిగి లోపలికి వెళ్ళినావు. నీతో మాటలాడవలెనని యున్నది. నీకు నీ లెప్పుడో తెలియజేసిన పక్షమున నేను తప్పకవచ్చెదను. నీతో మాటాడకుండ నే నుండలేను.' ఆ యుత్తరము వ్రాసి రామచంద్రుడు 'వ్రాలు చెయ్యండి వేంకటరత్నముగారు' అని యడుగగా 'వ్రాలెందుకు. ఈమాత్రపుఁ జీటిముక్కకు వ్రాలును బై పేరును గూడ గావలెనా?' అని చెప్పి చీటిని బుచ్చుకొనెను.

ఇదియైన నాల్గుదినములకు నరసింహాము పుట్టినదినమువచ్చెను. అతఁ డాశ్వయుజ బహుళ త్రయోదశినాఁడు జన్మించినందున నా దినము బిల్లవాని కభ్యంగనము జేయించి గ్రామమునను న్న నలుగురు నియోగులను శరభరాజుగారు భోజనమునకు బిలిచిరి. మధ్యాహ్నము నరసింహామునకు సంపెంగనూనెతో గృష్ణవేణమ్మ తలదువ్వి బంగారు కుప్పెలుగల నల్లపట్టు జడబొందుతో జడవేసి. జడమీద చిన్నచేమంతి పువ్వునుం దానికి పైభాగమున నడినెత్తిమీఁద మొగలిరేకును నమర్చి. మొగమున జక్కని యగురుచుక్కను బెట్టి. రావిరేకవేసి. పచ్చని పట్టుచొక్కా తొడిగి. దానిమీద జందెమువలె వరహాలపేరు వేసి. మెడలో మిరియాల పేరును. జంద్రహారములను వేసి. దానిమీఁద బంగారుకడ్డీ కంటెపెట్టి. కుడిచేతిమీద బంగారపు బుజబందుకట్టి రెండుదండలమీద వంకీలుపెట్టి. చెవులకు వజ్రపు బోడులు వేసిన తమ్మంట్లనుంచి. కుడిచేతి యైదువేళ్ళకు బటువులుంచి

మణికట్టు దగ్గఱమంచి బంగారుకడ్డీ మురుగులును. మురదీగొలుసు లును. ధగధగలాడుచుండ నెఱ్ఱపట్టులాగు తొడిగి బంగారపుబిళ్ళల మొలత్రాడు లాగుమీఁదికిఁ దీపి, కాళ్ళకు వెండియందెలును, గజ్జె లను. గడియములును గీలించి, మెడకు దెల్లచారగల యెఱ్ఱ పట్టు రుమాలు ముడివేపి శృంగారించి కుమారుని బడికి పంపెను.

పిల్లవానిమీఁదవైచిన వెండిబంగారము అంతకంటె బరువుగా నున్నందున వస్తువులను మోయలేక వగర్చుచుఁ బుస్తకములుమోయ లేనందున జాకలివాడు వెనుక పుస్తకముల దెచ్చుచుండెను. తమలపా కులవంటి చెక్కిళ్లును, దాంబూలము వేయనక్కఱలేకయే దొండపండు వలె నెఱ్ఱగానున్న క్రిందిపెదవియు, బూర్ణచంద్రసమానమైన గుండ్రని ముఖమున కందము నొసంగఁ గాలియందియలు ఘల్లుఘల్లుమని మొఱయ దుర్మార్గులకనులు కుట్టునట్లును, విరోధుల కసూయ గలుగు నట్లును, బిడ్డలులేని స్త్రీలు ముచ్చటపడునట్లును ముద్దులుమూటఁగట్టుచు బాలుడు బడికిపోయెను.

బడిలో నెన్నఁడును జదువులేదు కనుక పంతులవారు గాఢ ముగా గుఱ్ఱుపట్టి నిద్రబోవుచున్నందునఁ బిల్లలందఱును దాహమున కనియు నింకఁ గొన్ని పనులకును నానాముఖములై పారిపోయిరి. నరసింహముకూడ నొకమూలకుఁ బోగా నెవరో యొక బ్రాహ్మణుఁడు చేతిలో నొక పటికిబెల్లపుగెడ్డయు, నొక పంచదార చిలుకయు, నాలుగు చక్కెరకేళిపండ్లును బట్టుకొని నరసింహమును రమ్మనుమని చేతితో సంజ్ఞచేసెను. ఎఱకొఱకుఁబోయిన చేపవలెనే నరసింహము గూడ నాబ్రాహ్మణునియొద్దకుఁ బోయి యతఁడు పెట్టినపంచదార చిలుకను దినుచుండగా నాబ్రాహ్మణుఁడతని నెత్తుకొని ముద్దాడి తన యింటికి దీసికొని పోయెను. పాపము ముద్దుచేత వదలలేకయే కాఁబోలును బిల్లవానిని బ్రాహ్మణుఁడు వదలనేలేదు.

అతనితోఁ గూడ వెళ్ళిన చాకలివాఁడు నరసింహము పుట్టిన దినము గనుక శరభరాజుగారు బహుమతిగా నిచ్చిన నాలుగుడబ్బు

లతోఁ గల్లుపీళ్లు త్రాగి బాలకుని సంగతి స్మరణకురాక యెక్కడనో దొర్లుచుండెను.

పిల్లవాఁ డెంతసేపటికిని నింటికి రాలేదని కృష్ణవేణమ్మ విచారించుచుండగా జాకలివా డక్కడికి వచ్చెను. నరసింహ మెక్కడ నున్నాడురా యనిచాకలివాని నామె యడుఁగగావాఁడేదో కొంప మునిఁగిన దనుకొని 'నే నిందాకఁ దీసికొనివచ్చి యింటిదగ్గఱ దిఁగ బెట్టినా నండి' యని చెప్పెను. కాని, వానిమాటయందు నమ్మకము చాలక శరభరాజుగారితో నీసంగతిఁ గృష్ణవేణమ్మ చెప్పెను. ఆమాట వినఁగానే యింట నందఱుఁ గలవఱపడ నారంభించిరి. నగలు శరీరమునిండ నుండుటచేత నెవరో గొంతుపిసికి చంపి నగలను దీసికొనిరని కృష్ణవేణమ్మ యేడ్చుచుండెను. శరభరాజుగారు కదులుటకుఁ గాళ్ళాడక దిగులుమొగముతో నుండిరి. శరభరాజుగారితల్లి కృష్ణవేణమ్మను నగలుపెట్టి పిల్లవానిని బడికిఁ బంపినందుకుఁ దిట్టసాగెను. వేంకటరత్న మొక ప్రక్కకును జాకలివాఁడింకొక ప్రక్కకును, ఇరుగుపొరుగు వారందఱుఁ దలొక ప్రక్కకును బోయి సందులు, గొందులు, బాడుగొడ్లు, ప్రాతనూండ్లు, బోడిగోడలు, దోటలు మొదలయిన రహస్యస్థలము లన్నియు వెదికిరి. కాని యెందును బాలుఁ డగుపడలేదు. నగలుపోయినను సరే జీవముతో మనకుమారుఁడు గనఁబడినఁ జాలునని తల్లి యూరడించుటకు వచ్చిన స్త్రీలతోఁ జెప్పి జెప్పి విలపించుచుండెను. రాజగోపాలమును రామచంద్రుడును గూడ నమలాపుర మంతయు వెదికిరిగాని పిల్లవాఁడు కనఁబడలేదు.

తుద కారాత్రి జామయినతరువాత రామచంద్రున కొక్కయోడిగవా డగుపడి నాలుగు ఘడియల ప్రొద్దువేళఁ దాను దాటిచెట్టు నెక్కి కల్లుదీసుకొనుచుండగా నొక నగలపిల్లవానిని, మఱి యిద్దఱు మనుష్యులను దాటితోఁటలో జూచినా నని చెప్పిపోయెను. ఆతోటలోపలికి రామచంద్రుఁడొక్కఁడును బోయి నాలుగుమూలలు వెదకి తుద కొక ముండ్లకంచెదగ్గర నోటిలో గుడ్డలు గ్రుక్కబడి యున్నందున మాటరాక దిగంబరియైవిలిచిన యొక బాలకుని జూచి చీఁకటిచేత మొదట తాటిమొక్క యేమో యనుకొని సందేహనివా

(జార్థము దగ్గఱకుఁ బోయి చూచిపిల్లవాఁడె యని తెలిసికొని 'నర సింహము' అని పిలిచెను. మాట లాడుటకు వీలులేక యతఁడు గన్నీ (ళ్ళ)తోఁ బ్రత్యుత్తర మిచ్చి యెత్తుకొమ్మని చేతుల జాచెను. రామచం ద్రుఁడు నరసింహము నెత్తుకొని నోటిలో గుడ్డలు దీసివేసి నగ (ల)ంటపని జేసినదిగదా యని పిల్లవాని స్థితికిఁ గొంచెము కన్నీళ్ళు (వి)చ్చుకొని దొరికినందున సంతోషించుచు నింటికిఁ దీసికొనిపోయెను.

పిల్లవాడు కొంత దూరమున నుండగనే యీ సంగతి తెలిసి యింట నందఱు వచ్చి పిల్లవాని నెత్తుకొని ముద్దాడిరి. కృష్ణవేణమ్మ యుఁ దొట్రుపాటుతో వచ్చి బాలుని జూచి దుఃఖము పొరలి పొరలి రాఁగా నెత్తుకొని కంటబడి సుఖముగా నున్నందుకు మహాసంతోష ముతో లోపలికిఁ దీసికొనిపోయి కొంచె మన్నము దిగఁదుడిచి వెచ్చి రుప్పెడు మిరపకాయలను లోపలనున్న వారందఱు గొంతులు బ్రద్ద లగు లాగున దగ్గునట్లు (ప్ర)పోయిలో బోసి, పిల్లవానికి జరిగిన సంగతి నడుగుచుఁ మధ్య మధ్య నేడ్చుచు వచ్చిన స్త్రీలకు వానిని జూపు చుండెను.

తరువాత మగవా రందరు గాగడాలు వేయించుకొని యాతాఁటి తోఁటకు బోయిరి. కాని దొంగవాఁడును బుద్ధిమంతుఁడు గనుక పొరపాటుచేనైన నొక్కనగనైన దిగబెట్టకుండ నన్నిటిని దీసికొని పోయెను. కాని నరసింహము యొక్క చొక్కాను, లాగును, రుమాలును విడిచిపోయెను. ఆతొందరలో దొంగలు తనచేతి తెల్ల రుమాలు కూడ విడిచిపోయిరి. అది రామచంద్రుని కంటఁ బడఁగా నతఁ డదరిపడి శోధించి చూచి యొక కొంగున జీడితో వేసిన పేరు యొక్క మొదటియక్షరములు చా. జ. యని చదివి యాపే రెవరిదో యెఱుఁగక యందఱును త్వరితముగా నింటికి వచ్చిరి.

ఆ మరునాఁడు నరకచతుర్దశియు, దాని తరువాత దీపావళియు నై యుండెను. నగలు దొరకక పిల్లవాఁడు మాత్రమే దొరికినందుకు శరభరాజుగారి తల్లికి విచారముగా నున్నందున నాసంవత్సరము పండుగ జెయ్యవద్దని చెప్పినది. కాని శరభరాజుగారును కృష్ణవేణ

మ్మయుఁ బిల్లవాడు దొరుకుటయే చాలునని మునుపటికంటె పండుగ ఘనముగా జేసికొనుటకుఁ బూనిరి. వా రందఱుఁ దమకుమారుని వెదకి తీసికొని వచ్చినందులకు రామచంద్రుడ నకనేక వందనములు జేసి వేయివిధముల వానిని స్తోత్రముఁజేసి యతని ఋణముఁ దీర్చు కొనలేమని చెప్పిరి.

నరకచతుర్దశినాఁడు తెల్లవారుజామున నే లేచి యెంతమందికిఁ దల లంటిన నంత పుణ్యముగనుక తన స్నేహితులను బంధువులను బిలిచి శరభరాజుగారు కొందఱికిని గోపాలము కొందఱికిని స్వయ ముగాఁ దలల నంటిరి. కొందఱికి మంగళ్ళచేత దల లంటించిరి. అభ్యంగన సమయ మందు శరభరాజుగారికి బార్వతి మంగళహారతి బట్టగా నాయన పాతిక రూపాయలు పళ్ళెములో వేసిరి. రామచంద్రు డును రాజగోపాలమును బాణసంచుకాల్చి దొడ్డినంతను వెలిగించిరి.

మరునాడు దీపావళి యమావాస్య యయ్యెను. అమావాస్య యింక నొకనెలకు వచ్చుననఁగా బలిపాటలను మానుకొని గంధక మును సురేకారముఁగొని బొగ్గుతెచ్చి పాళ్ళువేసి టపాకాయలను దక్కిన యితర బాణసంచును గట్టువారును, మందులను మండిగలోఁ బోసి నూరువారును. మందు నూరువారును దాము కట్టిన వస్తువులు చక్కఁగాఁ గాలునో లేదోయని పట్టపగలు చీకటిగదిలోనికిఁ బోయి తలుపులు మూసి, యావస్తువుల నక్కడ గాల్చి, వానిసార మెఱుఁగు వారును, దప్పుపాళ్లు పడుటచేఁ బాడైన మందులను గుఱించి వగచు వారును, జెలరేఁగి యుండిరి. పట్టణమందుఁ బ్రతిగృహమున గంధ కపువాసన గొట్టుచుండెను.

అమావాస్యనాఁ డుదయమునఁ గొంచెము మబ్బు వేసినందున వర్తకు లందఱికి దమసొమ్ము నమ్ముకొనుటకు వీలుండదని గుండె లలో బాయిపడిన ట్లుండుటయేగాక బాలురందఱును సంతోషభంగ మగునేమో యని మేఘుని దిట్టుచుండిరి. కాని కొంతసేపటికి వర్త కుల పాలిటి యదృష్టదేవతయో యనునట్లు పెళ్ళుమని యెండరాఁగా వర్తకులు దుకాణములను తెఱచి సరకు లమ్మనారంభించిరి. భాగ్యవం

తులు దమ బిడ్డలకు విస్తారధనము వ్యయపఱచి వస్తువులను గొని పెట్టుచుండుటc జూచి బీదల బిడ్డలు దమ తలిదండ్రుల బాధపెట్టcగా వారు బిడ్డలకుc దగిన యుత్సాహము దీర్చలేకపోయినందులకు విచారించుచు స్వల్పముగాc గొని యిచ్చుచుండిరి. గొప్ప యుద్యోగస్థుల యనుగ్రహము సంపాదించ వలెనని చిన్న యుద్యోగస్థులు దమపిల్లలకు లేకపోయినను బహుమతుల పేరుపెట్టి వారియిండ్లకుc బెద్దపెద్ద బాణసంచు బుట్టలను బంపుచుండిరి. అంతకంటె మహాభిమానముగల పౌరుషవంతులు తమరు సేవించుచున్న ప్రత్యక్షదేవతలగు వేశ్యకాంత లేమనుకొందురో యనియు, మంచివస్తువులc బంపనియెడల మఱునాcడు వారి మొగమెట్టు చూతుమనియుc దలంచి పదిమందిలో నగుబాటురాకుండc బరువు నిలుపcబెట్టు కొనుటకు ధనములేకున్నను ఋణము జేసియో, యింటనున్న వస్తువులను దెగనమ్మియో బాణసంచుగొని యొక రసికునికంటె నొకరసికుc డెక్కుడవగా నుండవలెనని వర్తకుల దగ్గఱ బదులుపుచ్చుకొని పెద్దపెద్ద బుట్టలను వారి యిండ్ల కంపిరి.

తాటిబిడుగులను సంపాదించి కాల్చి పొడుముచేసి గుడ్డలువేసి తాటిరెమ్మ చీరి యందులో నీ గుడ్డపెట్టి పొట్లముగాcజుట్టి కట్టి పైcబేడ బూసి బాలు రెండబెట్టుకొనుచుండిరి. వృద్ధులగువారు తాటియాకుల యీనెcదీసి చిత్రముగాc గత్తిరించి చుద్దముగా నొక యాకును నిలువుగా నొకయాకును వేసి గుమ్మడిపండుగట్టి వ్రేలాడదీయుచుండిరి. పురుషులందఱుc దమ తమ గుమ్మముల ముందఱ నరటిచెట్లు తెగcగొట్టించియు, బొప్పాయిచెట్లు నఱికించియుc బాతించి వానికి వెదురుకట్ల ముక్కలను దిగగొట్టించి వానిమీcద ప్రమిదలను దాగిడిమట్టి బురుజులను బెట్టించియు యంతతో దృప్తినొందక రెండు వీథి యరcగుల క్రిందను గడలను బాతించి వాని కడ్డముగ నెదురుకట్టలను నాలుగైదంతసులుగc గట్టించి వానిమీcదc గుమ్మరివాండ్రు దెచ్చియిచ్చిన క్రొత్తప్రమిదలc బెట్టించుచుండిరి.

అప్పుడు సాయంకాలము కాcగా నారాత్రి పెట్టబడు దీపములc కాంతిముందు తన కాంతి వెలవెలcబోవునను సిగ్గుచేతనో యన

సూర్యుఁ డపరసముద్రము బ్రవేశించెను. స్త్రీలందఱును మడి గట్టుకొని దీపములు పెట్టిరి. ఆకాశ మండలమున నున్న నక్షత్రములెల్ల భూమండలమున బ్రతిష్ఠించుచున్నట్లు దీపములు గోట్లకొలఁది వీధుల కిరుప్రక్కలను వెలయుచుఁ దమ మధ్యమున సువర్ణభూషణములతో నున్న స్త్రీల యవయవముల కపూర్వమైన లావణ్యము గలిగించుచు బట్టపగటియందువలె సమస్త వస్తువులను గాన్పింపఁజేయుచు సొగసు మిగిలియుండెను. మహారాష్ట్ర దేశవర్తకులు దమ కొట్ల నలంకరించి పళ్లెములయందు వెండిబంగారు నాణెములనుంచి ధనపూజ జేయుచుండ బ్రాహ్మణోత్తములు పూజ జేయించి సంభావనల గ్రహించి బొజ్జల నాడించుకొనుచు నిండ్లకు బోవుచుండిరి. ఈ దీపికా సమూహమునకు వెఱచి యంధకారమంతయు వారివెనుక శరణార్థము దాగియున్న దన్నట్లు క్రీనీడ దీపముల వెనుక నుండెను.

ఎక్కడ జూచిన దీపముల వెలుతురు, నెక్కడజూచిన రంగు రంగుల మహతాబుల కాంతియు, నెచ్చోటఁగాంచిన నానందమును, నే చాయఁ గనుగొన్న మహాధ్వనియు గ్రామమున నిండియుండెను. బాలకులు గాల్చుటఁ కసమర్థులగుటచే నగ్నిబాణములు వెదురుకఱ్ఱలకు గట్టించి కాల్పించు తండ్రులును, జమత్కారముగా గాల్చు చిన్నబిడ్డలను జూచి సంతోషించు తల్లులును, వస్తువులయిపోయిన విని రోదనము జేయు బాలకులును భార్యయొద్దను, దమరుంచిన వేశ్యకాంతల యొద్దను దమ చమత్కారమంతయుఁ జూపదలంచి చిత్రచిత్రముగా నగ్నిబాణముల గాల్చి వారి మెప్పునొందుచున్న మహారసికులును మార్గమున బోవుచున్న జనుల కాళ్లనడుమ దూటాలను, పిపింద్రీలను వేసి వారు తత్తరపడి పరుగెత్తుచుండఁ జూచి యానందించు కొంటెవాండ్రును సంభావనలకుఁ బోయివచ్చుచు దూరమందెక్కడనో గాలుచున్న యగ్నిబాణముల జూచి, తమయొద్దకు వచ్చుచున్నవని పరుగెత్తి పిరికి బ్రాహ్మణులును జిన్నబట్టలఁ గట్టుకొని దుప్పటుల గప్పుకొని వినోదము జూడవచ్చిన శృంగారపురుషులును, నడివీధుల యందు ధూర్తు లగ్నిబాణములు గాల్చుటచేతఁ దమ గృహములు

పరశురామప్రీతి యగునని భయపడి కేకలువేయు నార్తజనంబును. జనుల కుపకారము జేయదలంచి చేతులయందు నవనీతము లుంచు కొని శరీరముల గాల్చుకొనువారి కిచ్చునట్టి పుణ్యజనులును. గ్రామ మందంతటను బిక్కటిలియుండిరి.

ఊరున కుత్తరపు దిక్కుననున్న మందబయలుమీఁదికి బోయి మహావీరులందఱు నొకరి దేహముల నొకరు తగులఁబెట్టుకొనుటకు రెండు కక్షలయిరి. మెడను గట్టుకొన్న సంచిలోనుండి తూటాలను దీసి కత్తితో బొరను దెగకోసి. జానకిత్రాటనున్న నిప్పుతోనంటించి రెండుచేతులను రెంటినుంచుకొని నోటనొకటి పెట్టుకొని చిత్రవిచిత్ర ముగా ద్రిప్పుచు గూర్చుండియు. వంగియు జేతనైన కసరత్తులఁ జేయుచు వానివి కొందఱు కాల్చుచుండిరి. తోలుచేతుల తొడిగికొని లాగులను గట్టుకొని తలలకు టోపీలు దాల్చి. తమ కెన్నఁ డపకా రము చేయక యా దినముమాత్ర మెదుటికక్షలో నిల్చిన జనులమీద వెలగకాయలు, గారకాయలు దూటాలును విసరి వారి దేహములను గాల్చుచు వారు తమమీదివైచిన వానిని మరల నందిపుచ్చుకొని యుప యోగించుచు మధ్య మధ్య నంటుకొన్న సంచులను దెగగొట్టి పార వైచుచు, దేహములను గాల్చుకొన్న తమమిత్రుల విండ్లకు బంపుచుఁ దమదగ్గర సరకు ముగిసిన వెనుక స్నేహితులవద్ద పుచ్చుకొనుచు జంకలక్రిందనున్న పొట్టికట్టలతో నెదుటివారు ప్రయోగించిన వానిఁ నాఁపుఁ జేసికొనుచు. మీఁదికి బాణము వచ్చునపుడు పరుగెత్తు చు. గోయుటకు వ్యవధి చాలక తూటాలను నోటితో గీలుచు. జూచుటకు వచ్చిన జనసమూహమును బరుగెత్తించుచుఁ గొందఱు వినోదసముద్ర మగ్నులయిరి.

ఆ సమయమునం దాభూమి కేవల మగ్నిహోత్రమయమై నిప్పులు గ్రక్కు మనుష్యులతోఁగూడి యాగ్నేయాది మహాస్త్రసమేత మగు రామరావణ మహాభారత యుద్ధభూమివలెఁ దేజోవంతమై. యతిభయంకరమై ప్రజ్వరిల్లుచుండెను. అప్పుడు రామచంద్రుఁడును వేంకటరత్నమును. రాజగోపాలమును జూచుటకువచ్చి దూరముగా నిలుచుండిరి. కాని యొకగారకాయ మహావేగముతో రాజగోపాలము

మీదికి వచ్చెను. అది చూచి రామచంద్రుడు దన ప్రాణమునకు వెఱ వక స్నేహితునిమీదికి వచ్చుచున్న యాకాయ కెదురుగాఁబోయి చేతికఱ్ఱతో దానిని గొట్టెను. అది వెంటనే పగుల రామచంద్రుని శరీరము నిండ నగ్నిహోత్రపు ముద్దలు పడెను. వెంటనే బట్టయంటు కొన్నందున రామచంద్రుఁడు పరుగెత్తగా గాలితగిలి మఱి కొంచె మంటుకొనెను. అప్పుడు రాజగోపాల మతని నాఁపి చేతితో నఁపి వైచెనుగాని శరీరమం దక్కడక్కడ కాలెను. వేంకటరత్నము మంచి యుద్దేశముచేతనే త్వరగా బాధ నివారణకావలెనని కొంచెము నీళ్ళు మీఁదబోసెను. అంతట బాధ బోవుటకు బదులుగాఁ గాలిన చోట వెంటనే పొక్కు లెక్కి ద్విగుణమయ్యెను.

తరువాత వారందఱు నింటికిఁ బోఁగా శరభరాజుగారు నవ నీతమును దెప్పించి శరీరమంతట గాలినచోట్ల పట్టించి వారి నా ఘోరసమయమునందు నిర్భయముగా వీథులయందుఁ ద్రిప్పిన పడుచుదనపు గర్వమును నిందించుచుఁ దన కుమారుని రక్షించిన రామచంద్రుని ధైర్యసాహసాదుల కాశ్చర్యపడెను. రామచంద్రుని శరీరమున బాధ నెలనాటికిఁ గుదిరెను.

## ఆఱవ ప్రకరణము

పార్వతి వివాహవిషయమై శరభరాజుగారు బెంగబెట్టుకొనిరి. పిల్లకు దాదాపు పది సంవత్సరములు వెళ్ళవచ్చినను దగిన సంబంధ మెక్కడను దొరకక పోవుటయేకాక, యింత నౌకరి యభిప్రాయ ముతో నౌకరి యభిప్రాయ మేకీభవించుటలేదు. భాగ్యవంతులగు వియ్యోగ్గు లందఱుఁ దమ కుమారులు గురూపులై, విద్యావిహీనులై యేవిషయమునందును బార్వతితోఁ బోలకున్నను రెండువేల రూపా యలు, వెయ్యెన్నూట పదార్లు గట్నమిచ్చినఁగాని, శరభరాజుగారి

పిల్లను జేసికొనన మని చెప్పుచుండిరి. సత్సంప్రదాయమునఁ బుట్టి ప్రస్తుతము కొంచెము నీరసస్థితిలోనున్న నియోగులు శరభరాజు గారితో వియ్యమందవలె ననుకొన్నను దమస్థితికిని వారి స్థితికిని గల తారతమ్యమును బట్టి తమకు వారు పిల్ల నియ్య రని యడు గుటకు సందేహించి యూరకుండిరి.

శరభరాజుగారితల్లి 'పిల్లకట్టు దప్పిపోవుచున్నది. మన మంద రము గంగాప్రవేశముఁ చేయవలసివచ్చును. త్వరగా ముడిపెట్టు' మని తొందర చేయుచు గట్నమెంత యిచ్చినను సరే కొంచెమన్న వస్త్రములకు లోపములేనివారి కియ్యవలెనని చెప్పుచుండెను.

రాజగోపాలము రామచంద్రునకు దన చెల్లెలి నిప్పింపవలెనని తల్లిదండ్రులతో నప్పుడప్పు డామాట చూచాయగాఁ జెప్పుచు వచ్చెను. శరభరాజుగారు విశ్వనాథశాస్త్రిలవారితోఁ గుమార్తె వివాహవిషయమై ప్రసంగించునపుడు శాస్త్రిలవారును, రామచంద్రునిగుణముల శ్లాఘించి యతనిని దమ మనస్సులో నుంచుకొని యన్యాపదేశముగ 'భాగ్య వంతులను బ్రతిమాలుటకంటె బీదవాని కిచ్చుటే మంచిది' యని చెప్పుచు వచ్చిరి. శరభరాజుగారును బిల్లను ధనమునుగూడ గ్రహించి తెగనీల్గి సకలహింసననుబెట్టు నట్టి భాగ్యవంతులను రాక్షసులతో వేఁగుట కష్టమని యెంచి కుమార్తె యొక్కతే కనుక, తమకు లోకువ యైనవాని కెవ్వనికైన నిచ్చి పెండ్లిచేసి యల్లు నిల్లరిక ముంచఁ దలఁచుకొనె భాగ్యము తప్పతక్కిన శుభలక్షణము లన్నియు రామ చంద్రునియం దుండుటచేనతనికి బార్వతి నీయఁదలచి యావార్తఁ దల్లి కెఱుగఁజేయగానామె ప్రతిదినమును గలహమాడుచుఁ, గొడు కును గోపిపెట్టుచు, రామచంద్రునిఁ దిట్టుచుఁ తన వార్థకలక్షణము లన్నియుఁ జూపుచుండెను. వేంకటరత్నము వివాహ మెట్లయినఁ గానీయకుండవలెనని మనసులో సంకల్పించుకొని సహజముగ నీని యందనిష్టముగల శరభరాజుగారి తల్లిచెవిలో నిషపుమాటలు చెప్పి యామె కసహ్య మెక్కువ చేయసాగెను. చుట్టుప్రక్కలనున్న యమ్మలక్కలందఱుఁ. బార్వతి కనఁబడినపు డెల్ల 'ఓహోహో! రామచంద్రునిగారి భార్య గాఁబోలు! మాచిరాజువారి కోడలా!'

యవి పరిహాసముచేయ నారంభించిరి. వార లట్లనుకొనుట మొద లదివరకు రామచంద్రునితో స్వేచ్ఛగా మాటలాడుచున్న పార్వతి కెక్కడినుండియో మిక్కిలి సిగ్గువచ్చి మాటలాడుట మానెను. మాటలుపోగానే చూపులుకూడఁ దప్పెను. తన స్నేహితు లెవరయిన దన్నాలాగు నన్నప్పుడు వారితో గలహమాడుచు బెద్దలన్నప్పుడు సిగ్గునఁ దలవంచుకొనుచుఁ, దల్లిదండ్రుల దగ్గర నెవరైన హాస్య మాడునపుడు వారిచాటునకుఁ బోవుచుఁ బార్వతి లజ్జాచిహ్నములఁ గనఁబరచుచుండెను. అదిగాక త్రోవలో రామచంద్రుఁడు దారపిల్లి నపుడు తలుపుచాటునకైనను, గోడమూలకైనను నొదుఁగుచు వచ్చెను. రామచంద్రుఁడు దన స్నేహితులు దన్ను బార్వతిమగఁ డనుటచేతఁ గొంచెము సిగ్గుగల్గి తానేవస్తువైనఁ బార్వతి నడుగవలసి వచ్చినపుడు ముఖావముగా నడుగుచు వచ్చెను. ఆమెయు గోడచాటున నుండి ముసిముసినవ్వు నవ్వుచు ముఖావముగనే ప్రత్యుత్తరముఁ జెప్పుచు వచ్చెను.

అది యట్లుండ శరభరాజుగా రొకనాఁడు మధ్యాహ్నము నిద్ర లేచి గదిలో మంచముమీఁదఁ గూరుచుండఁగా గృష్ణవేణమ్మ తలుపు నకుఁ జేరగిలఁబడి నిలుచుండెను. వేంకటరత్నముకూడ నక్కడ నొక బల్లమీఁదఁ గూర్చుండెను, వా రిట్లు మాటాడిరి.

శర : ఏమిరా వేంకటరత్నము? జ్యేష్ఠమాసమునందుఁ దప్పకుండఁ బార్వతికి వివాహము జేయవలెను. రామచంద్రున కియ్య దము నీ కిష్టమేనా?

వేంక : నాయిష్టము చెల్లగలదా? అదిగో మావదిన యున్నది గదా? ఆమె నడగండి.

కృష్ణ : నామాట పాటికి రాదు. మీయన్నగారు మీరు నాలో చించండి మీ కిష్టమైన సంబంధము,

శర : అయ్యో! మనమందరముఁ గూడబలుకు కొనవద్దా? వాఁడు సద్గుణములు గలవాఁడు. బుద్ధిమంతుఁడులాగే కనుపడుతాడు.

వేంక : అగపడుటమాత్రమే. నామనమున కతని కియ్య డము మంచిదికా దని తోఁచుచున్నది. ఏమిటండీ కూడు గుడ్డ లేక యిల్లువాకిలి లేక పొట్టకూటికిఁ జేరిన నిర్భాగ్యునకు మాణిక్యము వంటి పిల్లను గట్టిపెడుతామంటారు ? ఎవ్వరైన నవ్వరటయ్యా ? యావజ్జీవ మాపిల్ల మన జీవమున కుసూరుమనిపోదా ?

శర : అదృష్ట మున్నపక్షమున వాఁడే బాగుపడుతాఁడు. లక్ష రూపాయల యాస్తి యున్నవాని కిచ్చిన, నదృష్టము చాలకపోతే ముష్టిచెంబు చేతికి రాకమానదు.

వేంక : ఏలా గాలోచనచేసినను సరే. పిల్ల యుపేదది. కష్టమున కోర్వలేదు. పనిపాటలు చేయునక్కరలేకుండ నుండే యిల్లుచూచి యియ్యండి.

ఇంతలో రాజగోపాలము వచ్చి 'బాబయ్యా ! నాగరాజు మామగారు వచ్చినారు' అని చెప్పెను. తోడనే శరభరాజుగారు కృష్ణవేణమ్మను లోపలికి వెళ్ళుమని తా నెదురుగాబోయిఁ మూలనున్న తివాసి వేంకటరత్నముచేతఁ జావడిలో వేయించి నాగరాజుగారిని జూచి 'బావగారూ ! దయచేయండి' యని తివాసిమీదఁ గూర్చుండ బెట్టెను. వారి కీ క్రింది సంభాషణ జరిగెను.

శర : బావగారూ ! అక్కయ్య పిల్లలు సంతోషముగా నున్నారా !

నాగ : మీదయవల్ల బాగున్నారు. మీకు శరీరములో సుఖ ముగా నున్నారా ?

శర : సుఖముగానే యున్నది ! మీ రేపనిమీద దయచేసి నారు ?

నాగ : పని యేమున్నది ! మీరుపిల్ల కార్య మీయేఁడు చేయవలెనుఁ గదా ! మీకు మాకు మూడుతరముల నుండి సంబంధ ములు విడిపోకుండఁ గలపి వచ్చుచున్నవి. మాకంటె మీకత్యా వశ్యులు వేరే లేరు. మీ యిష్టము వచ్చిన యంత వరదక్షిణ యిచ్చి మీ పిల్లను మాపిల్లవాని కియ్యండి.

వేంక : ఔను. వీరిపిల్లవానిని నేను జూచినాను. మన పార్వతికంటె నాలుగేండ్లు పెద్ద కాని పిల్లవాఁడు కొంచెము పొట్టి. కుఱ్ఱవాఁడు తెలివిగలవాఁడు.

శర : ఏమి చదువుకొను చున్నాఁడు? ఆంధ్రమా? గీర్వాణమా?

నాగ : చదువున కేమి? నాలుగేండ్లాయినది. రఘువంశ మారంభించినాఁడు. కాని మధ్యమధ్య నభ్యంతరములు వచ్చి మానుటచే విస్తారము చదువ లేదు. అయినను వాని యీడునకు దగిన చదు వున్నది.

శర : ఈయేఁడు వివాహము చేయుట తప్పదు. ఒక నెల లోగా మీకు వర్తమానము నంపుతాను.

నాగ : మీ యమ్మగా రెక్కడ నున్నారు?

వేంక : ఆమె పరున్నది. నేను వెళ్ళి లేపుతా నుండండి.

అని వెళ్ళి వేంకటరత్న మన్నపూర్ణమ్మను లేపి నాగరాజుగారు వచ్చినారని చెప్పఁగానే యామె లేచి యొక గదిలోనికి వెళ్ళి రెండు రెక్కతలుపులలో నొక తలుపు తీసి రెండవతలుపు చాటునఁ గూర్చుండెను. అంతలో నాగరాజు వచ్చి గదియవతల గోడదగ్గఱ గూర్చుండెను. తోడనే యన్నపూర్ణమ్మ యెలుగెత్తి 'అయ్యో! కూఁతురా! యెంతపనిజేస్తివే యమ్మా! నా కడుపులోఁ జిచ్చుపెట్టిపోతివే యమ్మా' యని రోదన మారంభించెను.

నాగ : అత్తా! ఊఱుకో ఇది యొకనాఁటితో బోయేదికాదు. నీ వున్నన్నాళ్ళు నీలాగున నుండేదే. పెద్దవాన వైనందుకు వాళ్ళ చేతిమీఁదుగా నీ ముప్పు దాఁటలేదు.

అన్న : నాగరాజుతండ్రీ! చెట్టంత బిడ్డను దిగమ్రింగి సిగ్గు లేక తిరుగుచున్నాను.

నాగ : నీవు కడు దుఃఖింపకు. ఆ పిల్లలను బెట్టుకొని కాల

క్షేపము చేయవలయునుగాని దుఃఖపడితే కార్యమేమున్నది? చచ్చిన వాళ్ళు లేచిరారుగదా!

అని నాగరాజు జెప్పఁగా విని దుఃఖమును జాలించి గద్గద స్వరముతో నన్నపూర్ణమ్మ "నాయనా! కుఱ్ఱవానికిఁ బెండ్లయినదా? నా కేసంగతి దెలియడము లేదు" అనెను.

నాగ: కాలేదు. శరభరాజుగారితోఁ జెప్పి మీ పార్వతిని మా పిల్లవాని కిప్పింపు. కలపినసంబంధము విడగొట్టగూడదు.

అన్న: శరభరాజు పెండ్లాము నున్నారు. వాళ్ళ యిష్టమే గాని నా పెత్తనమేమున్నది? సగముజచ్చి నేనున్నాను. మునుపటి యన్నపూర్ణమ్మను గాను నా మాట వింటారా నాయనా? లోపము లేకుండ జెపుతాను.

నాగ: సరే! యోగమున్న పక్షమునఁ గాకమానదు. నేను వెళ్ళుతాను.

అని చెప్పి శరభరాజుగారి యొద్ద సెలవుదీసికొని వెళ్ళిపోయెను.

అన్నపూర్ణమ్మ యేడ్చిన కారణ మిది. అప్పటికి రమారమి పదునొకండు సంవత్సరముల క్రిందట అన్నపూర్ణమ్మ కుమార్తె పార్వతి చనిపోయినది. అప్పటినుండి నాగరా జెన్నఁడు నామెను జూచి పరామర్శ చేయలేదు. కుమార్తె పోయిన తరువాత నాగరా జామెను జూచుట కదే ప్రథమము గావున తన కుమార్తె యా దినము ననే చచ్చినట్లు రానిదుఃఖమును దెచ్చుకొని యొకవిధముగా నన్న పూర్ణ సంప్రదాయమును నిలిపెను.

తరువాత జాము పొద్దుండగాఁ జుట్టుపక్కలనున్న స్త్రీలం దఱు శరభరాజుగారి యింటి కెప్పటివలెనే వచ్చుచుండిరి. అన్నపూ ర్ణమ్మ తలపికోటదగ్గఱ తాటియాకుల వత్తులపెట్టె ముందుంచుకొని వత్తులు చేసికొనుచుండెను కృష్ణవేణమ్మ మొక్కలపీటమీఁదఁ గూర్చుండి నరసింహామునకు జడవేయుచుండెను. అప్పుడు రంగమ్మ వచ్చి యిట్లనెను.

రంగ: అన్నపూర్ణమ్మత్తా! నీ మనుమరాలికిఁ బెండ్లివారు వచ్చినారఁట. చెప్పవైతివి?

అన్న: ఏమి గడుసుదానవే యమ్మా! ఇంకను వచ్చికూర్చో నైన లేదు. ఇంతలోనె యెప్పుడు చెప్పను?

రంగ: అయినా మనుమరాలి పెండ్లిముందర నీకుఁ గనఁబడతామా యేమిటి?

అన్న: మరే. పెండ్లంతా నామొగముమీదనే నడుస్తుంది. మధ్య నాకు గర్వమెందుకు? అవుమాడ యుండగా గుంజార్చినదఁట.

రంగ: అలాగన కత్తా! పెద్దదానవు. ఈ చలనంతా నీది. నీ తరువాతనే యెవరైనా. అయితే యేమి నగలు పెడుతామన్నారు?

అన్న: నాకుఁ దెలియదు. అసంబంధము వీరికి సరిపడదమ్మా. మాయింటనున్న రామచంద్రున కిస్తారఁట. ఈలాటి సంబంధము దొరకదని కోరి తెచ్చినారు.

ఇంతలో మంగమ్మ వచ్చెను.

రంగ: మంగమ్మా! విన్నావఁటమ్మా. వీళ్ళ పార్వతిని రామచంద్రుఁడను పిల్లవాని కిస్తారట.

మంగ: (బుగ్గను జేయిబెట్టుకొని) ఆ యెట్టిపిల్లవానికా? ముష్టి సంబంధ మదేమి సంబంధమమ్మా! కొంచెమయిన యింటి వానికిఁ బిల్లనియ్యవలెనుగాని వీని కేమిటి! పిల్ల యేమిటి!

అప్పుడు పాపమ్మ వచ్చి కూర్చుండి యిట్లు మాట్లాడ నారంభించెను.

పాప: కృష్ణవేణమ్మా! నీ కూతుని రామచంద్రున కియ్యడము నిజమేనా?

కృష్ణ: నా కేమి తెలుసును? మా యత్తగా రున్నారు, తల్లి కొడుకులు యోజించి యెవరి కిచ్చుకుంటారో నా కెందు కమ్మా! నామాట వినేవా రెవరు?

అన్న: పైకి నాపెత్తనము, మగడు పెండ్లాము కూడబలుకు కొని చేస్తారమ్మా. నామాట లక్ష్య మెవరికి? నే నింత పిడచదాననే.

రంగ: నీ కేమి! యదృష్టవంతురాలవు. మనుమలు, మనుమ రాండ్రు. నీ కేమమ్మా?

ఇంతలో శరభరాజుగారు వచ్చి 'అమ్మా' యని పిలువగానే తల్లి వెళ్ళిపోయెను.

అప్పుడు కుడిపైఁటను వేసికొని జానకమ్మవచ్చి "కృష్ణవే ణమ్మా! నీ కుమార్తెకు బెండ్లిచేస్తారట, మీవారి బొట్టి కరఁగు తుంది" యనెను.

కృష్ణ: నా బ్రతు కేలాగు నున్నదో వివాహ మాలాగున్నది.

రంగ: ఓబిడ్డో కృష్ణవేణమ్మ! మీయింటి కెవరమ్మా వచ్చి నారు? అప్పు డేడ్చినవా రెవరు?

కృష్ణ: మాయింటికి బంధువులు వచ్చినారు, మా యత్తగారి కుమార్తె పోయిన తరువాత నామెను పరామర్శ చేయలేదు. అందు చేత నాబిడ దుఃఖపడినది. జానకమ్మా! యేమైన పాటలు పాడుదూ, నీ కంఠము బాగా సన్నముగా నుంటుంది.

రంగ: లంకాయాగము పాడవో.

మంగ: గోవింద నామములు పాడ వమ్మా! నీకు బాగా వచ్చును.

పాప: సీత సమర్త పాడవమ్మా. కొంతసేపది పాడి, తరు వాత దక్షయియజ్ఞము పాడవచ్చును.

జాన: మీరు పడుచువాళ్ళు; పడుచుపాటలు పాడమంటారు. కృష్ణా రామా యని రెండుముక్క లనుకోవియ్యారుగదా! తరణో పాయము చూచుకొన వద్దటమ్మా. గోవింద నామములు పాడుతాను. మొన్న పాడి వదలిపెట్టిన దగ్గఱ నుండి పాడుతాను.

'ఉగ్రుఁడై శత్రుఘ్నుడు గోవిందారామ
కండ్లెఱ్ఱజేసెను గోవిందా
కండ్లుతెఱవని పసిబాల గోవిందారామ
శ్రుతకీర్తి కడుపగునేమో గోవిందా'

అంతట పాటలు వినకుండనే పాపమ్మ యిట్లుమాట్లాడ నారంభించెను.

పాప : మంగమ్మ ! నీకూఁతురుకు నెల దప్పినదట నిజమే నేఁటో !

మంగ : అప్పుడే యేలాగు తెలిసినదమ్మ ? ఎంత దాఁచవలెనన్నను దాగదు. మాకర్మము. నీకు వీరమ్మ చెప్పినదాయేమి ? పెద్దదిగదాయని వీరమ్మతోఁ జెప్పినాను.

రంగ : వింటేనేమమ్మా ? ఇంతలో తప్పా ? విని సంతోషించే వాళ్లముగావి విచారింపము. శోనీ ! మా కెందుకమ్మ. జానకమ్మ ! పాట పాడవమ్మా. ఈగొడవ లెప్పుడు నీలా గుండేవే,

పాప : నీకు మనుమరాలు పుట్టినపక్షమున నాకొడుకున కిప్పించవమ్మా. కలపినవాళ్లము.

మంగ : నీ కొడుకు పాతికేండ్లవాఁడు. ఏలాగున నియ్యగలమమ్మా ?

పాప : అ దొకపెద్దటమ్మా ! నామగనికి నాకు ముప్పయి ఏండ్లుహెచ్చుతగ్గు. నే నారునెలల పిల్లనైయుండగా మాతల్లి నన్నుచేతిలోఁ బెట్టుకొని పెండ్లిచేసినది.

మంగ : మాపిల్లనుమే మియ్యము. మీ కున్నభాగ్యమునకు దోడు పిల్లకూడావా ?

పాప : (కోపముతో) నీపిల్ల ఎంత ? నీ వెంత ? ముష్టిపిల్ల యెవరికి గావలె పీభాగ్యము నీది. నాభాగ్యము నాది. నాకొడుకు పెండ్లిగాకపోతే బ్రహ్మచారియై యుంటాఁడు.

మంగ : బ్రహ్మచారికాకపోతే సన్యాస మిప్పించుకో. నాకేమి?

సావ : అట్లే మాటలు రానీకు. కావలిస్తే నీకొడుకునకు సన్యాస మిప్పించుకో. (కృష్ణవేణమ్మవైపు దిరిగి) చూచి నారమ్మ. నే నన్నమాటలలో తప్పేమున్నది? లోప ముంటే నానోటిలో గడ్డి పెట్టండి.

మం : కృష్ణవేణమ్మగారు! దీనికి వచ్చిన యేం డ్లెవరికి వచ్చినవమ్మా? ఆబిడన్నమాటలు విన్నారా?

కృష్ణ : ఆలు చూలు లేదు. కొడుకుపేరు సోమలింగ మన్నట్లు. మొదలు పిల్లపుట్టనైనా లేదు. దెబ్బలాట లెందుకు? ఊరుకొండమ్మ. అవతల చావిడిలో మామా రున్నారు. నాగొంతుఁ బిసిగి చంపుతాడు.

మంగ : నే వెళ్ళిపోతానమ్మా! సాయంకాలమైనది సందె గుమ్మము లూడ్చుకోవలెను.

అట్లు మూర్ఖురాండ్రగు స్త్రీలు వృథా ప్రసంగములతోడను, వ్యర్థకలహములతోడను, నసంబద్ధ ప్రలాపముల తోడను కాలము గడిపి యిండ్లకుఁ బోయిరి.

అన్నపూర్ణమ్మకు రామచంద్రునియందు గోపము నిర్హేతుకము గానే వచ్చినది. రామచంద్రునియం దేమి లోపము లేకున్నను వేంకటరత్నముతోడి సహవాసముచేత నతనికిఁ గొన్ని క్రొత్త కష్టములు గూడ వచ్చెను.

ఒకనాడు జాము ప్రొద్దెక్కిన తరువాత, శరభరాజుగారు సావడిలో గూర్చున్నపుడు బ్రాహ్మణుఁ డొకఁడు విరిగిన కంచెను జేతపట్టుకొని, తాను మూడఁదీసిన యొక యుంగరమును బుచ్చుకొని యతి త్వరితముగా వచ్చి శరభరాజుగారి యెదుట నిలచి యీ ప్రకారముగాఁ జెప్ప నారంభించెను.

బ్రాహ్మ : అయ్యా. శరభరాజుగారు! చూచినారా! మీ యింటనున్న పిల్లవాఁడు చేసినపని.

శర : ఎవరు? మా రామచంద్రుఁడా? ఏమిపని చేసినాఁడు?

బ్రాహ్మ : రెండునెలల క్రిందట నా కొకకంటెను, తాయి చెక్కిన యుంగరమును దెచ్చి యమ్మినాఁడు. ఆపిల్లవాఁడు మీ యింటిదగ్గఱ నున్నవాఁడేగదా యని నేను సందేహింపక యావస్తువులను గొన్నాను. ఇది కరఁగించ నిత్తడివస్తువై పోయినది. ఇత్తడికంటె నా కమ్మినాఁడు. ఇది వజ్రమని యుంగరములో తాయి చూపించినాఁడు. ఇదిగో గాజు తాయి. నాకొంప త్రవ్వినాడు. ఆయవాచము జేసిచేసి యార్జించిన సొమ్ముపెట్టి యీనగలు కొను క్కొన్నాను.

ఈమాటలు వినఁగానే శరభరాజుగా రాశ్చర్యపడి, రాజ గోపాలమును బిలిచి యతని కేమయిన నీసంగతి దెలియునేమోయని యడిగెను. కాని యతఁడును మహాశ్చర్యనిమగ్నుఁడై తా నెఱుఁగ నని చెప్పఁగా రామచంద్రుఁడు స్వచ్ఛమైన మనస్సుతోను, భయముతో వెలవెల బాఱు మొగముతోను వచ్చి శరభరాజుగారి యెదుటఁ గూర్చుండెను. అతనిఁ జూడగానే బ్రాహ్మణుఁడు గుండె బాదుకొని "ఎంతవాడవురా నాయనా! నాకొంప త్రవ్వినావురా" యనియఱచెను. శరభరాజుగా రావస్తువును చేతబట్టుకొని యతనిమీఁద వచ్చిన యా నేరము నంతను జెప్పి యిట్లని మాటలాడ నారంభించెను.

శర : రామచంద్రుఁడూ! ఈవిషయములో నిజము చెప్పు. ఈవస్తువుల నీ బ్రాహ్మణున కమ్మినావా లేదా?

రామ : ఆవస్తువులను నేనీ బ్రాహ్మణునకు విక్రయించినాను.

బ్రాహ్మ : చిత్తగించండి. నే నబద్ధ మాడలేదు, అయ్యో! అయ్యో! చంపినావురా.

రామ : వేంకటరత్నముగారిని బిలిపించండి. రాజగోపాలము! వేంకటరత్నముగారిని దీసిగొనిరావయ్యా!

అని రామచంద్రుఁడు చెప్పగా రాజగోపాలము వేంకటరత్నమును దీసికొని వచ్చెను.

రామ : అయ్యా ! నేను దీనిరహస్య మంతయు మీకుఁ దెలియఁ జెప్పెదను. వినండి. రెండు నెలలక్రిందట నొకరాత్రి నేను దీపము వెలుగునఁ గూర్చుండి చదువుకొనుచుండఁగా. వేంకట రత్నముగారు నన్నుబిలిచి సూర్యనారాయణగారి చేతిలోనుండి యీ వస్తువులను బుచ్చుకొని నన్నమ్మిపెట్టమన్నారు.

వేంక : ఛీ ! నోరు ముయి. నామీఁద—

శర : (మాట కడ్డము వచ్చి) ఆతఁడు చెప్పదలచుకొన్న దంతయుఁ జెప్పనిమ్ము. ఆ సూర్యనారాయణ యెవరు? అతని దే గ్రామము ! వారి యింటిపేరేమి ?

రామ : ఆయన యింటిపేరు నే నెఱుంగను. ఆయన కోటి పల్లి కాపురస్థుడనియు. మిక్కిలి గొప్పవాఁడనియు. నాతో వేంకట రత్నముగారు చెప్పి నాచేత నీ వస్తువుల నమ్మించిరి.

శరభ : వేంకటరత్నము నీ వేమెఱుగుదువు ?

వేంక : అన్నయ్యా? వస్తువులను గొన్నవాఁడు దగ్గఱ నున్నాడుఁగదా। నే నమ్మినానో బేరముచేసినానో యందులో నా జోక్యమున్నదేమో కనుగొనుఁడు. నే నిందులో నా ప్రమాణముగా నేపాపము నెఱుఁగను. ఆ సూర్యనారాయణ యెవరో యిప్పుడు విన్నాను.

రామ : నా ప్రమాణముగ నే నింతకంటె నేమియు నెఱుఁ గను. ఆ వస్తువులు నావికావు. నన్ను మీ చిత్తము వచ్చినట్లు శిక్షచేయవచ్చును. కాని న్యాయము కనుగొనండి?

బ్రాహ్మ : అయ్యో ! ఈ పనియంతయు రామచంద్రునిదే కాని మఱియొకరిది గాదు. వేంకటరత్నముగారు దీనిలో నేమియు నెఱుఁగరు.

రాజ : బాబయ్యా ! ఈ విషయము పూర్తిగా విచారించిన గాని యేపని జేయవద్దు.

శర : విచారించుట కేమున్నది ? వస్తువు అమ్మినవాఁడు

రామచంద్రుడే. ఇటువంటి దొంగపిల్లవానిని మన యింట పెట్టు కొనుట మనకు ముప్పే.

వేంక : మహారాజులాగ మే మింత యన్నము, బట్టపెట్టి సంరక్షణ జేయుచున్నందుకు దినియుండలేక దొంగపని జేయమొదలు పెట్టినాడు. తినగా దినగా గారెలు చేదైనవట. ఓరి రామచంద్రుడు! నీకింత డబ్బు కావలసినపక్షమున వారి నడిగితే వారే యిత్తురుగదా. దొంగగడ్డి దిని నామీదగూడ నేరము పెట్టవలెనని యనుకొన్నావు. నేను లేచినవేళ మంచిదే.

బ్రహ్మ : ఓరి దిక్కుమాలిన ముండాకొడుకా! నాకు నీవు డబ్బెక్కడనుండి యివ్వగలవు? శరభరాజుగారూ! మీ రింటిలోనుండి యీ నిర్భాగ్యుని లేవగొట్టివేసెదరు సరే. నా డబ్బుమాట యేమిటి? నే నింక నీళ్లు వదలుకొనవలసినదేనా?

శర : నే నేమి చేయను?

బ్రహ్మ : అయ్యో! అయ్యో! నూటయేబది రూపాయలు నీ పిండాకూడుమీద బెట్టినాను. నీ జీవమున కుసూరున నేడ్చుచున్నాను (అని యేడ్వజొచ్చెను)

ఇంతలో నొకదాసి చేతితో జీటి పట్టుకొనివచ్చి 'రామచంద్రుడుగా రెక్కడనున్నారండి' యని యడిగెను.

శర : ఎందుకు? ఆ చేతిలోని చీటి యేమిటి?

దాసి : మా యమ్మగా రుత్తరమిచ్చినారు. ఆయనకేగాని నేనియ్యను.

శర : మీ యమ్మగా రెవరు? నీ వెవరి దాసివి!

దాసి : చంద్రముఖమ్మగా రిచ్చినారు. ఆయన యెక్కడండీ?

శర : ఆ చీటి యీలా గియ్యి. (అని లాగికొని చదువుచున్నాడు) "ప్రాణేశ్వరా! మీరు వ్రాసిన యుత్తర మందినది. ఈవేళ సాయంకాలము మీరును రాజగోపాలముగారును రావచ్చును.

వేంకటరత్నముగా రవు డింటివద్ద నుండరు." (అని చదివి) యిదేమిటి? భోగముదాని కుత్తరము వ్రాపి తెప్పించుకొనుటఁగూడ సాగించినావు? విధవా! రాజగోపాలము! అతఁడు. నీవు జేసిన స్నేహమిందుకా? ఓరీ! దౌర్భాగ్యుఁడా! ఆ విధవను గూడి చెడి పోయినావా?

రామ: అయ్యా! నే నెన్నఁడు దాని కుత్తరము వ్రాయలేదు. ఇది యంతయు వేంకటరత్నముగారి మాయోపాయము. నే నేమియు నెఱుఁగను.

శర: వేంకటరత్నము! ఇతఁడు వ్రాసిన యుత్తరముతోఁ గూడఁ జంద్రముఖిని దీసికొనిరా!

తోడనే వేంకటరత్నము రామచంద్రునికి జరిగిన మహా పరాభవమునకు సంతోషించుచుఁ దనప్రియురాలిని బిలుచుకొని వచ్చి వారి యెదుట నిలువఁబెట్టెను.

శర: ఏమి చంద్రముఖీ! నీ కితఁడుత్తరమును వ్రాసినాఁడా?

చం: (తలవంచి) వ్రాసినారండీ. ఇదిగో.

శర: (చీటి బుచ్చుకొని యిట్లు చదివెను)

"నీవు నా కీవేళ నొక్క మారు మొగము చూపించి తిరిగి లోపలకు వెళ్ళినావు. నీతో మాటాడవలెనని యున్నది. నీకు వీ లెప్పుడో దెలియఁ జేసిన పక్షమున నేను దప్పక వచ్చెదను. నీతో మాటాడకుండ నే నుండలేను."

ఈ వెనుకటి యుత్తరమును జదువగానే శరభరాజుగారు రామచంద్రునితో నిట్లనెను.

శర: రామచంద్రుఁడూ! నీ వ్రాఁత యవునా కాదా?

రామ: వ్రాఁత నాదేకాని, వేంకటరత్నముగారు దన మేనల్లునకు నాచే వ్రాయించినారు. పై పేరును గ్రింది వ్రాలు నక్కఱలే దన్నారు.

చంద్ర: ఈ యుత్తరము నా కీదాపి పట్టుకొనివచ్చినదండీ.

శర : ఏమే! దాసిదానా! నీకీయుత్తర మెవ రిచ్చినారు?

దాసి : ఆ బాపనయ్య నాచేతి కిచ్చి మాయమ్మగారి కిమ్మన్నా డండి.

శర : ఏగుణము లున్నను దొంగతనము, లంజతనము లేక పోతే భరింపవచ్చును. కాని యవి యున్న వానివి భరింపలేము. రామచంద్రుడూ! ఈ దినము మొదలు నీవు మాయింట నుండవద్దు. నీ దారి నీవు చూచుకో.

ఆ మాటవినఁగానే రామచంద్రుఁడు దనమీఁదఁ బిడుగువడి నట్లు దేహ మెల్ల ఝల్లుమన దుఃఖము బట్టజాలక వీధిలోనికి లేచి పోయెను.

ఇంతలో విశ్వనాధశాస్త్రులుగా రీసంగతి యంతయు విని వచ్చి కోపావేశముతో నోటమాటరాక యున్న శరభరాజుగారిని జూచి మాటలాడుట కది సమయము గా దని కొంచెము సే పూరకుండెను.

శర : ఎంతపనిఁ జేసినాడండీ! ఏమో మంచివాఁడను కొన్నాను.

వేంక : నేను మొదటినుండి యాలాగే యనుకొన్నాను. వాని నాలిముచ్చు గుణములు, నంగినంగిమాటలుఁ, దొంగ దొంగ చూపులు నక్కవినయములుఁ జూచి వీఁ డుత్త తుంటరియని నే నిది వరకే యనుకొన్నాను. మీరే పొరపాటుపడినారు.

విశ్వ : ఇంతపనిఁ జేసేవాఁడు కాఁడు, చిన్నతనముచేఁ బొర పడవచ్చును.

వేంక : చిన్నతనమా? వాఁడెక్కడి చిన్నవాఁడు? టంకం ధరణమేండ్లున్నవి. పిద్దాన్నము బొర్లదోసికొన్నాఁడు. మీదుమిక్కిలి రాజగోపాలమునుగూడఁ జెఱచుచున్నాఁడు. ఇంతఃదిని యింటివాస ములు లెక్క పెట్టినాఁడు. ఎంతబాగుచేయఁ దలఁచుకొన్నాము, వానికి యోగము లేదు.

శర : మాపార్వతి గొంతుకఁ గోసినానుగాను. నయమే!

నామెత్తఁదనము లోకువగట్టి యిష్టమువచ్చినయాట లాడినాఁడు. దొంగతనము దాఁగదండి. చిత్రము!

వేంక : ఎప్పటికయినఁ బాపము బ్రద్దలవక మానదు.

బ్రాహ్మ : అయ్యా! నే సెలవు దీసికొని వెళ్లనా? శరభ రాజుగారు! నాకర్మ మింతే. ఈముండకొడుకు నాకొరకు దాఁపరించి నాఁడు.

అవి వెళ్ళెను.

అందఱును రెండుజాములయినందున భోజనములకులేచిరి.

వేంకటరత్నము మాయోపాయమునందుఁ దనకుగల ప్రజ్ఞను జూపించి యిత్తడివస్తువును, గాజురాయివేసిన యుంగరమును రామ చంద్రునిచేత నమ్మించి రామచంద్రుఁ డాదినమున వ్రాసిన యుత్త రమును దాఁచి తుద కాలాగునఁ జంద్రముఖి కతఁడు వ్రాసినాఁ డని చెప్పి విపత్సముద్రము త్రవ్వి యందులోఁ గుఱ్ఱవానిని పడవైచి కృతకృత్యుడై సఫలమనోరథుఁడై సుఖముగా నుండెను.

రాజగోపాలం మాత్రము కంటెను రామచంద్రుఁడమ్మటచేతను, జేటిలోనున్న వ్రాఁతయతనిదే యగుటచేతను, రామచంద్రుని మీద గొంచె మనుమానపడుచు,యతనట్టివాఁడు కాఁడని దృఢపరచుకొనుచు, దండ్రిగారు దగిన విచారణజేయక తొందరపడినారని నొచ్చుకొనుచు, స్నేహితునికొఱకు విచారించుచు, దనమీదఁగూడనింద వచ్చినందులకు సిగ్గుపడుచుఁ దండ్రిగారు భోజనానంతరమున నిద్రించునపుడు విశ్వనాథ శాస్త్రిలవారి వీథియరఁగుమీదఁ గూరుచున్న రామచంద్రునియొద్దకు మెల్లమెల్లగాబోయి యతనియొద్దఁ గూరుచుండెను. రామచంద్రుఁడును సిగ్గుచే వంచినతలయెత్తక నేత్రములనుండి బాష్పములురాల గోడకుఁ జేరగిలబడి యుండెను. రాజగోపాలము కూడ మిక్కిలి విచారిం చుచుఁ దుదకు దానే ముందుగాఁ బలుకరించెను.

రాజ : రామచంద్రుఁడూ! ఎందుకు విచారించెదవు? కాల వశముగాని నీలోపము లేదు. ఇదిగో, జరిగినసంగతి నీ వాముూలాగ్ర

ముగ నాకుఁ దెలియజెప్పు. స్నేహితుల దగ్గర దాఁచవలసిన సంగతు లుండవుగదా!

రామ: రాజగోపాలమూ! నీకుఁ గూడ నామీద ననుమాన మున్నదిగదా! ఈవిషయమునం దేదోషమునాయందు లేదు.

అని రామచంద్రుఁడు యావద్వృత్తాంతమును రాజగోపాలమునకు దెలియఁ జెప్పెను. అది విని రాజగోపాలమిట్లనియె.

రాజ: బాబయ్య తొందరపడినాఁడు; చక్కఁగా నాలోచింప లేదు.

రామ: నన్ను మీరింటినుండి పొమ్మనుటలో నాకన్నవస్త్రములకు లోపము వచ్చినదని విచారములేదు. లోకములో నామీఁదవచ్చిన యీనింద యాచంద్రతారార్కమును బోదుగదా యనియు నన్నందఱు దుర్మార్గుఁ డనుకొందురనియు నాకు విచారముగా నున్నది. దాదాపుగా రెండుసంవత్సరములు మీయింట నున్నను శరభరాజుగారు నాగుణ మంతమాత్రము తెలిసికొనలేకపోయిరి. పయిగా నిన్ను గూడఁ బాడుచేయుచున్నా నని యన్నారు. ఈవిషయమై నేనేమియు నెఱుఁగను. వేంకటరత్నము చేయుచున్న మాయ నెఱుఁగక యందులో బడిపోయినాను. ఏ మొగము బెట్టుకొని యీ గ్రామమందుందును? నన్నెవ్వరు గుమ్మములోనికి రానియ్యరు. నాకర్మగతి యింతమట్టుకు వచ్చినది. ఈ యవమానమును నేభరింపజాలను! ఈ గ్రామమునుండి ఈ వేళనే వెళ్ళిపోయెదను. (అని కన్నీళ్ళు దెచ్చుకొని) నాకు దమ్మునివలె నున్న నిన్ను విడిచి యేలాగునఁ బోగలను! నేఁటికి నేనమలాపురమునకు దొంగనయినాను. నాకు నేటితో ఋణము దీరినది. నేను జేసిన తప్పు లన్నియు క్షమించి నామీఁదఁ గటాక్ష ముంచు.

రాజ: (కన్నీళ్ళతో) రామచంద్రుఁడూ! నీవు నన్నేలాగున వదలఁజాలకున్నావో నేను నిన్నాలాగునే వదలలేకున్నాను. మనల విద్దఱిని దైవ మింత క్రూరముగా నెడఁబాపినందులకు నాదుఃఖమునకు బరిమితిలేదు. నీ సద్గుణములు, నీప్రవర్తన నేను మఱువఁ

గలనా ? నేను నిన్ను క్షమించుటకు నీవు నాకెన్నడు నే యపరాధము జేయలేదు. నిజము నిలకడమీఁద దెలియును. గ్రామమున నిం కెవ్వరికి ననుమానము లేదు. నీ వీదినమున విశ్వనాథశాస్త్రులవారి యింట భోజనము చెయ్యి. నాతోఁ జెప్పకుండ నీవీగ్రామము వదల బోకు. సాయంకాలము నీకు నేనేసంగతియు వర్తమానము పంపె దను. మా బాబయ్య లేచేవేళ యయినది. నేను వెళ్ళవలెను. అని వెళ్ళెను.

రామచంద్రునకు జరిగిన మహావమానమునకు నాతని స్నేహి తులు జాలిపడుచుండగా శోభనాచల వేంకటరత్నములు నిర్విచార ముగా నుండుటయే గాక తమకతఁ డదివఱకుఁ జేసిన యపకారము నకు వాని కొరకమాలు కొట్టవలెనని నిశ్చయించిరి గాని శరభరాజు గారియింట నున్నంతకాలము వారికి వీలయినది కాదు. నేఁడు రామ చంద్రుఁడు శరభరాజుగారి యింటినుండి వెళ్ళిపోవుటచేత వారి స్వాధీనమయ్యెను.

రామచంద్రుని సంగతి యంతయు విని కొందఱు వచ్చి యాతని జూచి పరామర్శచేసిరి. కొంద అతని స్థితికి విచారించిరి. విశ్వనాథశాస్త్రులవారు రామచంద్రుని కొంచెము బ్రతిమాలి లోపలికి దీసికొనిపోయి యన్నము బెట్టించిరి. శరభరాజుగారి యింట రామ చందుఁద్రుఁ డున్నప్పు డతనియొద్దకు వచ్చి యిచ్చకములాడు వారంద ఱును దనకుఁ బ్రాణస్నేహితులవినవా రందఱును లేశమును వానికి సహాయము జేయరైరి. రామచంద్రుఁడు సద్గుణుఁడనియు సత్ప్రవర్తన గలవాఁ డనియు స్తోత్రముఁ చేసినవా రిప్పు డితడు మహా దుర్మార్గుఁడని నిందించిరి. అప్పుడు సాయంకాలము కాఁగా దేవ దర్శనము చేసి రామచంద్రుఁడు శాస్త్రిలవారి వీధియరఁగుమీఁదఁ గూర్చుండఁగా నతని సహాధ్యాయుఁ డొకఁడు వచ్చి రామచంద్రునితో నిట్లు మాటాడెను.

సహా : రామచంద్రుఁడూ ! నీకుఁ దటస్థమయిన మహాపదను గుఱించి నాకు విచారముగానున్నది. నీవమలాపురంలోనే యుందువా? ఎక్కడికయినను బోఁదలంచుకుంటివా ?

రామ: నే నీరాత్రి ముక్తేశ్వరము వెళ్ళిపోతాను. ఈ యవమానమును నేను భరింపలేను.

సహా: నిజమే. నా మాట విని నాలుగు గడియల రాత్రి యయిన తరువాత బయలుదేరి ముక్తేశ్వరము వెళ్లు. ఇంక నీ వీ గ్రామమునం దుండఁగూడదు. నీకు నేనొక యుపాయమును జెప్పఁ దలంచుకొన్నాను. నీ క్షేమముకొఱకే. నీ యిష్టమైన పక్షమున వినుము.

రామ: అయ్యో! వినకేమి? ఈ సమయమునందు నా మేలు గోరువారు రాజగోపాలము, నీవుగాక యింకెవ్వరు?

సహా; నాతో గూడ రా.

అని చెప్పి యతఁడు రామచంద్రుని జెఱువుగట్టునకుఁ దీసికొనిపోయి యొక చెట్టుక్రింద గూర్చుండఁబెట్టెను. సందెచీకటి గనుక మొగమున మసిబూసికొని యిద్దఱు మనుష్యులు కఱ్ఱలు బుచ్చుకొని తప్పతాగ్రి దనకంటె ముందుగా వారి రాకను దెలియఁజేయ వచ్చి గట్టుక్రింద గూర్చున్న సహాధ్యాయుని బట్టుకొని తలమీద దయాదాక్షిణ్యములు లేక కొట్టుచుండిరి. అప్పుడు సహాధ్యాయుఁడు "నేనురో! కొట్టకండిరో" యని కేకలు వేయుచున్నను స్మారకము తెలియదు గనుక వారి కామాటలు తెలియక తమపని మానరైరి.

అట్లు వారు తమపని గడతేర్చిపోయిన వెనుక రామచంద్రుఁడు దనకు సహాయము చేయవచ్చినవాని కింత మహాపద గలిగినదని విచారించుచు నతని తలగుడ్డ తడుపుటకయి చెఱువుగట్టునకు వచ్చెను. నీళ్ళలో దిగి గుడ్డతడిపి మఱల గట్టెక్కుచుండఁగా నొక చాకలివాడు పరుగెత్తుకొనివచ్చి రామచంద్రుని జూచి యిట్లనియె.

చాకలి: అయ్యా! రాజగోపాలముగారు తమ కీ చీటీని. నీ మాట-నిమ్మని చెప్పినారు.

అని రహస్యముగా జెప్పి వెళ్ళిపోయెను.

రాజగోపాల మిచ్చిన యుత్తరమును జెరువుగట్టున నెవరో దృష్టితీయుటకుఁ బెట్టిన యొక మూకుడులో నున్న దీపము ముందఱ చదువుకొనుచు బాధపడుచున్న సహాధ్యాయుని మొగముఁ జూడక, తిరిగి యక్కడకు రాక వెళ్ళిపోయెను;

## ఏడవ ప్రకరణము.

శోభనాచలమును వేంకటరత్నమును వారి మిత్రమండలి మును రామచంద్రునిమీద గపిదీరక యతఁడారాత్రి ముక్త్యేశ్వరము వెళ్లననుకొని వారు గూడ వెంబడింపవలెనని నిర్ధారణ చేసికొనిరి.

రామచంద్రుఁ డారాత్రి విశ్వనాథశాస్త్రిలవారి యింటికి భోజనమునకుఁగాని పరుండుటకు గాని రాలేదు. శాస్త్రిలవారి శిష్యులు గ్రామమునం దంతటను వెదకిరిగాని రామచంద్రుఁడు మాత్రము వారి కగపడలేదు. శాస్త్రిలవారు రామచంద్రుఁ డెందులోనో దిగి చచ్చినాఁడని యోచించిరి.

రామచంద్రుని బట్టుకొనుట కిద్దఱు మనుష్యులను వెంటబెట్టుకొని శోభనాచల మారాత్రి జామయిన తరువాత బయలు దేరెను. ఎంత దూరము వెళ్ళినను రామచంద్రుఁడు వారి కగపడలేదు గాని చీకటిలో వచ్చుచున్నవారి కొక విధమైన యాపద తటస్థమైనది. ఒక పుంతమార్గమునుండి కొంత దూరము పోయినతరువాత మార్గమున కిరుప్రక్కలను గ్రిక్కిఱిసి యొకదాని యగ్రము నొకటి స్పృశించి పొదరిల్లువలె నల్లుకొనియున్న దట్టమైన చెట్లక్రిందనుండి వారు నడచుచుండగా దైవవశమున శోభనాచలమునకుఁ బాముగఱచెను. కఱచినతోడనే యతఁడు తనతోఁగూడ వచ్చుచున్నవారి కా సంగతిఁ దెలియఁజెప్పి యొకయడుగైనను బెట్టఁజాలక, యొక చెట్టుక్రింద బయలుమీఁద బట్టను బరచుకొని పరుండెను. అక్కడ నౌషధము

లేవియు లేవు. ఆతని చెలికాండ్రిద్దఱును శోభనాచలముకై విచారించుచు మార్గమున నెవ్వరైన వత్తురేమో వారిసాహాయ్యము బుచ్చుకొందమని రెండువైపులఁజూచుచుండిరి.

అప్పు డిఱువది సంవత్సరముల వయస్సుగల యొక వైష్ణవుఁడామార్గమున బోవుచు మాటి మాటికి వెనుకకుఁ దిరిగి చూచుచుఁ జీమ చిటుక్కుమన్న నక్కడ కొంత సేపు నిలిచి, యాధ్వనికారణమును దెలిసికొనుచు, ధ్వనియైనపుడెల్ల నులికిపడుచు, సన్ననైన పట్టె నామములు బెట్టుకొని, శరీరమున ద్వాదశోర్ధ్వపుండ్రములు లేకయే దక్షిణదేశపు పంచె నొకటి గట్టుకొని రెండవపంచెను దలఁ మీదఁకు ముసుఁగు వచ్చునట్లు శరీరమునిండఁ గప్పుకొని మార్గమున బోవుచుండెను. అతని జూడగనే శోభనాచలముయొక్క స్నేహితులిద్దఱును సంతోషించి యాతని సమీపమునకుఁ బోఁగా వైష్ణవుఁడు భయముతో వడ వడ వణక నారంభించెను. అంతట వా రిట్లు మాటలాడ నారంభించిరి.

ఒకడు: అయ్యా! మేము దొంగలము కాము. మీరు భయపడనక్కఱ లేదు. మేము మిక్కిలి అవసరమైన పనిమీద ముక్తేశ్వరమునుండి యమలాపురమునకుఁ బోవుచున్నారము. దైవవశము చేత మా యజమానుని బురుగు ముట్టుకొన్నది. తమ కేమైన మంత్రము వచ్చిన పక్షమున నాయనను బ్రతికింప వేడెదము.

వైష్ణ: అయ్యయ్యో! నాకు మంత్ర మేమియు రాదు. నా దగ్గఱ మందున్నది. ఆ మనుష్యుని నన్ను జూడ నియ్యండి. అమందు నూరిపోస్తాను.

రెండ: తమపే రేవరండి యాచార్యులుగారు?

వైష్ణ: రామానుజాచార్యులు. నన్ను మీరేమైన నెఱుఁగుదురా?

రెండ: ఎఱుఁగను కాని మొగము చూచినట్లున్నది. అమలాపుర మెప్పుడైన వచ్చినారా?

వైష్ణ: అమలాపురములో నన్ను మీరు చూడలేదు.

మాది తాటిపాక కాపురము ; నీవు నన్నెఱుఁగవు. మాది యమలాపురము కాదు.

ఒకఁడు : అయ్యా ! ఈలాగు దయచెయ్యండి. ఇదిగో బాముగఱచిన మనుష్యుఁడు డిక్కడ బరున్నాఁడు. బొటనవ్రేలి మీఁదఁ గఱచినది. దేహమంత చెమటలు పట్టినది. కాలువాఁచినది. నోటనుండి నురుగులు గ్రక్కుచున్నాఁడు.

వైష్ణ : స్మారకము దెలియన ట్లున్నది.

అని దగ్గఱకుబోయి చూచెను.

సర్పదష్టుడైన శోభనాచలమును జూడగనే వైష్ణవునకు మొగమున వికాసము దప్పిపోయెను. శోభనాచలమునకు స్మారకము దెలియకపోవుట వైష్ణవున కావహించెను. ఆ సేవకులిద్దఱును శోభనాచలమున కెట్లున్నదనియు మందు వేయమనియు వారనుచున్న మాట లతనికి వినఁబడవయ్యెను. కాని కొంతసేపాలోచించి ధైర్యము దెచ్చుకొని, మూటనున్న టప్పె నొకదాని తాతిమీద నరుగఁదీసి మందు పోసి, మొదటి మోతాదు కొంచెము పనిజేయువఱకును వైష్ణవు డక్కడనుండి, తా నతిత్వరితముగ ము క్తేశ్వరము పోవలయునని వారితోఁ జెప్పి మఱిరెండు మోతాదుల యౌషధము వారి కిచ్చి రెండు గడియల కొకమారు మందిమ్మనిచెప్పి తాను వెళ్ళిపోయెను. ఆఁడు పోకముందే శోభనాచలమునకుఁగొంచెము నెమ్మదిగా నుండెను.

పొరపాటుచేత నావైష్ణవుఁ డచట దన తాటియాకుల పుస్తక మొకదానిని వదలిపోయెను. కొంతసేపటికి శోభనాచలమునకు జలి వేసినందున స్నేహితు లిద్దఱును తాటియాకులను బ్రోగుచేసి చలిమంట వేయుచు. దాని వెలుతురున నాపుస్తకమును జూచియందులో దోపఁబడిన యొకతాటియాకు చీటిని దీసి వారిలో నొకఁడిట్లుచదువ నారంభించెను,

"రామచంద్రుడూ ! నీ వీరాత్రి అమలాపురమున నున్న పక్షమున బ్రతుకలేవు. నీవొక సహాధ్యాయునితోఁ దిరుగుచున్నావట.

వాడు స్నేహితుఁడు కాడు. శోభనాచలము మొదలగువారు నిన్నుఁ గొట్టవలెనని యోచించి నిన్నుఁ జెఱువుగట్టునకుఁ దీసికొని రమ్మని వానిని బంపినారు. నీ వీరాత్రి యెకాయెకిని ముక్తేశ్వరము వెళ్లవలసినది. నేను బంపినమూటలోఁ దిరుమార్ణము, దిరుమణి, దక్షిణదేశపు పట్టుబట్టలు. దేలు పాములవలని భయము రాకుండఁ గొన్ని మందులున్నవి. వైష్ణవవేషమును వేసికొన్నపక్షమున వారు నిన్నానవాలు పట్టలేరు. నిన్ను నేను ద్వారలోనే చూడ గలను."

అని యామనుష్యుఁడు చదువగానే రెండవవాఁడు నాలుకఁ గఱచుకొని, చేయిజాడించుకొని విచారసూచకముగా నిట్లు మాటాడెను.

రెండ: అయ్యయ్యో! తెలివితక్కువ నిర్భాగ్యులము. ఇప్పుడు మనకు మందిచ్చిన యీవైష్ణవకుఱ్ఱవాఁడే రామచంద్రుఁడు. మనమెంత యదృష్టహీనులము. ఆ కుఱ్ఱవాఁడు మంచి యదృష్టవంతుఁడు. వాఁడు చెరువుగట్టునఁ గూర్చున్నప్పుడు మనము పంపిన మనుష్యులు త్రాగి రామచంద్రుఁడనుకొని మన మనుష్యునే కొట్టినారు. వాఁడు చెప్పినది నిజమే. వీఁడు ముక్తేశ్వరమే వెళ్ళుచున్నాఁడు; వీనిని దిరిగి తలుముకొని వెళ్ళుదమా!

ఒకఁడు: వద్దు వద్దు. ఈవల శోభనాచలముయొక్క స్థితి బాగుండలేదు. ఆ వైష్ణవుఁడు దప్పకుండా రామచంద్రుడే. ఆహాహా! ఎంతమంచివాఁడో చూడు! శోభనాచల మతనికిఁ బరమశత్రువైనను వారి కెంత మంచిమందు లిచ్చి వాని ప్రాణము నిలిపినాఁడో చూడు. అతఁ డూరకున్న పక్షమున శోభనాచలము చచ్చును.

రెండ: వాఁడు వీనికి విరోధి. చావవలెనని మందు లిచ్చి నాఁడేమో ఆమందు వేయవద్దు. ఆనక ప్రాణభీతి రాఁగలదు. వాఁడు దొంగముండకొడుకు.

ఒకఁడు: రాజగోపాలము కొన్ని మందులఁ బంపినట్లు తాను జాబు వ్రాసినాఁడు. మంచి మందులు, అదే రామచంద్రుఁడు మనకిచ్చి నాఁడు. అతఁడు మహానుభావుఁడు. అతనికి మనము నమస్కరించవలెను.

రెంద : శోభనాచలమూ! ఇప్పు డేమి జేయుమన్నావు?

శోభ : మా యింటికిఁ దీసికొనిపోయి మాయమ్మను జూపిం చండి, నేను బ్రతుకను.

అంతట వారిద్దఱును శోభనాచలము నెట్లయినఁ దీసికొని పోవలెనని యాలోచించుచుండఁగా నొక బండి యామార్గమునఁ బోవు చుండెను. ఆబండివాని కర్ధరూపాయి నిత్తు మనిచెప్పి శోభనాచలము నాబండిమీఁద వేసి తీసికొనిపోయిరి.

అట్లు శోభనాచలము మొదలగువారిచేతఁ దెలియఁబడకుండ దాఁటి రామచంద్రుఁడు ముక్తేశ్వరమునకుఁ బోవుచుండెను. ఆ దినము కృష్ణపక్ష నవమిగనుక పదునెనిమిది గడియల రాత్రివేళకు శత్రు వుల దప్పించుకొని వచ్చినందులకు రామచంద్రున కుదయించిన యల్ప సంతోషమువలెనే చంద్రోదయ మయ్యెను. కాని రామచం ద్రుని ముఖ వికాసమువలెనే చంద్రకాంతియు వికాసహీనముగా గ్రుడ్డివెన్నెల వచ్చెను. గ్రుడ్డిలో మెల్ల యన్నట్టు లాస్వల్పకాంతికే రామచంద్రుఁడు సంతోషించుచుండఁగా నప్పు డుత్తరభాగమందుఁ జేటంత మబ్బుపట్టి యాగ్రుడ్డి వెన్నెలను దిగమ్రింగుటయే గాక, వృద్ధియై మునుపటికంటెఁ బదిరెట్లెక్కువ చీకటి దెచ్చెను, శోభనాచ లాదుల యపకీర్తి వలెనే యంతకంత కాచీఁకటి యెక్కువకాఁగా, రామచంద్రుఁడు గోదావరి యొడ్డునకుఁ బోయి రేపు పడవ పీలైన పక్షమున దాఁటి యారాత్రి కోటిపల్లె పోవలెనని యోచించుచు, దారి తప్పి రేవుస్థలమునఁగాక మఱియొకచోటఁ గూర్చుండెను.

ఆకాశమందలి నక్షత్రగణంబు లన్నియుఁ, దమస్వల్ప కాం తులను జూడనిచ్చుట మాని రామచంద్రుని స్నేహితులవలెనే క్రమ క్రమముగాఁ గనఁబడుట మానెను. అంధకార మంతకంతకు మిక్కుటమై, త్రోవనేకాక, యెదుటనున్న వస్తువునుగూడఁ గనఁ బడనిచ్చుటలేదు. నల్లని మబ్బులును, మబ్బులలోనుండి మధ్యమధ్య గుండెలు వ్రక్కలు సేయునట్లు బయలువెడలుచున్న యుఱుములునుఁ మొగము నెత్తకుండ వీచుచున్న ఝంఝూమారుతములును; రామ

చంద్రుని మనస్సును గలంచనారంభించెను. తన్నుఁ గప్పుచున్న యిసుకను నది యిసుకతిన్నెయనియు, మహావాయువుచేతఁ గదల్పఁ బడుచున్న తరంగముల ధ్వనిచేఁ దన యెదుట నున్నది గోదావరి యనియు. రామచంద్రుఁడు దెలిసికొనెను.

అతడక్కడఁ గూర్చుండి గొంచెము కాలుజాపగాఁ గాలికేదో మెత్తగా దగిలెను. అది యేదో పరీక్షించి చూచునప్పటి కది క[illegible]క యయ్యెను. తన ముందున్న స్థల మతఁడు బాగుచేసికొనుచుండగా జేతికొక చిన్న యెముకముక్క గ్రుచ్చుకొనెను. అంతటితోఁ బోక కఱ్ఱతోఁ నతఁడు తడవి యవతల గొట్టగా నా దెబ్బ యొక కుండమీద దగుల నది ఫటాలునఁ బగిలెను. దానితో నాతనికా స్థలము శ్మశానమై యుండునని యనుమానము తోఁచెను. భయపడి పరధ్యానముగా యోజించుచున్న యా బాలుని వెనుక చెవులు గింగురుమన నొక నక్క గూసెను. అది కూయఁగానే యతని యనుమానము నిజమయ్యెను.

అది శ్మశానమను నమ్మకము గలిగినతోడనే రామచంద్రునికి ముచ్చెమటలు వోసెను, గుండె ఝల్లుమనెను. ధైర్యము చెదరి పోయెను. లేచి పారిపోవుటకైనఁ గాళ్ళలో సత్తువలేకయుండెను. చేతు లాడవయ్యెను. ఏ పని జేయుటకును దోఁచదయ్యెను. దీపము లేదని విచారించుచుండెను గాని, మధ్య మధ్య వచ్చిన మెఱుపులు వాని భయమును తగ్గించి ధైర్యమును హెచ్చించుటకు మారుగా నా రుద్రభూముల యందున్న సగము సగము కాలిన కొఱవులను శవములను గాల్చిన స్థలములను గట్టుతాళ్ళను, కపాలములను రామచంద్రుని కగుపఱచి భయమును వెయ్యిరెట్లధికము చేసెను. ఆ యర్ధరాత్రమునందా భయంకరమైన శ్మశానమందు గాఢాంధకారమునం దొంటరిగాఁ గూర్చున్న యా కుమారునకు, భయంకరముగాఁ జచ్చిన వారి చరిత్రములును, ముసలమ్మలు చెప్పిన దయ్యముల కథలును నప్పుడప్పుడు దానువిన్న దయ్యముల రూపములును, జ్ఞాపకమువచ్చి భయోద్రేకముచేత. దనకక్కడనే మరణము గల్గునని రామచంద్రుఁడు నిశ్చయించుకొనెను. నడుమ నడుమ మబ్బులనుండి మెఱుపులువచ్చి

క్రొత్తవస్తువులను జూపించునట్లే పరవశముజెందిన యతని కప్పు డప్పుడు దెలివివచ్చి క్రొత్త సంగతులు జ్ఞాపకమై భయమధిక మగు చుండెను.

ఇంతలో రామచంద్రుని కన్నులనుండి వచ్చిన నీళ్ళవలెనే యాకాశమునుండి వర్షబిందువులు పడనారంభించెను. చినుకులంత కంత కెక్కుడై ఆకాశము చిల్లుపడునట్లు కుంభవృష్టిగా నేనుగు తొండములాపు ధారలతో వర్షము గురిసెను. ఆ వర్షమున భూమి నంతను దేజోవంతముగా జేసి యొక మెరుపు వచ్చి రామచంద్రుని కన్నులు మిఱుమిట్లు గొలిపెను. దానితోడనే దిక్కులు ప్రతిధ్వనులు జేయ బ్రహ్మాండము బ్రద్దలగునట్లు పెద్దపిడుగు పడెను. అప్పుడు రామచంద్రుడు తెలివిగా నుండుటచేత "అర్జునః, ఫల్గునః, పార్థః, కిరీటీ, శ్వేతవాహనః" అను శ్లోకమును పఠించి పిడుగు దనమీదకు రాకుండజేసికొనెనుగాని, యా మెఱుపుచేతఁ గన్నులకుఁ జూచునట్టి శక్తియుఁ జెవులకు వినునట్టి శక్తియుఁ దప్పి నాల్గునిముషముల వఱకు దిరిగిరాలేదు.

కీడులో మేలన్నట్లు ప్రకాశమానమైన యా మెరుపువలన, నొక దిబ్బమీఁద వేయఁబడిన యొక తాటియాకులపాక నాలికగుపడగా, వర్షములోఁ గూర్చుండుట కష్టమని గుడ్డలన్నియుఁ దడసియుండున గజగజ చలిచేత వణుకుచుఁ బ్రాణము పిల్లి కెంతెను నెక్కుడై తీపి గనుక యా బాధ పడజాలక యా పాకయందుఁ దలదాఁచుకొన వలెనని నిశ్చయించి లేచి మెల్లగా బోయెను. అక్కడయున్నవానికి మన స్తిమితము కలుగమి బెద్దబానలవంటి కడుపులును జిన్నినోళ్లను వంకరకాళ్ళను గల పిశాచములును గన్నులకు గట్టినట్టు లాతనికి మానసవీధిని గనఁబడఁ జొచ్చెను.

అప్పు డొక నల్లని బ్రాహ్మణుఁ డంగవస్త్రమును గట్టుకొని, యొక యంగవస్త్రమును మీఁద వేసికొని "నారాయణ నారాయణ" యనుచుఁ బాకపై పునకు వచ్చుచుండెను. వానిని జూచి రామచంద్రుఁడు చేతిలోఁ గొరవిలేనందునఁ గొరవిదయ్యము గాదని నిశ్చయించి.

యా బ్రాహ్మణుఁడు దిన్నగా నడచుచున్నను దన భయముచేత నతఁడు వంకరగా నడచుచున్నట్లు కనఁబడినందున నేదో దయ్య మనుకొని తరువాత మనుష్యుఁడని యెఱిఁగి శోభనాచలమో వాని మిత్రులో తన్నుఁ జంపుటకు వచ్చుచున్నారని భయపడుచు నిశ్చేష్టుఁడై యుండెను. ఆ బ్రాహ్మణుఁడు పాకలోనికి వచ్చి దుఃఖముతో "ఎంత పని జరిగినది దైవమా!" అని విలపించుటచేతఁ దన శత్రుఁడు గాఁడని రామచంద్రుఁడు హీనస్వరముతో నిట్లు పలుకరించెను.

రామ : అయ్యా! మీరెవరు? బ్రాహ్మణులేనా?

బ్రాహ్మ : బ్రాహ్మణులమే. నీ వెవరవు? ఇక్క డెందు కున్నావు?

రామ : నే నారువేల నియోగుల చిన్నవాడను. అమలా పురము నుండి వచ్చుచున్నాను

బ్రాహ్మ : అయ్యా! మేము వైదికులము. నేను మిక్కిలి బీదవాఁడను. నా భార్య యీవేళకు తొమ్మిది దినములక్రిందట ప్రసవమైనది. మగపిల్లవాఁడు కలిగినాఁడు. లేక లేక కలిగిన యా మగపిల్లవాఁ డీదినమున సందుగొట్టి చనిపోయినాఁడు. నాభార్యకు ప్రాణముమీఁదికి వచ్చినది. చచ్చిన పిల్లవానిని దీసికొనిపోవుట కైనను, మా జాతివారును, మా బంధువులును రాలేదు. కడుపు దుఃఖముతో నేనే యీ పసికూనను బాతిపెట్టవలసి వచ్చెను. (అని యేడ్చుచుండెను.)

రామ : అయ్యో! దుఃఖపడకండి. మీరు పెద్దలు అన్నియుఁ దెలిసినవారు. నావలెనే మీరును దురదృష్టవంతులు.

బ్రాహ్మ : నాయనా! నీకేమి కష్టములు గలిగినవి? ఇక్కడి కెందుకు వచ్చినావు?

అని బ్రాహ్మణుఁ డడుగఁగా రామచంద్రుఁడు తన వృత్తాంత మంతయుఁ జెప్పి తనమీఁదికి వచ్చిన యా యపనిందను, శరభరాజు గారు దమ్ము లేవగొట్టుటయు, శోభనాచలాదుల వైరమును దెలియ

జేయ బ్రాహ్మణుఁ డాశ్చర్యపడి యితనికొఱకు విచారింప నారంభించె. తరువాత వా రిట్లు మాట్లాడిరి.

బ్రాహ్మ : పూర్వజన్మకృత మెవరు తప్పింపఁగలరు. నీవు మా యింటికి వచ్చి రేపు మాయింటనుండి వెళ్ళుము. నీకు బొడి గుడ్డల విచ్చి యీపూఁట కొంచెము చలిమంటి వేస్తాను రా.

రామ : అయ్యా! నాకొరకు నాశత్రువులు వచ్చుచుందురు. ముందు మీరు నడువుడి, మీ వెనుకనే నేను వచ్చెదను. ఎవ రయిన వచ్చి నా జాడ లడిగిన పక్షమున వెనుక నున్నానని చెప్పవద్దు. నాకేదో సంజ్ఞచేయుండి. 'రామానుజాచార్యులు' అని నన్ను బిలచిననేను పారిపోఁగలను.

బ్రాహ్మ : నా ప్రాణము నీప్రాణమున కడ్డువేసి రక్షించెదను.

ఇట్లిద్దఱును బోవుచుగోదావరిగట్టుమీఁద కెక్కునప్పటికి జాము ప్రొద్దుమాత్రమే యున్నది. అప్పుడు దాటియాకుల గొడుగువేసి కొని యొకపురుషుఁడు వెండిముఱుగులుఁ బెట్టుకొనియున్న చాకలి వానిని వెంటబెట్టుకొని వచ్చుచున్న బ్రాహ్మణుని జూడక చీఁకటిచేత నాముసలిబ్రాహ్మణుని కెదురుగాఁ బోయినందునగొడుగుకాడ గ్రుచ్చు కొనెను. బ్రాహ్మణుడును దెబ్బతగిలినందున 'అబ్బా! యెవరురా నీవు? చంపివేసినావు. కన్నులుకనఁబడవా?' యని యడిచెను. రామచంద్రుఁడది యెవరోవచ్చినా రని దిగఁబడి రాదయ్యెను

పురు : అయ్యా! చూడలేదు. క్షమింపవలెను.

బ్రాహ : నీ దేయూరు? నీ వెవరవు?

పురు : మా దమలాపురము. మీ కిరువదేండ్లకుఱ్ఱవా డగు పడినాఁడా?

బ్రాహ్మ : నే నేఱుఁగను. మీపిల్లవాఁ డెవరో మీవెవ్వరో నాకు దెలియదు. చేతిలో కఱ్ఱలు మీరు నెవరికొంపద్రవ్వుటకు వచ్చి నారు. బుఱ్ఱలు పగులఁగొట్టుటకు వచ్చినారా? దిక్కుమాళ్ళారా!

పురు : అయ్యా ! తిట్టకండి. మేమెవనిని గొట్టుటకురాలేదు. వేఱే పనియుండి వచ్చినాము. మీ రాపిల్లవానిఁ జూచిన పక్షమునఁ జెప్పండి

బ్రాహ్మ: నేను చెప్పను. ఇప్పుడు మాగ్రామము నందు మా తల్లిదగ్గరఉనున్న వాళ్ళను గేకవేసి మీకుఁ దగినట్టు బుద్ధి చెప్పిస్తాను.

చాక : (కోపముతో) నోరుముయ్యి బాపనయ్యా? తెగనీలుగు తావేమి ?

పురు : ఓరీ ! ఆయన జోలికిఁ బోకురా. మనకుఁ గావలసిన మనుష్యుఁడు దొరకలేదు. మధ్య నాముసలి బ్రాహ్మణుని జోలికి పెళ్ళడ మెందుకు ?

బ్రాహ్మ : అయ్యో! దుర్మార్గుఁడా ! నీకు గావలసినవాఁడు దొరకలేదూ ? దొరికితే చంపివేస్తావా ? నీ కింత పొయ్యే కాల మేమిరా !

అని మాటాడుచున్న బ్రాహ్మణుని దాఁటి యాక్రొత్తపురుష లిద్దఱును ముందుకుఁ బోవుచుండగా జూచి బ్రాహ్మణుఁడు 'అలాగు వెళ్ళడ మెందుకు ? అక్కడ వాడు లేడు. అలా వెళ్ళవద్దు వద్దంటే మానవేమయ్యా' అని చెప్పెను.

ఆతని యాటంకమును జూచి యాపురుషులు రామచంద్రుఁ డక్కడ నున్నాడని నిశ్చయించి యటు పోవుచుండగా రామచంద్రుఁడు వారిబారిఁ పడకుండ గబగబ బరుగెత్తఁసాగెను. ఈ పురుషుని వెంటదమురుచు రామచంద్రుని నిశ్చయించి యెట్లయిన వానిని బట్టదలచిరి. కొంతదూరము పరుగెత్తి యాక్రొత్తవారిలో నొకడు రామచంద్రుఁడూ ! నేను రాజగోపాలమును. బరుగెత్తకు. నీ వీలాగు రా. భయములేదు' అని చెప్పగా రామచంద్రుఁడు ధైర్యమును విడిచి తనశత్రువులు రాజగోపాలముయొక్క పేరెపెట్టుకొనివా రనుకొని రాక మరల నాతని కేకను విని దగ్గఱవచ్చి రాజగోపాలమును జూచి సంతోషించి యిట్లు పలికెను.

రామ: రాజగోపాలము నీ వెందుకీ రాత్రివేళ వచ్చినావు! నాకు సహాయము జేసినందులకు మీ బాబయ్యగారు నిన్నుఁ గూడ లేవగొట్టినారా యేమి?

రాజ: లేదు. చాకలివానిచేత మూట నీకుఁ బంపినపుడు నీకు లెక్క యేమైనఁ బంపడము మరచిపోయినాను. పెట్టెలోనుండి నాలుగురూపాయలు తీసి యివతలబెట్టి చాకలివానిచేతి కిచ్చుట మఱచినాను. ఇదిగో రూపాయలు పుచ్చుకో. నీవు సురక్షితముగ వచ్చినావా?

రామ: ఏమి సురక్షితము! చావుదప్పి కన్ను లొట్టవాయి నట్లున్నది. నేను నీ యుత్తరమును జూడగానే కొంతసేపు చెఱువు గట్టుమీఁద నాగి కపటియైన యా సహాధ్యాయుని జోలికిఁ బోక మఱి నాలుగు జాములకు బయలుదేరినాను. అప్పటికి శోభనాచలము ముందుగానే బయలుదేఱి త్రోవలో—

రాజ: (మాట కడ్డము వచ్చి) ఆ సోది చెప్పకు. నాకుఁ బ్రొద్దు వోతుంది. మా యింట నందఱు నిద్రబోవుట గనిపెట్టి నే నిపుడు బయలుదేరినాను. నా పరుపుమీఁద నేను బరున్నట్టుగానే యొకదిండు పెట్టి మీఁద బట్టగప్పి యింటిదొడ్డి తలుపు దీసియుంచి వచ్చినాను. మా బాబయ్య లేవకమునుపే వెళ్ళవలెను.

రామ: అయ్యో! నా కొఱకు నీ విట్లు శ్రమపడవలసి వచ్చినదికదా!

అని రామచంద్రుఁడు పోకముందే రాజగోపాలమును జాకలివాఁడును బయలుదేరిరి. రామచంద్రుఁడు రాజగోపాలము యొక్క సద్గుణములను స్తోత్రముచేసి బ్రాహ్మణునితో జెప్పుచు బ్రాహ్మణుని యింటికిఁబోయి పొడిబట్టలు గట్టుకొని సుఖముగా నిద్రపోయెను.

మఱునాఁడు రామచంద్రుఁ డుదయమున గోదావరిలో స్నానము జేసి ముక్తేశ్వరస్వామివారి దర్శనము జేసి యా దిన మా బ్రాహ్మణుని యింట పండుకొని భోజనముఁ జేసి, కోటిపల్లి పోవుటకు సిద్ధముగా నుండగా బ్రాహ్మణుని భార్యకు బాలింతరోగము వచ్చి మరణ

మునకు సిద్ధముగా నుండెను. వరహా యిచ్చినగాని వైద్యుఁడామె కొక్క మాత్రనైన వేయకుండుటఁ జూచి నవనీతమువంటి హృదయముగల రామచంద్రుఁడు కనికరించి తనకు రాజగోపాల మిచ్చిన నాలుగు రూపాయలను వైద్యుని కిచ్చి యా బ్రాహ్మణుని భార్యకు మందు వేయించెను. రామచంద్రునిచేతి ధనము వదలగానే బ్రాహ్మణుని భార్యకు రోగముగూడ వదలెను. బ్రాహ్మణుఁడు రామచంద్రుని సహాయమువలనఁ దన యాపద యను నదిని దాఁటెను. కాని రామచంద్రునకు గోదావరినది దాఁటుట కెట్టిని యేగాని యైనలేదు.

ధనములేక యోజించుచున్న రామచంద్రున కొక మంచి యాలోచన తోచెను. పూర్వమొకనాఁడు తాను రాజవోలు వెళ్ళుచుండగాఁ బడవ మునిఁగిపోయినప్పుడు ముక్తేశ్వర బ్రాహ్మణుని దాను రక్షించెను. ఆత డనేక బహుమానములు దనకప్పు డిత్తుననియు, ముక్తేశ్వర మొక్కపర్యాయము రమ్మని తన్ను బ్రతిమాలిన సంగతియు, రామచంద్రునకు జ్ఞాపకము వచ్చి యా బ్రాహ్మణునిపేరు లింగరాజని తెలిపికొని యట్టిస్నేహితుఁ డుండగాఁ దన కిఁక భయమక్కర లేదనుకొని, లింగరాజు దగ్గఱకుఁబోయెను. రామచంద్రుని జూచి యిప్పటికి రమారమి యెనిమిది మాసము లయినందున వెంటనే యతని నానవాలు పట్టజాలక కాఁబోలు, లింగరాజతనిఁ బలుకరింపఁ డయ్యెను. అవసరము రామచంద్రునిదే కనుక తుదఁకతడు మౌనము విడిచి మాటాడెను.

రామ: లింగరాజుగారూ! నన్నెక్కడ నైనఁ జూచినట్లు జ్ఞాపక మున్నదా?

లింగ: మొగము జూచినట్లు జ్ఞాపకమున్నది కాని, యెవరో చెప్పజాలను. మీ దేయూరు?

రామ: మా దమలాపురము కాపురము. నాఁడు పడవ మునిఁగిపోయినపుడు ——

లింగ: (మాట కర్థము వచ్చి) ఓహోహో! నీవఁటయ్యా! వాడు పడవ మునిగిపోయినపుడు నీవు కూడఁ బడవలో నున్నావు

కావూ. నా కాసంగతి జ్ఞాపకమా ? అది యే మాత్రపు గొప్పసంగతి? నూరువ్యవహారములలో మాకది జ్ఞాపకమురాదు. అయితే నీవిప్పు డీగ్రామ మెందుకు వచ్చినావు?

రామ: నిన్న నొకబ్రాహ్మణునియింట వంట జేసికొని భోజనము జేసినాను. మీదర్శనముఁ జేయవలెనని వచ్చినాను. మీరొక సహాయము జేయవలయును.

లింగ: ఏమి పనిమీఁద వచ్చినావు? అది యేదో చెప్పు. నా సాధ్యమయిన పక్షమయినఁ జూచెదను.

రామ: నేను కార్యాంతరమున గోటిపల్లి వెళ్ళుచున్నాను. నాకు మీరు నాలుగురూపాయలు బదు లిప్పించవలయును. నాలుగు మాసములలోఁ దిరిగి యిచ్చివేయగలను.

లింగ: అయ్యో! ఇప్పుడే మీరు రాకముందు నూరురూపాయ లుండగా నొక పెద్దమనుష్యున కిచ్చినాను. ఒక గడియ క్రింద వచ్చిన పక్షమున గావలసినన్ని రూపాయ లిచ్చియుందును. నాలుగు గాక పోతే మఱినాల్గు పుచ్చుకొనవచ్చును. మీరెక్కడికి పోతారు. నేనెక్కడికి పోతాను. అయ్యయ్యో! రాకరాక మీరు వచ్చి యడగడము, నాదగ్గఱ సమయమునకు లేకపోవడము పిగ్గుగా నున్నది.

రామ; సరిసరి మీకు పిగ్గెందుకు? అది నా యదృష్టము. మీ రేమిచేయగలరుఁ రేపైన సర్దెదమంటె యీగ్రామములో నుంటాను.

లింగ: ఉండు. ఏమయిన లెక్క దొరికినపక్షమునఁ జూచి యిస్తాను.

ఈ ప్రకారము లింగరాజుదగ్గర నాలుగురూపాయలున్నను దనకు మహోపకారము జేసిన రామచంద్రునకు నాలుగురూపాయలు బదు లిచ్చుటకుఁగూడ నతవిమనసు సమ్మతింపదయ్యె. దన మీయకున్నను మర్యాదనిమిత్తము రామచంద్రుని భోజనమున కుండు మనియైనఁ జెప్పఁ డయ్యెను.

ఆ మఱునాఁడు శరభరాజుగారి యింటినుండి రామచంద్రుఁడు వచ్చుటకుఁ గారణ మేమని లింగరాజడుగఁగా రామచంద్రుఁడు

సత్యకాలపుమనిషి కనుక యున్న దున్నట్లు మాయామర్మములు లేకుండఁ జెప్పెను.

మూఁడవనాడు రామచంద్రుఁ డేదోయొకటి నిశ్చయముగఁ దెలిపికొని లింగరాజువద్ద సెలవు దీసికొని పోవలెనని యింటికివచ్చు నప్పటికి లింగరాజొక సంచిరూపాయల ముందువేసుకొని పేరూరి నుండి భూమి తాకట్టు బెట్టుటకువచ్చిన యొక యరవ బ్రాహ్మణునితో వడ్డీని గుఱించి ముచ్చటించు చుండెను. రామచంద్రుని జూడఁగానే యతఁడాధనమును జూచుట చేత నడుగు నేమో యని భయపడి మహా కోపమువచ్చి దగ్గఱనున్న కుమారుని జూచి 'విధవ! తలుపు వేయమని యెన్నిమాఱులు చెప్పినను వేయవుగదా?' అని వాని నొక చఱపుజఱచి లోపలి సణుగు కొనుచుండెను.

అప్పుడు రామచంద్రుఁడు వానిని పలుకరింపగా వా రిట్లు మాటాడిరి:

రామ: అయ్యా! లింగరాజుగారూ! తమ కీవేళ సొమ్మంది నది కాఁబోలు. నేను నాలుగు దినములనుండి తమకొఱకు నిరీక్షించి యున్నాను. ఏదైన దయచేయించిన పక్షమున సెలవు దీసికొని వెళ్ళిపోయెదను.

లింగ: (అసూయతో) నాని మిత్త మెవరు నిన్ను నిరీక్షింపు మన్నారు? నీపనిమీద నీ వుండి నాకొఱ కున్నా వనియెదవేమి? నీకు రూపాయ లెవరు పోగుబోసికొని కూర్చున్నారు? ఈ రూపాయ లెవరిసొమ్మని నీ కియ్యను? ఊళ్ళోవాళ్ళ సొమ్మిచ్చిన పక్షమున వాళ్ళూరకుంటారా?

రామ: తమదగ్గఱ లేకపోయిన పక్షమున మరెక్కడనైన బదులిప్పించండి. మీరు చెప్పిన యెడల నా కెవరు బడితె వారే యిస్తారు. రెండు నెలలలోఁ దీర్చగలను.

లింగ: నా కెవ రిస్తారు? నీ వేలాటివాఁడవో నేను నాలాటి వాఁడినే. ఏలినాటిశనిలాగునఁ బట్టుకొని వదలకుండ నున్నావేమి? దీనికి వేళాపాళా లేదూ? నీయవసరమే నీదా?

రామ: ఆ దినమున పడవమునిఁగినపుడు మిమ్ముల నే బ్రతికింపఁగా నాకు బహుమానముఁ జేయుదునని ముక్తేశ్వరము రమ్మని నారుగదా! నాలుగు రూపాయలు బదులైన నియ్యలేరఁడి?

లింగ: నీవు నన్ను బ్రతికించినావా? శరీరమంత కొట్లు కుక్కవలెఁ దెగఁగఱచి వదలిపెట్టినావు. ఆ పుండ్లు నాలుగు మాస ములవఱకు మానలేదు. ఒకని నొకఁడు బ్రతికింపఁ గలడా? చంపఁ గలడా? దైవానుగ్రహ మున్నది గనుక నేను బ్రతికినాను. బహు మాన మియ్యడము నాకు విధిగాదు. దయా ధర్మభిక్షము ఇస్తే యిస్తాను. లేకపోతే లేదు.

రామ; ఆసంగతి నిదివఱకే చెప్పిన పక్షమున నేను వెళ్ళి పోదునే. ఇన్ని దినములు నన్ను తేపు మాపని త్రిప్పుట యెందుకు?

లింగ: నోటికి సుద్ది బద్ధము లేదేమి? నేను నిన్నుండ మన్నానా? సొమ్మొందదని మొదటే చెప్పినాను. అమలాపురములో దొంగవస్తువు లమ్మి మాయూరు పాడుచెయ్యవలెనని వచ్చినావా? నిన్ను గుమ్మములోనికి రానియ్యఁగూడదు. ఇంతంత బుద్ధులు నీకుండుటచేతనే ధర్మరాజువంటి శరభరాజుగారు నిన్ను లేవఁగొట్టి నారు. నే నొక దమ్మిడినైన నియ్యను. నాయింటికి నీవు రావలసిన పనిలేదు. నడు నడు.

అని లింగరాజుగారు చెప్పగానే గంపంతయాశఁ బెట్టుకొన్న రామచంద్రునకుఁ గోప వివారము లొక్క సమయము నందే పుట్టెను. కాని కోపమును గనఁబఱచుట కది సమయము గాదు. కనుక తన స్వాధీనములో నున్న విచారమును మఱి యొకమాఱు తెచ్చుకొనెను. లింగరాజువంటి పరమవిశ్వాస ఘాతకుం డెక్కడైన నుండునా? పడవమునుఁగుటకు సిద్ధముగా నున్నప్పుడు తాను రామచంద్రు నెన్నివిధములఁ గాళ్ళుగడ్డపులు బట్టుకొని వేఁడు కొనెనో నేఁడన్నివిధముల దయాదాక్షిణ్యములు లేక కసరి కొట్టెను. అతని కేప్రకారముగ మనస్సు తాళెనో తెలియదు. రామచంద్రుఁడు తన కగుపడఁగానే యతనిని జ్ఞాపకము దెచ్చుకొనియు, లింగరా జెఱు

గనివానివలెను, జ్ఞాపకము లేనివానివలెను నటింప నారంభించెను. తన ప్రాణము రక్షించిన రామచంద్రునకుఁ దాను బహుమానము లిత్తుననియుఁ దన యావదాస్తి నిచ్చినను ఋణముతీరదనియుఁ జెప్పి వానిని ముక్తేశ్వరము రమ్మని చెప్పెను. లింగరాజు నాలుగురూపాయ లతనికి బదులైన నియ్యలేక యతిదీనముగ నున్న యాపిల్లవాని ననరానిమాటలని దరికిఁ జేరకుండఁ గొట్టెను. లోకములో నిట్టి లింగరాజు లనేకులున్నారు, ఆశ్చర్య మేల?

ఇట్లు నిర్విణ్ణమనస్కుఁడై యాశాభంగముచేత నాకస్మిక దుఃఖము కలిగి పడవదాఁటుట కొకడబ్బైనలేక గోదావరి దగ్గఱ గూర్చుండి రామచంద్రుఁ డిట్లు విచారించెను.

'హా దైవమా! మాచిరాజు శ్రీరాములుగారి గర్భమునఁబుట్టి యాగర్భశ్రీమంతుఁడనైన నాకు రేవుపడవదాఁటుట కొక కానియైన లేకుండఁజేసితివి. నేనెక్కడ పాదము బెట్టిన నక్కడ నిర్ధూమధామ మగుచున్నది. నాకు మరణమైన నేల కలుగఁ జేయవు? ఎన్నిదినము లన్నవస్త్రములు లేకుండా బాధపడగలను? మా తండ్రిగారు పోయినది మొదలుకొని యీనాఁటివఱకుఁ గష్టమేకాని సుఖమెఱుఁగను. నావంటి దిక్కుమాలినవాఁడు ప్రపంచమునం దెవ్వఁడు లేఁడు. కడుపులో నున్న దుఃఖము నంతను జెప్పికొందమన్న నిరుపార్శ్వముల బంధువు లన్నమాట లేరుగద! ఈశ్వరా! ఇప్పటికైన నీకు నామీఁదఁ గనికరలేదు కాబోలు' అని కన్నీళ్ళు కాలువలుగట్ట నేడ్చుచుఁ దుద కింత పాడుబ్రతుకు బ్రతుకుటకంటెఁ బ్రాణత్యాగము జేసికొనుట మంచి దని తనకష్టము నంతము చేసికొనఁదలఁచి దుఃఖతాపముచేత గల్గిన బాధ చల్లని యా నదీగర్భమునందు బ్రవేశించి తీర్చుకొన నిశ్చయించెను.

అప్పుడు ప్రదోషకాల మగుటచేత ముక్తేశ్వరస్వామివారి యాలయమునకుఁ బోయి యీశ్వరదర్శనముఁ జేసి కడపటిసారి యా దేవునకు మనసుదీర మ్రొక్కి తనకు వచ్చిన స్తవములన్నియు బఠించి దేవున కెదురుగా గూర్చుండి తాను గవిత్వము చెప్పఁగల

వాఁడే కనుక తన దీనావస్థను దెలుపుకొనుచు నీక్రింది పద్యములతో నీశ్వరుని స్తుతించెను.

చ. గడపితి నింతకాలము § గష్టచయంబులనొందుచుంటి నీ
పుడమిని మాతృగర్భమునఁ § బుట్టినదాది సుఖింపలేదు నీ
యడుగుల నాశ్రయించి యిఁక § నైన సుఖింపఁగఁగోరుచుంటి నా
యెడ గరుణించి వేగముగ § నీయవె మోక్షసుఖంబు నీశ్వరా !

చ. జనకుఁడు దీరె నాకు నతి § శైశవమందు గతించెఁ దల్లియున్
మనమున నన్నుఁగూర్చి యణు § మాత్రము పొక్కెడువారు లేరనే
ననయము చేయిజాపుకొని § యన్యులపంచల నుండజాలనో
యనఘ ! కటాక్షముంచి వడి § నంతముజేయవె కష్టజాలమున్.

ఆ. వె. అడుగరానివారి § నడిగితి ద్రవ్యంబు
చేయరానిపనులు § జేసినాఁడ
నన్నవస్త్రములకు § ననఘ ! నన్ను క్షమించి
ముక్తి నీయ వయ్య § భక్తవరద.

'ఈశ్వరా ! నే నిదివఱ కనేక పాపములను జేసినాను. నన్నే గతి కంపినను భారము నీదే. ఈదిక్కుమాలిన ప్రాణసంరక్షణకొఱ కనేకులకు బాధ నిచ్చినాను. నేటితో నాకష్టము లన్నియు గట్టెక్క గలవు. కరుణించి నీసాన్నిధ్యమును మాత్రము చేర్చుము. ఇదిగో నాచివర నమస్కారము అందుకొనుమని చేతులు జోడించి మ్రొక్కి మరల నాకష్టము లన్నియు సత్ప్రవర్తనమువల్ల గలిగినను నాకెన్ని జన్మముల కైన సత్రవర్తననే దయచేయుము. నా కనేకోపకారము లను జేసిన రాజగోపాలమును రక్షింపుము' అని గుడివదలి గౌతమీ నది యొద్దునకు బోయి బలవన్మరణము పాపహేతువని యెఱిఁగియు దుఃఖముచేత నామాట మఱచిపోయి వంశమునకుఁ దానొక్కఁడే కనుక తలిదండ్రులకు గడసారి తర్పణము వదలి, బట్టబిగియఁ గట్టుకొని, నడుమున నుత్తరీయమును జుట్టి జందెము మెడకుఁ జుట్టి, నమస్కారము జేసి కంఠములోతు నీళ్ళవరకును బోయెను.

పోయి యక్కడ విలుచుండి యెక్కడనో తాటిపాకలోఁ బుట్టి యతిసుకుమారముగాఁ బెరిఁగి, రాజవోలు మేనమామ యందను గొన్నాళ్ళుండి, యమలాపురమునకుఁ జదువు కొనుటకు వచ్చి యపనిందపాలై, ముక్తేశ్వరము వచ్చి గోదావరిలో బలవంతముగాఁ జచ్చుచున్న తన్నుగుఱించి విచారించి, యొకమాఱును, రాజగోపాలమును దలఁచుకొని యొకమాఱు నేడ్చి, చూచి యింత వెండు ప్రాణము నెట్లు పోగొట్టుకొందునా యని భయపడి నాలు గడుగులు వెనుకకు వచ్చి, చచ్చెడివానికి భయ మెందు కని మరల లోతునకుఁ బోయి, యెవరును లేరుగదా యని నాలుగుమూలలు బారఁ జూచి, కన్నుమూసికొని "హాదేవా" యని గుభాలున లోతునీళ్ళలో జేతులు జోడించుకొని మునిఁగిపోయెను,

అతఁ డొకమాఱు మునిఁగి యీఁతవచ్చిన వాఁడుగనుక వెంటనే నీళ్ళ్రపైగక తేలెను. అప్పు డొకమనుష్యుఁడు తడిగోచితో వచ్చి రామచంద్రుని జుట్టుపట్టుకొని మొలలోతు నీళ్ళవరకును దీసికొని వచ్చి యక్కడ వానిని నిలువఁబెట్టి దానును నిలుచుండెను.

అతనిని జూచి రామచంద్రుఁడు నిర్ఘాంతపడి కొంతసేపటికి 'నీవెవ్వఁడు' వని యడుగఁగా, నామనుష్యు డిట్లు చెప్పెను,

"అయ్యా ! నేను బల్లెవాళ్ళ చిన్నవాఁడను, నేనును మావాళ్ళు కొందఱును భద్రాచలమునుండి కలప తెప్పలుగట్టి నీలపల్లె తీసికొని పోవుచున్నాము. గడియ ప్రొద్దువేళ మాపిల్లవాఁడు రేవులో నీత లాడుచుఁ జేతినున్న వెండియుంగరమును బాఱవేసినాఁడు. రెండు గడియల క్రిందట నేను నీళ్ళలో మునిఁగి యా వస్తువునిమిత్త మడుగునఁ గూర్చుండి వెదకుచున్నాను, ఇదిగో వస్తువు దొరికినది, నేను నీటిలోనుండి బయటికి వచ్చినప్పటికి మీరు తేలి మునుఁగుచున్నారు. తత్క్షణమే నేను వచ్చి జుట్టుపట్టుకొన్నాను. నావస్తువు దొరకుట కాకుండ, బ్రాహ్మణుని బ్రతికించిన పుణ్యముకూడ దక్కినది బాబూ! నేను సెలవుదీసికొని, తెప్పమీఁదకు వెళ్ళుతాను."

అని పల్లెవాఁడు చెప్పగాఁ దాను బలవంతముగా దిగినట్లు

వానితోఁ జెప్పక నీవు మంచివాఁడవు. నా ప్రాణ మీదినమున రక్షించి నావు'' అని వానిని బంపి తానును మెల్లమెల్లగాఁ బట్టలారవేసికొని బ్రాహ్మణుని యింటికిఁబోవుచు నిట్లాలోచించుకొనెను.

''నేను బచ్చిపోవుట దేవున కిష్టములేదు. నే నేదో గొప్ప యదృష్టమునకే బ్రతికినాను. నే నిఁక జావను. నామీఁద దైవము నకు సంపూర్ణముగా ననుగ్రహము గలదు'' అని వితర్కించుకొని, బ్రాహ్మణుని యింటికిబోయిఁ పురుఁడు వెళ్ళిపోయినది గనుక వానితో గలపి భోజనముచేసి రేవుదాఁటుటకు సొమ్ములేదని యాతనితో జెప్పి కొంచెము సొమ్ము గలదేమో యని సిగ్గుపడుచు నడిగెను.

భూలోకమునం దవతరించిన కుచేలుడగు నా బ్రాహ్మణుడు గర్భదరిద్రు డగుటచేత సొమ్ములేక ప్రొద్దుబిందె నొక కోమటి వద్ద దాకట్టుబెట్టి పదునాలుగణాలు దెచ్చి రామచంద్రున కిచ్చి క్షమింపుమని వేడుకొనెను.

ఉదయమున లేచి రామచంద్రుఁడు రేవుదాటి కోటిపల్లి వెళ్లెను. గోదావరిలోబడి తేలుటచేత దన కష్టములనుండి దాను తేలినట్లు రామచంద్రునకు దోచెను. కోటిపల్లి వెళ్ళి రామచంద్రుడు మహారాజా గారియొద్ద నేదైన నుద్యోగమును దెచ్చుకొనవలెనని యోచించెను. శ్రీమద్విజయనగరపు మహారాజుగారు రాజధానియగు విజయనగరమం దుండి యుద్యోగస్థుల మూలమున గోటిపల్లి సంగతి యంతయు దెలిసికొనుచు నప్పుడప్పు డా గ్రామమువత్తురు.

# ఎనిమిదవ ప్రకరణము

రామచంద్రుడు కోటిపల్లి వెళ్ళినపూట గుణముల యందు రాజమ్మ కప్పగారుగా నుండదగిన యొక పూటకూటిపెద్దమ్మ యింట భోజనము జేసెను. ఏలాగైన నొక చిన్న యుద్యోగమును సంపా దించుకొనవలెనని యతని కిష్టము గల్గియున్నది కాని తనకుద్యో గమును నిచ్చువారును నిప్పించువారును లేరు.

కోటిపల్లి పరగణాకు శ్రీ విజయనగర మహారాజుగా రధికారులు గనుక వా రా పరగణాకు వల్లూరి శంకరరావుగారిని ప్రధానోద్యోగస్థునిగా జేర్పించిరి. ఆయన సద్గుణసంపన్నుడును, ధర్మకార్య నిరతుడును. బహుజనోపకారియునై మిక్కిలి కీర్తి గాంచెను. విజయనగర రాజ్య విస్తారకులు ప్రస్తుతపు విజయనగరపు కోటగట్టించిన ధనులునగు విజయరామ గజపతి మహారాజుగా రాకాలమున దేశమును బరిపాలించుచుండిరి. శంకరరావుగారి యధికారము క్రింద నున్నప్పుడు కోటిపల్లి పరగణా మిక్కిలి యభివృద్ధి నొందుచునచ్చెను.

రామచంద్రుఁ డాశంకరరావుగారి దర్శనము జేయించుఁడని కచేరీలోనున్న యుద్యోగస్థులలోఁ గొందఱి నాశ్రయించి ప్రతిదినమును వారి వీధియరుగుమీఁద సర్వకాలముల యందుఁ గూర్చుండుచుండెను గాని వారు మాటలతోనే గాని క్రియలతో నాతనిని సంతోషపెట్టరైరి. తుదకుఁ బ్రాణము విసిగి రామచంద్రుఁడు తానే స్వయముగా శంకరరావుగారిని జూడవలయునని యాలోచించి గుమ్మము దగ్గఱకు వచ్చి లోపలికి బోవుటకుఁ బ్రయత్నించెను గాని గుమ్మముముందఱ వెండి బిళ్ళలను వేసికొని పులితోలును ధరించి పూర్ణాధికారమును జరపుచున్న రాజభటు లానిరుపేదపిల్ల వానిని లోనికి బోనీయరైరి. రాజభటుఁ డొకఁడు శంకరరావుగారు నిద్రించుచున్నారనియు, మఱియొకఁడు క్రొత్త మనుష్యుని రానిచ్చిన పక్షమునఁ బంతులవారు కోపింతురనియు, వేఱొకఁడు పంతులవారు వ్యవహారము జూచుచున్నారనియుఁ జెప్పి యందఱు వాని నభ్యంతర పెట్టిరి. ఒక భటుఁడు రూపాయ దన కిచ్చినచో రామచంద్రుని లోపలికి దీసికొని పోదుననియు, మఱొక డర్ధరూపాయ నిచ్చిన దీసికొని పోదుననియు వారందఱు బేరములు నాడ నారంభించిరి. లంచములు నిచ్చి రామచంద్రుఁడు శంకరరావుగారి దర్శనము చేయుట కిష్టములేక గుమ్మము ముందఱ నాల్గుదినములు పడియుండియు దుదకతడు పంతులవారి దర్శనము దొరకనందున విచారక్రాంతుఁడై పూటకూటియింట నుండుటచేతఁ దాను దెచ్చిన పదునాల్గణాలును వ్యయ మయ్యెను.

రామచంద్రుడు కోటిపల్లి గ్రామము ప్రవేశించిన యయిదవ దినము సాయంకాలమునందు శంకరరావుగారు కుడిభుజముమీద నెఱ్ఱని రుమాలు, నెడమ భుజముమీద నుప్పాడలో బురమాయించి నేయించి చలువచేసిన సన్నని జరీయుత్తరీయమును వైచికొని చేతిలో వెండిపొన్నుగల యొక సన్నని పేపబెత్తమును బట్టు కొని టిక్కు టిక్కు మని తొడుగుకొన్న ముచ్చెలు ధ్వనిజేయ రాజభటు డొకడు ముందుగా నడచి యెదుట వచ్చుచున్న మార్గస్థుల నందఱి నొత్తిగించుచుండ, నెవరితోడనో మాటలాడుచు గోదావరి యొడ్డునకు జల్లగాలి నిమిత్తము వచ్చిరి. సమయమును నిరీక్షించి రామచంద్రుడు పంతులుగారి వెంటనే వచ్చి యాయన దనవైపు దిరిగినపుడు నమస్కరించెను. శంకరరావుగారును దిరిగి నమస్క రించి రామచంద్రుని వృత్తాంత మడుగ నత డామూలాగ్రముగా దన చరిత్రమును వినిపించెను.

దానిని శంకరరావుగారొక చిత్రమయిన కథవలె విని యాశ్చ ర్యపడి రూపురేఖావిలాసములను బట్టి యాతఁ డొక గొప్ప యింటి వాడనియు, హృదయ మిచ్చి మాట్లాడుటచేత నతడు నిర్దోషి యనియు, జూపులను బట్టి చాకచక్యముగలవాడనియు దెలిసికొని తమకచేరియం దిరువది రూపాయల పనియుండగా దాని నతని కిచ్చిరి.

ముత్యాల కోవవలెనున్న యతని వ్రాతయు, పనియందు శ్రద్ధయు, పైయధికారులయందు గలిగిన విధేయతయును శంకర రావుగారికి రామచంద్రునియందు దయ గలిగించెను. తనపని నతి వేగము ముగించుకొని రామచంద్రుడు కచ్చేరిలో నున్న మంద మతులయొక్కయు, సోమరిపోతుల యొక్కయు పనులు గూడ జేసిపెట్ట సాగెను. శంకరరావుగారు తప్ప కచేరిలోనున్న యుద్యో గస్థు లందఱును లంచగొండు లయి ప్రజలను గ్రహములవలె పీకుకొని తినుటచేత, రామచంద్రుని కా కార్య మనిష్ట మగుటచేత లంచముల గ్రహించువారిని మందలించుచు, బాధపడుచున్న పేద కాపులకు సహాయము జేయుచు నాతడు జనసమ్మతమైన పురుషు డయ్యెను.

శంకరరావుగారికి దరువాత యుద్యోగస్థుడు దామరాజు పద్మనాభముగారు. శంకరరావుగారికి రెండు వందల యేబది రూపాయల జీతము. పద్మనాభము గారికి నెలకు నూట యేబది రూపాయలజీత మున్నను నతఁడు లంచగొండులకెల్ల నగ్రగణ్యుడై తనకుఁ దలపినవన్ని లంచములను గ్రహించుచు, క్రిందియుద్యోగస్థుల కిప్పించుచు, భార్యమెడలో నగలు దిగవేసి లక్ష్మితో దులదూగు చున్నందున రామచంద్రుఁడు లంచములపేరయిన వినఁడుగనుక వారి కందఱకు బరమశత్రువై యుండెను.

దేశమునన్న కాఁపు లందఱును, దమయిండ్ల కర్మాదులఁ జేయించి యాచించు బ్రాహ్మణుల నెట్లో స్వల్పదానములచేతఁ దృప్తి పఱచుచుండిరి గాని, తమయిండ్ల కెన్నఁడును రాక మాటిమాటికి బాద పూజలు దెమ్మని పత్రికల నంపుచుఁ, దమ కుపవాస వ్రతము నేర్పుచు గచ్చేరిలోనున్న యీ బ్రాహ్మణోత్తముల నెంతో ధన మిచ్చి పూజించియు, వారి యనుగ్రహపాత్రులుగాకయే యుండిరి.

ఈ కారణములచేత రామచంద్రుఁడు చిన్న యుద్యోగస్థుఁడయ్యుఁ దనకంటె ననేకరెట్లెక్కువ జీతముగల యుద్యోగస్థులకు గూడ దక్కలో బల్లెమై తనపేరు చెప్పినమాత్రమున వారు భయపడు నటు ప్రవర్తించుచుండెను. తక్కువ వాఁడైననుసన్మార్గుఁడు గొప్పవాఁడైన దుష్టులకు భయహేతువేగదా?

రామచంద్రుఁ డాయుద్యోగములోఁ బ్రవేశించిన యాఱుమాసములకే శంకరరావుగారతనికి ముప్పది రూపాయల నిచ్చిరి. రామచంద్రుఁ డెప్పుడును దురదృష్టవంతుఁడె కనుక నింతలో మహారాజు గారు శంకరరావుగారిని నాలుగువందల రూపాయల జీతముమీఁద విజయనగరమునకు రమ్మని యుత్తరువు జేసిరి. శంకరరావుగారు వెంటనే ప్రయాణమై శ్రీమహారాజుగారితో రామచంద్రుని సత్ప్రవర్తనాదులఁగూర్చి విన్నవింతుమనియు, ద్వరలో నీతని నభివృద్ధికిఁ దెత్తుమనియు వాగ్దానము జేసి వెళ్ళిరి. ప్రాపకుఁడు వెళ్ళిపోవుచున్నందునను మిగిలినవారు దనకు శత్రువు లగుటను రామచంద్రునకు శంకరరావు గారి పోకడ విచారముగా నుండెను.

లంచగొండుల కంటకశమువలెనున్న శంకరరావుగారు వెళ్ళిపోయినందులకు సంతోషించుచున్న చిన్న యుద్యోగస్థుల యదృష్టముననో, రామచంద్రుని దురదృష్టవశముననో శంకరరావుగారి యుద్యోగము పద్మనాభముగారి కయ్యెను. పద్మనాభముగారు క్రొత్తయధికారమును వహింపగానే రామచంద్రునియందు క్రోధమునుగూడ వహించి యతని నవిధేయుడనియు, బెంకెవాడనియు, వ్రాసినదెల్ల దప్పనియు దిట్టుచు మహారాజాగారి కీసంగతి దెలియజేతునని బెదరించుచు, జీతములో సగము గుణహాళ క్రిందనే తగ్గించుచు నానాక్షోభల పెట్టసాగెను. రామచంద్రుడును దైవముమీద భారమువేసి ధర్మమే జయించునని శాంతించి యూరకుండెను.

అక్కడ నమలాపురములో రామచంద్రు డెందులోనో దిగి ప్రాణహత్య జేసికొనినా డని యందఱు ననుకొనిరి. కృష్ణవేణమ్మ దనకుమారుని నిమిత్తమే విచారించినట్లు విచారించెను. శరభరాజుగారును దనమూలమున నిష్కారణముగ బ్రాహ్మణహత్య తటస్థమయినదని విచారించి సోమావధానుల నడిగి కొన్ని జపములు చేయించి దోషశాంతిని జేసికొనుచుండెను. రాజగోపాల మా రహస్య మెఱిగినవాడే కనుక తానునుగూడ విచారించినట్లు నటించెనేకాని నిజముగా దుఃఖింపలేదు. తల్లిదండ్రుల కావర్తమానము నెఱుగజేయనులేదు. వేంకటరత్నము బ్రహ్మానంద భరితు డయి తన కింక బ్రాధిపత్యము వచ్చినట్లుండెను. పార్వతికి వేఱుసంబంధము వచ్చెను. పార్వతి వివాహపుమాట జ్ఞాపకమైనపుడెల్ల శరభరాజుగారు రామచంద్రుని మరణమునకు దాను కారకుండని విచారించుచుండెను. గ్రామములోని వారందఱు శరభరాజుగారితో నప్పుడప్పుడు రామచంద్రుని విషయమై మాటలాడుచు నతడు మహా సద్గుణు డనియు, వానిని వెళ్ళగొట్టినందున వారికి బాపము గలదనియు జెప్పుచు వచ్చినందున శరభరాజుగారికి రామచంద్రుని వెడలఁగొట్టి నందులకుఁ గొంచెము విచారము కలుగుచుండెనుగాని యాయన కనుమానము సంపూర్ణముగా నివారణ కాలేదు.

ఒకనాఁడు శరభరాజుగారును, చాకలివాఁడును గలసి రాత్రి

జామైనతరువాత దొడ్డవర మత్యావశ్యకమైన పనిమీఁదఁ బోవుచుండఁ ద్రోవలో నొక నూఱుగజముల దూరమున నొక వివాద వినఁబడెను. ఆ రాత్రివేళ చీకటిలోఁ గలహమాడుచున్న వారెవరో తెలుసుకొన వలెనని శరభరాజుగారు కొంచెమాగిరి. వివాదపడుచున్న మనుష్యులిద్దఱును శరభరాజుగారిని గాని చాకలి వానినిగాని, చూడక తమ కదివఱకు జరుగుచున్న కలహమును మానరయిరి. శరభరాజుగారు వెళ్ళి యక్కడ నిలుచున్న తరువాత నాపురుషుల కిట్లు వివాదము జరిగెను.

ప్రథముడు : అంతకోపము గలవాడవైన పక్షమున నాభాగము నాకు బారవేయరాదా! ఎంత న్యాయమో యంత నా కిచ్చివేయి.

రెండవవాడు : నీ కియ్యవలసిన దేమో నే నిదివరకే యిచ్చినాను. నాదగ్గర నిప్పు డేమియులేదు. నేనిప్పుడు వీథిలోనికి వెళ్ళుట లేదు. నాకాలు తెగవాచినది. అడుగుదీసి యడుగుబెట్టలేక యలోలక్షణా యని నే నేడ్చుచున్నాను.

ప్రథ : అవసరములు దీరినవికదా! ఏరు దాఁటి తెప్ప దగుఁలబెట్టినావు. కావలసినంత నీచేత జిక్కినదికదా! నీవెన్ని యాటలనైన నాడెదవు. నాజుట్టు నీచేతిలో నున్నదిగనుక నీ పీలాగున జేసినావు.

రెండ : (కోపముతో) నీవు నాకు జేసిన సహాయములేమిటి? నేను చేసిన ద్రోహము లేమిటి? ఆ వేళ వస్తువులమ్మగా వచ్చిన సొమ్ములో బాతిక రూపాయలు పుచ్చుకొంటివి! అంత కంటె నీ కెక్కువ యేలాగున రాగలదు?

ప్రథ : ఛీ! నోరు ముయ్యి; అమ్మినవాని కేబది, నీకేబది, నాకేబది యని కదా మొదట దీర్పుఱచుకొన్నది. తక్కిన పాతిక నా కియ్యనక్కరలేదా? కష్టపడి యమ్మి నానాబాధలు పడ్డవాళ్ళము మేమును, బయటనుండి కట్టుపెత్తనముజేసి యెక్కువ లాభమును గొట్టేవాడవు నీవునా?

రెండ : తెగనీల్గుతా వేమి ? పొట్టకూటికి జేరిన విధవవు నీ కియ్యేను. నీయబ్బతో జెప్పుకో. మెత్తమెత్తగా మూరుకొన్నం దుకా వేషములు వేస్తావు. నీ వేషములు నాదగ్గఱ తీసిపెట్టు.

ప్రశ్న : నీ బెదరింపులు నాదగ్గఱకావు. బ్రహ్మచారి విధవవు. నీ వీలాగే గొంతుక కోస్తావని నేనప్పుడే యనుకొన్నాను. నీ మాటలు నమ్మి నిష్కారణముగ నేను రామచంద్రునితో విరోధము దెచ్చుకొని యేమి యెఱుగని పిల్లవానిని నానా హింసలు పెట్టినాను. తమ్మంట్లు నీవే తీసికొన్నావు. నీవు నేను భోగముదాని కొంప ద్రవ్వినాము. ఇంత దిక్కుమాలిన బుద్ధులున్నవి కనుకనే పాము గరచినది.

రెండ : నీవుమాత్ర మెన్ని పాములు గరవకుండ దాటగలవు ? ఇల్లలుకగానే పండుగకాలేదు. నీవు నన్నాక్షేపింప నక్కఱలేదు. నాకంటె నీవు రెండాకులెక్కువ చదివినావు. మంత్రిప్రగడవారి వంశమున జెడబుట్టినావు. నీ మూలమున శరభరాజుగారు దలయెత్తుకొని తిరుగడములేదు.

ప్రథ ; నీ యంత దుర్మార్గుడను గానులే. ఇంట జూద మొకటి పెట్టి యందఱి నింటికి బిలిచి కొంపలు దీయడములేదు. కూచిమంచివారంతా యగ్రహారములు గట్టించి కీర్తి సంపాదించుచున్నారు. నీవు బ్రహ్మచారివై లోకము తగులబెట్టుచున్నావు. సిగ్గులేక యింక మాటాడవలెనా ?

రెండ : బ్రహ్మచారినైనను నీ వలె ముండనుంచుకొని దాని చేతికూడు దినుటలేదు. అబ్రాహ్మణ ముండాకొడకా ! నోరుముయ్యి. సిగ్గులేదేమి ?

ప్రథ : నా ముండజోలి నీ కెందుకు ? దానిసంగతి నీవెత్తకు. ఏమయిన నన్నను, రామచంద్రుని యుసురుగొట్టి చచ్చిపోతావు.

రెండ : నేను తమ్మంట్లు దీసికొన్నాను. నీవు దొంగవస్తువు లమ్మించినావు.

ప్రథ : వాని మేనమామ వచ్చినాఁడవి. దొంగవర్తమానము చెప్పించిన మహానుభావుడవు నీవేకాదా? నేనాలాటి పనులు చేయ లేదు.

రెండ : ఛీ. వెధవవు. చెప్పుదీసికొని చెంపలు పగులగొట్టు తాను.

ప్రథ : కొట్టకపోతే నీవు బ్రాహ్మణుడవు గావు. ఏదీ కొట్టు.

రెండ : పాము గఱచినప్పటినుండీ నా కాలు వాచి కదలనీయ డములేదు. అందుచేత లేవలేనుగాని లేకపోతే నిన్నీవేళ చంపివేతును విధవా!

ప్రథ : ఆ పని నేనే చేస్తాను. (అని కఱ్ఱతోఁ గొట్టును)

రెం : ఆ! ఆ! కొట్టు కొట్టు! (అని చేతులడ్డము పెట్టు కొనుచు) ఈలాగు దొఖ్ఖతోవచ్చిన దేమిరా. నీ సంకటము కుదర్ప గలనులే.

ఇట్లా పురుషులిద్దఱు నొకరి రహస్యము లొకడు బయటబెట్టు కొనుచు గలహమాడుచుండగా శరభరాజుగా రామాటలు విని యందులో నొకడు వేంకటరత్నమనియు, రెండవవాడు శోభనాచల మనియు గంఠధ్వనినిబట్టి యానవాలుపట్టి చాకలివానితో గూడ నారి యెదుటకు బోయి నిలిచిరి. ఎదుట నిలచిన శరభరాజుగారిని జూచి వేంకటరత్నమును. శోభనాచలమును భయవిస్మయములతో గదల లేకపోయిరి. అప్పుడు శరభరాజుగారు వారితో నిట్లనుమాటాడిరి.

శర : ఏమిరా వేంకటరత్నము! ఈ వివాద మేమిటి? నీకు శోభనాచల మెందుకు సొమ్మియ్యవలెను? నీకును శోభనాచలము నకునుగల వ్యవహార మేమిటి?

వేంక : (తలవంచుకొని యూరకొన్నాడు)

శర : ఓరీ దుర్మార్గుడా! నీ వేమో నమ్మకముగల వాడ వనియు నాకు ప్రతిష్ఠ దెత్తువనియు నే ననుకొన్నాను. సత్పురుష డయిన రామచంద్రుని కచేరిలో దుమ్ముబోసిన మహానుభావుడవు.

నీవేనా? మా మంత్రి ప్రగడవారి వంశమున దప్పబుట్టినావురా! నీ మాటలను నమ్మి నిష్కారణముగా రామచంద్రుని లేవగొట్టినాను. అతని మనస్సెంత క్షోభపడినదో? మేనమామ వచ్చినాడని దొంగ వర్తమాన మతనికి జెప్పి వానిచే దొంగవస్తువుల నమ్మించి యా సొమ్ము మీరు పంచుకొన్నారా? అవురా! ఎంత వాడవురా! ఛండాలుడా! (శోభనాచలముతో) ఏమయ్యా, నీకు బుద్ధిలేదు? అభము శుభము నెఱుగని కుఱ్ఱవాని తమ్ముంట్ల నపహరించుటకు నీకు జేతు లేలాగు వచ్చినవయ్యా? పాముగఱచి బాధపడుచున్నావు. నీ కిప్పటికైన సిగ్గురాలేదు! మీ రిద్దఱు మేకతోలును గప్పుకొన్న పెద్ద పులులుగదా!

శోభ: (శరభరాజుగారి కాళ్ళమీదఁబడి) అయ్యా! రామచంద్రుని సమస్త విధముల భంగపఱచినాము. ఈ వేంకటరత్నమును నేనును గలసి చేయరాని పాపము లన్నియు జేసినాము. తమరు క్షమించినట్లయిన నింకొక్క సంగతినిగూడ జెప్పెదను. తమ పిల్లవాని వస్తువులు——

శర: (ఆశ్చర్యముతో మాట కడ్డము వచ్చి) అవి తీసి కుఱ్ఱవానినోట గుడ్డలు కుక్కినారు మీరే! అయ్యో! ఇక మిమ్ము బ్రతుకనీయగూడదు. మీరు లోకమును మ్రింగివేయ గలరు. ఎంత వాళ్ళయిన నవుదురురా మీరు! అన్నా, వేంకటరత్నము! నా యింట నుండి మా కుఱ్ఱవానినే చంపదలచు కొన్నావా? ఛీ! నా యెదుట నుండి లేచి పో. నీ మొగమును జూడ గూడదు.

వేంక: (ఏడ్చుచు) అందులో నేనేమి యెఱుగనండి. మీ పాదముల సాక్షి.

శోభ: అయ్యా మీ నరసింహముయొక్క వస్తువుల నేనును మఱి యొకఁడును గలసి దీసినాము. వేంకటరత్న మందులో నేమియు నెఱుఁగడు. నావంటి మహాపాతకుఁ డెక్కడను లేఁడు. నేను రామచంద్రుని గొట్టుటకు వెళ్లుచుండగా ముక్తేశ్వరము తోవలో నన్ను పాము కఱచినది. నేను రోగము చేతఁ దీసి

కొను చున్నాను. నాకు బుద్ధివచ్చినది. ఇఁకనే బ్రతుకను. నన్ను క్షమించండి. నా కళయ మిచ్చినదాక మీకాళ్ళు వదలను.

శర : ఓరీ వేంకటరత్నము! మా యింటనుండి లేచిపో, రామచంద్రుఁడు చచ్చిపోయినాఁడు గదా! నీ మూలమున నాకు బ్రాహ్మణ హత్య కూడ వచ్చినది.

వేంక : ఆతఁడు కోటిపల్లిలో నున్నాఁడట. చచ్చిపోలేదు.

శర : ఇఁక నాతో మీరు మాటాడవద్దు. పొండి.

అని శరభరాజుగారు ప్రయాణమును మానుకొని గ్రామము నకుఁ దిరిగివచ్చి యింట నందఱితో నాసంగతి జెప్పగా వారంద ఱును నిజము నేటికి దెలిపినదికదాయని సంతోషించిరి. రాజగోపాలము పరవశత్వము జెందెను. శరభరాజుగారు బ్రాహ్మణులను క్షోభ పెట్టుట సంపన్న గృహస్థులకు క్షేమముగాదని యోచించి శోభనాచల మును వేంకటరత్నమును క్షమించిరి. కాని తిన్నఁగా విచారింపకుండ రామచంద్రుని క్షోభపెట్టినందులకు బరిపరి విధముల నొచ్చుకొనుచుఁ బశ్చాత్తాపమును జెందిరి.

మఱునాఁడుదయమున లేచి సోమావధానులను బిలిపించి, పార్వతిని రామచంద్రునకిచ్చి వివాహముఁ జేతుననియు. ముహూర్త మును బెట్టుమనియుఁజెప్పి మంచిలగ్నమును బెట్టించి. రాజగోపాలము శరభరాజుగారు. సోమావధానులును గలసి రామచంద్రునితో నీసం గతిఁ జెప్పుకొనుటకు మధ్యాహ్నము బయలుదేఱి కోటిపల్లి వెళ్ళిరి.

శంకరరావుగారు విజయనగరమునకు బోవుటవలన నేఁబది రూపాయలపని కచ్చేరిలో నూరకయున్నందున నాపని రామచంద్రు నకు నియ్యఁగూడ దని పద్మనాభముగారు వ్రాసినను శంకరరావుగారి సాహాయ్యముచేత నది రామచంద్రునకే యయ్యెను. ఆ పని యాతని కైన నెలదినములకుఁ గోటిపల్లి పరగణాయందుఁ గొన్ని తొందరులు గలిగినందునఁ దన్నివారణార్థము మహారాజుగారు శంకరరావుగారి నక్కడ కంపిరి. ఆయన వచ్చినతోడనే వ్యవహారము లన్నియుఁ జక్కబడెను. ఆయన నాల్గు మాసము లక్కడ నుండిరి. క్రిమ

క్రమముగా శంకరరావుగారికిని. రామచంద్రునకును బరస్పరానురాగ మభివృద్ధి జెందెను.

శరభరాజుగారును, రాజగోపాలమును, సోమావధానులును వచ్చి, రామచంద్రుని యిల్లు తెలుసుకొని యతనియెదుట రాగా వారిని జూడగానే రామచంద్రుఁ డాశ్చర్యపడెను. తరువాత వారి నందఱను రామచంద్రుఁడు మర్యాదచేసెను. ఒకరి యోగక్షేమముల నొకరడిగిన వెనుక వారిట్లు మాటాడిరి.

శర : రామచంద్రుఁడూ! నీకు నేను మహాపకారమును జేసినాను. నీ వెట్లు మాయలోఁ బడినావో నేనును నట్లే పడినాను. నన్ను నీవు క్షమింపవలెను.

రామ : మీ రింతమాట సెలవియ్య వద్దు. మీరు పొరబడి నారు. మీ రదివరకుఁ జేసిన యుపకారమును నేను మఱువను. ఇది యెల్ల మీచలవేకదా?

శర : నేను మా పార్వతిని నీ కిచ్చి వివాహము జేసెదను. వివాహ మీ వేళకు సరిగా నెలయున్నది. ఉభయులకుఁ గావలసిన సొమ్మంతయు నేనే వ్యయముజేసెదను. మీ బంధువుల నందఱి నీలోగాఁ బిలిచి మా బంధువులకు శుభలేఖలు వ్రాసిపంపెదను. అప్పటికి నీవు సెలవుపుచ్చుకొని రావలెను. పాలకి గూడ నక్కడనే కుదిర్చియుంచుతాను. మే మింక బ్రయత్నము చేసికొంటాము.

రామ : మా పినతండ్రివి. మా మేనమామను బిలువవలసినది. అంతకంటె నాకు బంధువులు లేరు.

రాజ : రామచంద్రుఁడూ! శోభనాచలమును, వేంకటరత్నమును దమలోఁదాము కలహమాడి యొకరి రహస్యముల నొకరు బయలుపెట్టుకొనిరి. అది బాబయ్య విన్నాఁడు. నిజము నేటికి దెలిసినది. వేంకటరత్నమును లేవఁగొట్టినారు.

రామ : దైవానుగ్రహ మున్నది కనుక నిట్లయినది.

ఇట్లు వివాహము నిశ్చయించి యా రాత్రి వారందఱు నక్కడ

నుండి రామచంద్రుఁడు శరభరాజుగారిని శంకరరావుగారి యొద్దకు దీసికొనిపోయి దర్శనము చేయించి, యీ కాలపు విశ్వాసఘాతకుల వలెఁ గాక తా నుద్యోగము చేయుచున్నాఁడు. బూర్వము శరభరాజు గారి యింట దానున్నను జెప్పుకొనుట కభిమానము లేక యాయన తనకుఁ జేసిన మహోపకారముల నెల్ల నుగ్గడించి శరభరాజుగారి గుణ ములకు దగునట్లు శ్లాఘించెను. వారందఱును మఱునాఁడు ప్రయా ణమైపోయిరి.

రామచంద్రుఁడు వివాహము నిమిత్త మొకమాసము సెల విమ్మని యడిగెను. పద్మనాభముగారు వీలులేదని యుత్తరువు జేసిరి. ఈ వర్తమానము రామచంద్రుఁడు శంకరరావుగారితోఁ జెప్పగాఁ నాయన పద్మనాభముగారిని జీవాట్లుపెట్టి సెలవు యిప్పించిరి.

వివాహ మొక వారమున్న దనఁగా రామచంద్రుఁ డొకనాడు వీధియరుగుమీఁదఁ గూర్చుండగా నతనిపినతండ్రి జగన్నాథమువచ్చి కూర్చుండి రామచంద్రునితో నిట్లు చెప్పెను. "నాయనా ! విన్నావా సంగతి ? శరభరాజుగారు నీకుఁ దన కొమార్తె నిత్తునని ముహూ ర్తము బెట్టించి మమ్ముల నందఱిని బిలిచి తిరిగి నాలుగు దినముల క్రిందట వేరే క్రొత్త సంబంధము నిశ్చయించుకొన్నారట ! మన సంబంధము కంటె గొప్పది తెచ్చుకొన్నారు. వెయ్యిరూపాయలు వరదక్షిణ కూడ నిచ్చినారఁట. గొప్పవాడు గనుక చెల్లినది. మన మీలాటిపనిఁ జేసినపక్షమున సాటివాళ్ళు తాటియాకులు గట్టుదురు. వారి నెవరు నోరెత్తి మాట అనలేకపోయినారు. గొప్పవాళ్ళందరికి వినాశకాల మీలాగే యుండును. చూడు వారుచేసిన నగుబాటుపని.

రామ : (విస్మయముతో) శరభరాజుగా రాలాటిపని జేయుదురా ?

జగ : చేయకేమి? ఆయన పైకాలాగ గనపడునేకాని లోపల విషము. నీవు నీచుఁడవఁట. ఆ శరభరాజుగారికి నీ కియ్యవలెనని యున్నది కాని, నీచపు సంబంధమని బంధువు లందఱు నాక్షేపించినా రఁట. అందుచేత నీకు వేఱొక సంబంధము గుదిర్చి నాను. నీ కిష్ట మున్న పక్షమున జేసికొనవచ్చును.

రామ: నీవే పెద్దవాఁడవు. నీ కిష్టమైన సంబంధము దీసి కొనిరా.

జగ: కపిలేశ్వరపురములో మనవా రున్నారు. వారు శరభ రాజుగారికన్న గొప్పవాళ్ళు. సంవత్సరమునకు నాలుగు వేల రూపా యలు వారికి భూముల మీఁద వచ్చును. పిల్ల మరకతమువంటిది. పెమ్మరాజు ప్రసాదరాయఁడుగారి కుమార్తె. నీ మంచియోగ్యతను జూచి నీకుఁ బిల్లనియ్యవలె నని వారి కున్నది. ఆయన వారము దినములలో నిక్కడికి వచ్చి నిన్నుఁజూచి ముహూర్తము నిశ్చ యించుకొందురు.

రామ: గొప్పవారిని నమ్మగూడదు. చెప్పెడు మాట యొకటి చేసెడి దొకటి.

జగన్నాథ మీ వర్తమానమంతయు రామచంద్రునితో జెప్పి మఱునాడు వెళ్ళిపోయెను. శరభరాజుగారు వేఱు సంబంధము గుదుర్చుకొనుటచేత రామచంద్రుఁడు మునుపటి ముహూర్తమునకు నమలాపురము వెళ్ళలేదు. జగన్నాథముగారు వెళ్ళిన పది దినముల కొకనాటిరేయి పంద్రెండుగురు బోయీల పాలకి నెక్కి యొక కాగడ వేయించుకొని మంచి బట్టలు ధరించుకొని పెమ్మరాజు ప్రసాద రాయఁడుగారు వచ్చిరి. రామచంద్రుఁ డాయన కెదురుగా బోయి తీసికొని వచ్చి మర్యాద జేసెను. ఆయనతోగూడ నొక బ్రాహ్మణుఁడు పసుపు, కుంకుమ, పండ్లు, చాకలివానిచేత దెప్పించి యవటబెట్టెను.

ప్రసా: అబ్బాయీ! మీ పినతండ్రిగారు వచ్చి నీతో మాట లాడినారా?

రామ: సంగతు లన్నియుఁ దెలిపినవి. ఆయన వచ్చినారు.

ప్రసా: వివాహమిప్పటి కొఱునొక్కదిన మున్నది. సిద్ధ ముగా నుండు. మా పిల్ల చిన్నతనమందు జబ్బుపడినప్పుడు మేము వేంకటేశ్వర సాన్నిధ్యమందు వివాహము చేయుదమని మ్రొక్కు కున్నాము. అందుచేత వాడపల్లెలో నీ కార్యము చేయఁదలచు కొన్నాను. ఒకనాటి పెండ్లిఁయని సందేహింపకుము.

అని చెప్పి బ్రాహ్మణుఁడు తెచ్చిన పసుపు, కుంకుమ రామచంద్రున కిప్పించెను. బోయీలు సవారిఁదీసికొని వెళ్ళిపోయిరి. బ్రాహ్మణుఁడును వారితో వెళ్ళెను. ప్రసాదరాయఁడు గారక్కడ పేఋనాఁ డుండిరి; ఆ దినమున నాలుగు గడియల ప్రొద్దెక్కిన తరువాత రామచంద్రుఁడును, ప్రసాదరాయఁడు గారును మాటలాడుచుండఁగా రాజగోపాలము వచ్చి రామచంద్రునితో నీ ప్రకారము కఠినముగ మాటాడెను.

రాజ: ఏమోయి రామచంద్రుడూ! పరువైన నియోగుల యింటఁబుట్టినావుగదా! నీ వీలాటి బుద్ధి లెక్కడ నేర్చుకున్నావు? నీకు మాసంబంధ మిష్టమున్నయెడల రావలెను. ఇష్టము లేని పక్షమున రామని స్పష్టముగాఁ జెప్పవలెను. నీమాత్రము పెండ్లికొడుకు మాకుఁ గుదురక పోఁడు. మొదట వస్తానని చెప్పి ముహూర్తము బెట్టించి రాక మోసము చేయఁ దలచుకొన్నావా? నలుగురు బంధువులలో నగుబాటు వచ్చి తలయెత్తికొనలేక పోయినాము. ముహూర్తము దాటిన తరువాత నీవురావని మీ పినతండ్రిగారు చెప్పినారు. ఆమాట మొదట మాతోఁ జెప్పక పోయినారా?

ఆ మాటలకు రామచంద్రుఁ డాశ్చర్యపడుచుండగా ప్రసాదరాయఁడుగారు తొందరపడ నారంభించిరి. ఇంతలో శంకరరావుగారు గుమ్మము ముందఱికి వచ్చి 'కామయ్యా! ఇక్కడేనా?' యని యడిగెను.

కామ: ఇక్కడేనండి అడుగో దిక్కుమాలిన ముండాకొడుకు నాకొంపఁ దీసినాడు (అని యరచెను).

శంక: కామయ్యా! తొందరపడకు. సంగతియంతయు జెప్పు.

కామ: అయ్యా! ఆ కూర్చున్నవాడు నాకుమార్తె నెత్తుకొని పోయి రామచంద్రున కిచ్చి దొంగతనముగా వాడపల్లెలో బెండ్లి చేయఁదలచుకొన్నాడు. ఈ దుర్మార్గుడు దినమున కొక్కవేషము వేసికొని లోకమును మోసము చేయుచుండెను.

శంక: అతని జెవులనున్న తమ్మంట్లు మాతమ్ముని చెవుల నుండెడివని తోఁచుచున్నది.

రామ: ఓయీ ప్రసాదరాయఁడా! నీసంగతి యంతయుఁ జెప్పు. విన్న తక్కున శిక్షతో బ్రోవిత్తుము. లేనిపక్షమున నీపాట్లు నీ వనుభవింపఁగలవు.

ప్రసా: అయ్యా! నన్ను క్షమింపవలెను. నేటికి నేను దొరికినాను; మాది విడదవోలు కాపురము. నాపేరు చామర్తి జనార్దనము.

రామ: అయ్యా! ఇతని పేరుయొక్క మొదటియక్షరములున్న రుమాలు మాకుదొరికినది దానిమీఁదఁ 'చా, జ' యని యున్నది.

శంక: అతని వృత్తాంతము నంతను జెప్పనిండు.

ప్రసా: నేను చిన్నతనమునందె పిత్రార్జితమగు ద్రవ్యమంతయు జూదమునందు వ్యయపెట్టి జోగినై యమలాపురము ప్రవేశించి కూచిమంచి శోభనాచలమునకు స్నేహితుఁడనై యనేక పాపములను చేసినాను. శోభనాచలము యొక్కయు, వేంకటరత్నము యొక్కయు ప్రోత్సాహముచేతఁ గర్రా రామయ్య యను పేరుబెట్టుకొని యీ రామచంద్రుని మేనమామ వచ్చినాఁడని దొంగవర్తమానమును జెప్పినాను. దేశిరాజు సూర్యనారాయణ యను పేరుబెట్టుకొని యిత్తడి కంటెన్ను, గాజురాయివేసిన యిత్తడి యుంగరమును రామచంద్రున కిచ్చి బంగారపు వస్తువులని యమ్మించినాను. శరభరాజుగారి రెండవకుమారుని నగలన్నియు నేను, శోభనాచలము దీసికొని పిల్లవానినోట గుడ్డలు కుక్కినాము. తరువాత నాకును వారికిని వివాదము వచ్చినది. ఇప్పుడు రామచంద్రుని పినతండ్రి జగన్నాథము నాయొద్దకు వచ్చి, రామచంద్రునకు శరభరాజుగారి సంబంధము వచ్చుట కోర్వఁజాలక, యా పెండ్లిఁ జెడఁగొట్టి బీదపిల్లను జేయుమని నన్ను వేఁడుకొన్నాఁడు. కాఁబట్టి నే నీవిధముగా వీబ్రాహ్మణుని కుమార్తెను దొంగిలించుకొని రామచంద్రునకుఁ బెండ్లి జేయఁ దలంచుకొన్నాను. నేఁటికి మీచేతఁ జిక్కినాను.

శంక : నిన్ను వదలరాదు. ఏమోయి వీరాస్వామి! ఈతనిని బట్టుకొని సంకెళ్ళు వేయించు.

అని సంకెళ్ళు వేయించి చామర్తి జనార్దనమును విజయనగర మంపిరిచెను. అక్కడ మహారాజుగా రతనికి నాలుగు సంవత్సర ములు చెఱసాలలో నుండునట్లు శిక్ష విధించిరి.

అందఱు నాదినమున నిండ్లకు బోయిరి. మఱునాఁడు శంకర రావుగారు వచ్చి రామచంద్రునితో నిట్లనిరి. 'అబ్బాయి! నీకు నా కుమార్తె నిచ్చి వివాహము జేయవలెనని యున్నది. నీకు చేసుకొనుట కేమైన నభ్యంతర మున్నదా? మాపిల్లను జేసికొన్న యెడల నీవు మిగుల నభివృద్ధిని జెందగలవు సుమీ' యని చెప్పగానే రామచం ద్రుఁడు 'మీరు నన్ను క్షమించవలెను. నే నిదివరకే శరభరాజుగారి కుమార్తెను జేసికొనుటకు నిశ్చయించుకొన్నాను. మధ్య నీ జనార్ద నము వచ్చి యంతరాయము గల్పించినాఁడు. కాని యీపాటికి వివాహమయి యుండును. కాని మన నియోగులలో నెల్ల మంత్రి ప్రగడవారు మిక్కిలి గొప్పవారు. శరభరాజుగారికి సంవత్సరము నకు మూఁడువేలరూపాయలు వచ్చును. ఆయన జ్యేష్ఠకుమారుఁడు రాజగోపాల మిప్పుడు మాయింట నున్నాఁడు. ఆతనికి మీ కుమార్తె నిచ్చి వివాహముఁ జేయవలసినది. అన్ని విధముల నాకంటె గొప్ప సంబంధము' అని చెప్పగా శంకరరావుగారు 'నీవు వారిపిల్లను జేసికొనవలసినది. మాట తప్పగూడదు. నీ పెండ్లియైన తరువాత చూచుకొందుము. నీవు వెళ్ళుము' అని చెప్పిరి.

రామచంద్రుడు శరభరాజుగారి సంబంధముకంటె శంకరరావు గారి సంబంధ మెక్కువ దనియు; దానివలనఁ దన కనేకలాభము లున్న వనియు నెఱిఁగి మాట ముందుగా నిచ్చినందునను; చిన్న తనమునందు శరభరాజుగారి యింటనున్న విశ్వాసముచేతను; శంకర రావుగారి సంబంధమును నిరాకరించి శరభరాజుగారి కొమార్తెనే చేసి కొనుటకు నిశ్చయించి యమలాపురమునకు రాజగోపాలముతోఁ గూడ బోయెను. త్రోవలో వా రిట్లు మాటాడిరి.

రామ : నేను పెండ్లికిరా నని మీతో నెవరు చెప్పినారు? ముహూర్తమునాఁడు మీ రేమనుకొన్నారు?

రాజ : ముహూర్తమునాడు నీ వింకను వత్తు వని కనిపెట్టు కొని కూర్చున్నాము. ఆ మఱునాఁడు మీపినతండ్రి వచ్చి 'మావాఁడు మీ సంబంధమును జేసికొనఁడఁట. అయన కింత కంటె నెక్కువ వారెవరో వచ్చినారు. మీయిష్టము వచ్చినట్లు మీరు చేసికొనండి' యని చెప్పెను.

ఆమాటలు విని రామచంద్రుఁ డాశ్చర్యపడి తన పినతండ్రి యొక్క యోర్వలేమికి సిగ్గుపడుచుఁ తనతో నతఁడు చెప్పిన మాటలను ప్రసాదరాయఁడుగారి సంబంధమును చెప్పి రాజ గోపాలమును గడువు ప్రొద్దలగునట్లు నవ్వించుచు నమలాపురము జేరి శరభరాజుగారు మొదలగువారికిఁ గూడ నీ వృత్తాంతమును దెలియ జేసెను.

శరభరాజుగా రిదివరకే వివాహ ప్రయత్నములను జేసినందున వైశాఖశుద్ధ నవమినాఁడు రామచంద్రుఁడు పార్వతిని పెండ్లియాడెను. రామచంద్రుని మేనమామయు నాతని కుటుంబము తప్ప మఱి యే బంధువులును పెండ్లికొడుకువైపు రాలేదు. పెండ్లివారికి విశ్వనాథ శాస్త్రులవారి యింట విడిది నేర్పఱచిరి. ఉభయులకును గావలసిన ద్రవ్యమంతయు శరభరాజుగారే వ్యయముచేసి పెండ్లి నమస్తవైభవ ములతోను జేసిరి. శ్రావ్యమైన తూర్యారావములతోడను, ముత్తైదు వుల పాటలతోడను, బచ్చని పందిళ్ళతోడను, విప్రాశీర్వాద ధ్వాన ములతోడను వివాహము మనోహరముగా జరిగెను. శరభరాజుగారు తక్కువ సంబంధమును దెచ్చుకొన్నారని వారి బంధువు లెవ్వరును రాలేదు. అమలాపురమునందే విద్యార్థిగా నుండి యచ్చటనే యన వింధపాలయి, మరల నా గ్రామమునందే కడుమర్యాదగా వివాహ మాడుచున్న రామచంద్రునిఁ జూచి యందఱును సంతోషించిరి. అయిదుదినములును వివాహమైన తరువాత పదునాఱుదినములపండుగ

యగుపటకు నమలాపురమునందే యుండి. రామచంద్రుఁడు పిమ్మట కోటిపల్లి వెళ్లెను.

వివాహమైన రెండుమాసములలోనే శంకరరావుగారు దమ కుమార్తెను శరభరాజుగారి జ్యేష్ఠకుమారుఁడగు రాజగోపాలమున కిచ్చి పెండ్లిఁజేసిరి. ఇట్లు శరభరాజుగారును శంకరరావుగారును వియ్యంకు లగుటచేత రామచంద్రుని యందు శంకరరావుగారు మునుపటి కంటె నెక్కువ దయగానుండిరి. తరువాత రాజగోపాలమునకును శంకర రావుగారు విజయనగరమునం దుద్యోగము నిప్పించి యతని నచటికి దీసికొనిపోయిరి.

వివాహమైన యెనిమిది మాసములకే పార్వతి వ్యక్తురాలయి నందున మఱినాలుగు మాసములకు శరభరాజుగా రామెకుఁ దగిన సారె బెట్టి కాపురమునకుఁ బంపిరి. పార్వతియు రామచంద్రుఁడును గోటి పల్లెలో గాపురము చేయుచుండిరి.





# ఇంటింటా సరస్వతీ పీఠం

## ఎమెస్కో సంప్రదాయ

## సాహితీ పరంపర

[ప్రాచీన మహాకావ్యాల ఎమెస్కో ప్రచురణలు ఆధునిక యువతీ యువకుల సంప్రదాయ సాహిత్యాభిరుచి పునరుజ్జీవనానికి విస్తృత దోహదానికి నూతన ప్రణాళిక ]

| | సాదా | లైబ్రరీ |
|---|---|---|
| మనుచరిత్రము | 2-00 | 3-75 |
| వసుచరిత్రము | 3-00 | 4-75 |
| ఆముక్త మాల్యద | 3-00 | 4-75 |
| పాండురంగ మాహాత్మ్యము | 4-00 | 6-00 |

"దేశభాషలందు తెలుగులెస్స". తెలుగుభాషకు అంతశ్శక్తిని అటువంటి అసదృశ మాధుర్యాన్ని సంతరించి ఈ అనన్య ప్రశంసకు అర్హతను కూర్చిన చరితార్థ జన్ముల మహాకావ్యములు ఈ పైనాల్గు పుస్తకములున్నూ. ఈ పరంపరలో వచ్చేదే:

"శ్రీనాథుని శృంగార నైషధం"

తెలుగు వారందరికీ అక్షర ఔరసత్వంగా సంక్రమించిన పెన్నిధి ఎమెస్కో సంప్రదాయ సాహిత్య ప్రచురణల ద్వారా మీకు అందజేయబడుతున్నది.

—: ప్రతులకు త్వరపడండి :—

## యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్టణము : : మద్రాసు-1

# ఇంతవరకు వచ్చిన

# ఎమెస్కో పాకెట్ పుస్తకాలు




1. దిండుక్రింద పోకచెక్క -
విశ్వనాథ సత్యనారాయణ (నవల) (Reprint)
2. బ్రతికిన కాలేజి - పాలగుమ్మి పద్మరాజు (న) (Reprint)
3. సాక్షి-ముళ్ళపూడి వెంకటరమణ (సినిమాస్క్రిప్టు)
4. గ్రహణం విడిచింది-ద్వివేదుల విశాలాక్షి (న) (Reprint)
5. విచిత్రనళీయం-చలం (హాస్య, వ్యంగ్య కథలు)
6. పిడికెడు ఆకాశం-గొల్లపూడి మారుతీరావు (నవల)
7. హౌస్‌సర్జన్-కొమ్మూరి వేణుగోపాలరావు (న) (Reprint)
8. నిరీక్షణ-ఉన్నవ విజయలక్ష్మి (నవల)
9. కాశ్మీరపట్టమహిషి- పి. గణపతిశాస్త్రి (నవల)
10. ఆత్మబలి-సి. ఆనందారామం (నవల)
11. సుఖంకోసం-వీరాజీ (నవల)
12. బంధమూ, అనుబంధమూ-పి. వి. కృష్ణమూర్తి (నవల)
13. స్వీట్‌హోం-ముప్పాళ్ళ రంగనాయకమ్మ (న) (Reprint)
14. నూరు శరత్తులు-మంజుశ్రీ (నవల)
15. కోనేరూ, సెలయేరూ-వాసమూర్తి (నవల)
16. ఇదే దారి-బలివాడ కాంతారావు (నవల)
17. బుద్ధుని జాతక కథలు-శ్రీ శివశంకరస్వామి
18. అహం-అనర్థం-ముద్దంశెట్టి (నవల)
19. స్వయంవరణం-మహీధర రామమోహనరావు (నవల)
20. అదృష్టచక్రం-హరికిషన్ (నవల)
21. వక్రగతులు-ఇతర కథలు-మధురాంతకం రాజారాం
22. గిరీశం ది గ్రేట్: సెకండ్ స్టెప్-వడ్లమన్నాటి (వ్యంగ్యరచన)
23. సామాన్యుడి కామన-హితశ్రీ (నవల)
24. ప్రాణాంతక ప్రణయం-వి. యస్. అవధాని (నవల)
25. శ్రుతితప్పిన రాగం-పి. వి. రాజమన్నారు (నవల)
'6. చిట్లీ చిట్లని గాజులు-విశ్వనాథ సత్యనారాయణ (నవల)
7. దైవమిచ్చిన భార్య-చలం (నవల)

8. రత్నకంబళం-రేవనూరి శమంత (నవల)
9. వారధి-ద్వివేదుల విశాలాక్షి (నవల)
0. అపరాజిత-వాకాటి పాండురంగరావ్ (కథలు)
1. పూల తెరలు-కోమలాదేవి (నవల)
2. అది ప్రశ్న, ఇది జవాబు-అవసరాలరామకృష్ణారావు (న)
3. ఇద్దరం ఒకటే-వీరాజీ (నవల)
4. కల్యాణ ఘడియ-అద్దేపల్లి వివేకానందాదేవి (నవల)
5. ప్రేయసి : ప్రియంవద-ఉషశ్రీ (జంట నవలలు)
6. దరిజేరిన ప్రాణులు-ఇల్లిందల సరస్వతీదేవి (నవల)
7. హారతి-కొమ్మూరి వేణుగోపాలరావు (నవల)
8. వెన్నెల కాచేసింది-గొల్లపూడి మారుతీరావు (నవల)
9. సరళీస్వరాలు-నందుల సుశీలాదేవి (నవల)
0. మంచుపల్లకి : మరితొమ్మిది-శ్రీపతి (కథలు)
1. దుఃఖితులు-రంది సోమరాజు (నవల)
2. చైత్రపూర్ణిమ-పి. గణపతిశాస్త్రి (కథలు)
3. బ్రతుకుజోడు-ఏ. లక్ష్మీరమణ (నవల)
4. సిపాయి కూతురు-కొవ్వలి లక్ష్మీనరసింహారావు (నవల)
5. కొత్తనీరు-డి. కామేశ్వరి (నవల)
6. లేడీ డాక్టర్-నండూరి విఠల్ (నవల)
7. పూదోటలో గంటుముళ్ళు-గంటి (శిఖా) వెంకటరమణ (న)
8. జీవితదృశ్యాలు-మంజుశ్రీ (కథలు)
9. లావణ్య-మాలతీచందూర్ (నవల)
50. ఆరాధన-యద్దనపూడి సులోచనారాణి (నవల) (Reprint)
51. సౌదామని-విశ్వనాథ సత్యనారాయణ (నవల)
52. కన్యాశుల్కం-గురజాడ అప్పారావు (నాటకం) (Reprint)
53. జీవితాదర్శం-చలం (నవల)
54. చీకటి కడుపున కాంతి-సి. ఆనందారామం (నవల)
55. ఇంతకీ నే నెవరు ?- కపిల కాశీపతి (నవల)
56. మనుషులు, మనసులు- పవని నిర్మల ప్రభావతి (నవల)
57. వెలుగులో వెలది-గంధం యాజ్ఞవల్క్య శర్మ (నవల)
58. పెళ్ళిచెయ్యకుండా చూడు-కొడవటిగంటి (కథలు)
59. కవిద్వయము-నోరి నరసింహశాస్త్రి (నవల)
60. సంహారంచేసినమనిషి-పోలాప్రగడ సత్యనారాయణమూర్తి (న)
61. అచలం : చంచలం-రేవనూరి సువర్ణ (నవల)

62. చీకటిదారి : చిన్నవదినె-కె. రామలక్ష్మి (నవలికలు)
63. రాజశేఖర చరిత్రము-కందుకూరి వీరేశలింగము (నవల)
64. నల్లరేగడి-పాలగుమ్మి పద్మరాజు (నవల)
65. ఏటిఒడ్డున నీటిపూలు-కొలిపాక రమామణి (నవల)
66. మహానగరంలో స్త్రీ- లత (నవల)
67. చిలకమర్తి ప్రహసనములు-చిలకమర్తి లక్ష్మీనరసింహము
68. మైదానం-చలం (నవల)
69. హాట్ హోం-శార్వరి (నవల)
70. ఆనాపీలర్-జీవనరాగం-సౌరిస్ (నవలికలు)
71. 1968 కథానికలు-సంకలన : పతంజలి, మురళీధర్ (కథలు)
72. పుణ్యభూమి-బలివాడ కాంతారావు (నవల)
73. చేదునిజాలు-పరిమళా సోమేశ్వర్ (నవల)
74. చిత్రకారుడి భార్య-మురయా (నవల)
75. రామానుజుని ప్రతిజ్ఞ-పి. రాజగోపాలనాయుడు (నవల)
76. దూతమేఘము-విశ్వనాథ సత్యనారాయణ (నవల)
77. హరివిల్లు-ద్వివేదుల విశాలాక్షి (నవల)
78. కొత్త ఇల్లు-తాళ్ళూరు నాగేశ్వరరావు (నవల)
79. ముత్యాల పందిరి-పోరంకి దక్షిణామూర్తి (నవల)
80. గద్వాల చీర-పన్యాల రంగనాథరావు (నవల)
81. మేఘాల మేలిముసుగు-మాలతీచందూర్ (నవల)
82. గణపతి-చిలకమర్తి లక్ష్మీనరసింహము (హాస్య నవల)
83. బ్రతుకు బొంగరం - రావులపాటి సీతారాంరావు (నవల)
84. శారదరాత్రులు - వేదుల శకుంతల (నవల)
85. స్నేహబంధం-అంగర వెంకటసత్యనారాయణరావు (నవల)
86. హంపీకన్యలు - యవనవ్వనం (రెండు నవలికలు) - చలం
87. విద్యార్థి సాహితి — కథాంజలి
88. నిశ్శబ్ద సంగీతం — సి. ఆనందారామం (నవల)
89. తొణికిన స్వప్నం : తొలగిన స్వర్గం-రేవనూరి శమంత (న)
90. కంఠాభరణము — పానుగంటి లక్ష్మీనరసింహారావు (సాంఘిక నాటకం)
91. నాటకాలరాయుడు-గొల్లపూడి మారుతీరావు (సినీస్క్రిప్టు)
92. త్రిశంకుడి స్వర్గం-మధురాంతకం రాజారాం (నవల)
93. మల్లిక-పణతుల రామచంద్రయ్య (నవల)
94. ప్రేమించు ప్రేమకై - కె. రామలక్ష్మి (నవల)
5. మనిషి-నందూరి విఠల్ (నవల)

96. బుద్ధిమంతుడు-ముళ్లపూడి వెంకటరమణ (సినీమాస్క్రిప్టు)
97. మాతృమందిరము-వేంకట పార్వతీశ్వరకవులు (నవల)
98. రెండవ అశోకుడి మూణ్ణాలపాలన-పాలగుమ్మి పద్మరాజు (న)
99. ఆత్మీయులు-యద్దనపూడి సులోచనారాణి (సినీనవల)
100. ఒకేపాటకు రెండురాగాలు- కొమ్మూరి వేణుగోపాలరావు (నవల)
101. లలితాపట్టపురాణి-విశ్వనాధ సత్యనారాయణ (నవల)
102. చిల్లరదేవుళ్లు-దాశరధి రంగాచార్య
103. దాంపత్యాలు-కోమలాదేవి
104. హాస్యసంజీవని-కందుకూరి వీరేశలింగం
105. అనుభవం-కొడవటిగంటి కుటుంబరావు
106. సమత-వాసిరెడ్డి సీతాదేవి
107. ఆడక తెర-హరికిషన్
108. యముడిముందు చలం-గుడిపాటి వెంకటచలం
109. కొడిగట్టిన దీపాలు-ఐ. వి. ఎస్. అచ్యుతవల్లి (నవల)
110. అదృష్ట రేఖ-శివరాజు సుబ్బలక్ష్మి ,,
111. విధి వంచితలు-డి. కామేశ్వరి ,,
112. గోమతి-ద్వివేదుల విశాలాక్షి ,,
113. జై జవాన్-యద్దనపూడి సులోచనారాణి (సినిమా స్క్రిప్టు)
114. (సి) సీతిచంద్రిక-రావి కొండలరావు (నవల)
115. దయ్యాలు లేవూ? - లత ,,
116. ఊబిలో దున్న-వినుకొండ నాగరాజు ,,
117. రాజరాజు-శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ,,
118. బ్రతుకుబాట - పి. సత్యవతి
119. ఎదురద్దాలు - ఇచ్ఛాపురపు జగన్నాధరావు
120. ఎక్కడుంది ప్రశాంతి - కొలకలూరి ఇనాక్
121. జాజిమల్లి - అడివి బాపిరాజు
122. నవదేవత - వి. ఎస్. రంగస్వామి
123. రంగుల వల - ఎమ్. పార్థసారథి
124. సహజీవన సౌభాగ్యం - అవసరాల రామకృష్ణారావు
125. అసమర్థుని జీవయాత్ర - త్రి. శే. గోపీచంద్
126. దంతపు దువ్వెన - విశ్వనాథ సత్యనారాయణ
127. గిరీశం ది గ్రేట్ ఫిలిం ప్రొడ్యూసర్ - వడ్లమన్నాటి కుటుంబరావు
128. విధి వినోదం - రోషన్
129. రామచంద్ర విజయము - చిలకమర్తి లక్ష్మీనరసింహము

## ఎమెస్కో సంప్రదాయ సాహితి

ESS-1 మనుచరిత్రము
ESS-2 వసుచరిత్రము
ESS-3 ఆముక్తమాల్యద
ESS-4 పాండురంగ మాహాత్మ్యము

## ఎమెస్కో పిల్లల పుస్తకాలు-పిల్లల కథలు - బాపు రంగు రంగు బొమ్మలతో

వెల : ఒక్కొక్కటి రూ. 1-50

ECB 1 కొంగడాక్టరు
ECB 2 పాయసం తాగిన పిచ్చిక
ECB 3 ఎండ్రకాయ యుక్తి
ECB 4 మీ ఆరోగ్యం

2-12-86